# ఎవరన్నారు 'శాంతా' టీకాల కంపెనీ మాత్రమేనని...?

స్వదేశీ ప్రజ్ఞను బహుముఖాలుగా
వెలారిస్తున్న శాంతాగ్రూప్
రథసారథులు
తెలుగువారే...!

క్యాన్సర్, హెపటైటిస్-బి వంటి అనేక భయానక వ్యాధుల
చికిత్సలో ఉపయోగపడే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా 2
**శాన్ ఫెరాన్**

భారతదేశంలో మునుపెన్నడూ
లేని విధంగా యునిసెఫ్‌కు టీకాల విక్రయం

అంతర్జాతీయ ధార్మిక సంస్థల కోరిక మేరకు
వారి తరపున టీకాల ఉత్పత్తి



అనుబంధ సంస్థ **శాంతా వెస్ట్**
(అమెరికా) ద్వారా క్యాన్సర్
చికిత్సా మూలకాలపై పేటెంటు

కాంట్రాక్టు పద్ధతిపై ఫారిన్
కంపెనీల తరపున పరిశోధన

హృద్రోగులకు
అత్యవసర సమయాలలో
ప్రాణదానం చేసే
స్ట్రెప్టోకైనేస్
**శాన్ కైనేస్**

చికిత్సకు లొంగని కాలేయపు వ్యాధి
హెపటైటిస్-బి నివారణకై **శాన్‌వాక్-బి**

చిన్నపిల్లలకు పలుమార్లు టీకాలు వేసే అగత్యం
తప్పించే కాంబినేషన్ వ్యాక్సిన్‌లను అభివృద్ధి చేస్తూ...
కలరా, టైఫాయిడ్, హిబ్, మెనింగోకోకల్
టీకాల రూపకల్పనలో ముందుకు సాగుతూ...

ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడికి
అందుబాటు ధరలో అందించే లక్ష్యంలో భాగంగా
విదేశాలపై ఆధారపడకుండా స్వదేశీ పరిశోధన

## ఔను... 'శాంతా' టీకాలు కూడా తయారు చేస్తుంది...

ఆ మాటకొస్తే శాంతాకు అనేక జాతీయ, అంతర్జాతీయ ప్రశంసలు, అవార్డులు లభించడానికి తొలి సోపానం టీకాలను పరిశోధించి, తయారు చేసి, మార్కెట్టు చేయడమే!

శరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే జీవప్రక్రియ ద్వారా తయారయిన బయోటెక్ ఉత్పాదనలు మానవాళికి అనువైనవి. ఆరోగ్యరీత్యా సురక్షితమైనవి.

**బయోఫార్మా రంగంలో ప్రపంచపటంలో భారతదేశానికి స్థానం కలిగించిన ఔషధ సంస్థ శాంతా బయోటెక్నిక్స్**

- Pioneers in r-DNA Based Human Healthcare Products in India
- Customised Monoclonal & Polyclonal Antibodies
- Recombinant Protein Development, Manufacturing & Formulation
- Vaccines, Therapeutic Products & Diagnostics
- cGMP Compliant Facility for Manufacturing Biopharmaceuticals
- Nutraceuticals

W.H.O.(Geneva) Pre-qualified U.N.Supplier of Hepatitis-B Vaccine

SHANTHA BIOTECHNICS PVT. LTD.
www.shanthabiotech.com
3rd Floor, Serene Chambers, Road No.7,
Banjara Hills, Hyderabad - 500 034. A.P., INDIA.
Ph: +91-40-23548507, 23543010, 23608843
Fax: +91-40-23548476
Email: info@shanthabiotech.com



# హాసం

హాస్య - సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

72

**Also available on net:**
**www.haasam.com**

**ముఖచిత్రం**
'శంకర్‌దాదా ఎమ్.బి.బి.ఎస్' చిత్రంలో చిరంజీవి, సోనాలిబింద్రే



## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో

సినిమా పాటల ప్రత్యేకం






## సంగీతం



పాత పాటల ప్రత్యేకం
71వ పేజీ నుండి74 వ పేజీ వరకూ



# శ్రీ యా జనవాక్యం

'హాసం' పత్రికకు 'సంగమ్' అకాడమీ వారు ఉత్తమ పత్రికగా అవార్డు ఇచ్చారని తెల్సుకుని చాలా సంతోషించాను. 'హాసానికి' మా అభినందలు.

-యస్.వాణీస్వయం ప్రభాదేవి,విశాఖపట్నం.

1-15సెప్టెంబర్ 'హాసం'సంచికలో 'కొమ్మా కొమ్మా కోకిలమ్మా' శీర్షికన ఇంద్రగంటి జానకీ బాలగారందించుచున్న నేపథ్య గాయనీ మణుల జీవిత చిత్రాల పరంపరలో భాగంగా జిక్కిగారి గురించి మాకు తెలియని విషయాలు విదితమైనవి. నిజంగా జిక్కిగారి నిజ జీవితంలోని విషయాలను మాకు తెలిపిన జానకీ బాల గారికి హ్యాట్సాఫ్. జిక్కి హిట్స్ క్రింద ఇచ్చిన 11 పాటలను భద్రపరచుకున్నాము! 'నేనూ నా పాటలు' శీర్షికన శ్రీమతి జమున గారందించిన 'మూగమనసులు' సినిమా పాటలు, షూటింగ్ సమయంలో జరిగిన సంఘటనలు అలరించాయి.

-ఏ. జయలక్ష్మి,గుర్రంపోడు.

'హాసం' 71 సంచిక చూశాను. సరిగపదమని ప్రతిసారి పూరించి పంపుతున్నాము ఈ సారి జిక్కి పాటలు, రఫీ వ్యాస పరంపరలో సూచించిన పాటలు ఎవరైనా సిడి చేసి అందించితే బాగుండును అనిపించింది. రఫీ ప్రేమ గీతాలు చదువుతూంటే ఆ పాటల దృశ్యాలు జ్ఞాపకం వచ్చి ఆనందం కలిగింది. డా॥దులిటిల్ కూడా చదివి ఆనందిస్తున్నాము. కైరం భూమా గౌడ్ గురించి తెలిపి తనికెళ్ళ భరణిగారు ఔరా వారిలో ఇటువంటి వారున్నారా అనిపించారు. యం.యస్. విశ్వనాథన్ గారి సన్మాన ఫొటో చిత్రమాలిక బాగుంది.

-యు. మోహన్‌బాబు, అవనిగడ్డ.

1-15సెప్టెంబర్ 'హాసం' సంచిక చాలా బావుంది. ముఖ్యంగా మాకిష్టమైన జిక్కి పాటలు వేసినందుకు చాలా థ్యాంక్స్. ఉత్తమ పత్రికగా 'హాసం' ఎన్నికయినందుకు మాకు చాలా ఆనందంగా వుంది. ఇలాంటి అవార్డులు ఇంకా రావాలని కోరుకుంటున్నాము.

-సి. విజయసారథి, కర్నూలు.

నేను గత రెండున్నర సంవత్సారాల నుండి నేను రేడియోలో వాణిజ్య ప్రకటనలు విని 'హాసం' పత్రికకు అలవాటుపడ్డాను. ఒక్క పుస్తకం కూడా చెదిరి పోకుండా పొదుపుగా భద్రంగా వుంచాను. హాసంక్లబ్బులు ఎంతో ఆదరణ పొందుతున్నాయి.

-కూనపరెడ్డి రమేష్‌బాబు,బందరు.

1-15 సెప్టెంబరు 'హాసం' పత్రికలో జమునగారు 'మూగమనసులు'లోని పాటలు గురించి, ఆనాటి పాటల సాహిత్య విలువలు గురించి చక్కగా తెలియజేసారు. అప్పటి పాటలు సింపుల్‌గా కనిపించినా అందులో లోతైన భావాలు ఉండేవి. మూగమనసులు, 'దేవదాసు' మల్లీశ్వరి వంటి క్లాసికల్ చిత్రాలు ప్రేక్షకుల గుండెల్లో కలకాలం నిలిచిపోతాయి. అటువంటి చిత్రాలు మునుముందు యిక రాలేవు అనడానికి సందేహం లేదు.

-వరదా. సాయికుమార్, ఒరిస్సా.

1-15 సెప్టెంబరు సంచికలో మీరు నా రచనను ప్రచురించినందుకు ఆనందం కలిగింది. మీరు పంపిన ఆడియో సి.డి. అందింది. సంచిక కూడా అందింది. మీరు చూపిన ఆదరాభిమానాలకు కృతజ్ఞతా భివందనాలు

-జయంతి వెంకటరమణ, పెందుర్తి.

1-15 సెప్టెంబరు నాటి 'హాసం' లో నేనూ నా పాటలు శీర్షికలో మా అభిమాన నటసామ్రాట్ అక్కినేని వారి ఎవ్వర్ గ్రీన్ చిత్రం 'మూగమనసులు' పాటలు. పాత పాటలు శీర్షికలోని 'ఆత్మీయులు చిత్రగీతాలు, నన్నలరించాయి.

-దోవారి నాగేశ్వరరావు, వేకనూరు(కృష్ణా).

'హాసం' సంచిక చూశాము. చాలా బాగున్నది. 'ఆత్మీయులు' ప్రత్యేకం వల్ల సినిమా చూసిన అనుభూతి కలిగింది. ఆ పాత మధురం 'భార్యా భర్తలు' హైలైట్. రఫీ ప్రేమ గీతాలు చాలా బాగున్నాయి. మట్టి కొట్టుకు పోతున్న ఈతరం పాటలు అని ఆఖరు వాక్యాలలోని వ్యధ రచయితతో పాటు మేము కూడా పంచుకుంటున్నాము. ఇక్కడ దొరకదు హాసం! అది మాకు లాస్ !

-ఆర్. సంజయ్ రెడ్డి, అదిలాబాద్.

నా మానస పుత్రిక 'హాసం' పత్రికలో పాత సంచికలు కావాలా? అనే ప్రకటన చూసి 16-31 అక్టోబరు 03 (సంచిక నెం:50) సంచిక కోసం పది రూపాయలు ఎమ్.ఓ. చేసాను. ఎమ్.ఓ. రశీదు నాకు రాక ముందే పాత సంచిక వచ్చింది. ముందురోజు పత్రిక ఆ తర్వాతే రశీదు వచ్చింది. అంత క్రమశిక్షణతో పనిచేస్తున్న మీకార్యాలయ సిబ్బందికి అభినందన చెప్పకుండా ఉండలేక ఈ ఉత్తరం. పత్రిక 4వ సంవత్సరంలోకి అడుగిడబోతున్న సందర్భంగా ఒక కొత్త శీర్షికను అందరూ మెచ్చేరీతిలో ప్రవేశపెట్టగలరని ఆశిస్తూ ఆకాంక్షిస్తూ.... శతమానం భవతి.... మీ హాస్యాభిమాని

-మేడా మస్తాన్‌రెడ్డి, విశాఖపట్నం.

వృత్తి రీత్యా నేను డాక్టర్ని. చిన్నప్పటినుండి పాటలు పాడటం అలవాటు. స్వంతంగా హార్మోనియం నేర్చుకున్నాను. మీ 'హాసం' పత్రికను మొదలు పెట్టినప్పటి నుంచి రెగ్యులర్‌గా తెచ్చుకుని చదువుకుంటున్నాం. సంగీతం గురించి మీరు వివరిస్తున్న తీరు అపూర్వం, అనిర్వచనీయం. ఇంతవరకూ ఏ పత్రికా ఇలా చేయలేదు.

-డా॥యస్.రాజశేఖర్ రెడ్డి,మహబూబ్‌నగర్.

'హాసం' (1-15 సెప్టెంబర్) లో మృణాళినిగారి వ్యాస పరంపరలోని 'రఫీ ప్రేమ గీతాల' శీర్షిక క్రింద 'ప్రేయసి సౌందర్యం, రఫీ స్వరంలో తన్మయం' వ్యాసం వివరణాత్మకంగా వున్నది. పాత హిందీ పాటలను ముఖ్యంగా రఫీగారి పాటలంటే చెవికోసుకొనే నేను 'హాసం' లో మొదట చదివేది మృణాళినిగారి శీర్షికనే. 'ససురాల్' సినిమాలోని 'తెరి ప్యారీ ప్యారీ' పాటను పూర్తిగా అందించినందుకు మృణాళిని గారికి కృతజ్ఞతలు. 'సూరజ్' సినిమా లోని 'బహారోం ఫూల్ బర్ సావో మేరా మహబూబ్ ఆయా హై' పాటను కూడా పూర్తిగా ఇస్తే మాలాంటి పాత హిందీ పాటల భద్రపరచుకొనే వాళ్లంతా సదా మీకు ఋణపడి వుంటాము. 'ఆపాత మధురం' శీర్షికన మీరందించిన 'భార్యాభర్తలు' సినిమా పాటలు, వాటి వివరణ బాగున్నది.

-ఏలూరు అశోక్ కుమార్ రావు, గుర్రంపోడ్.

**(బహారోం ఫూల్ బర్ సావో పాట గురించి 16-31 మార్చి 2002 సంచికలో వివరంగా ఇచ్చాం.-ఎడిటర్)**

1-15 'హాసం' పత్రికలో "కొమ్మా కొమ్మా కోకిలమ్మ" శీర్షికలో 'కీలు గుఱ్ఱం', సినిమాలో 'కాదు సుమా కలకాదు సుమా', పాటలో అభినయంలో అక్కినేని, సూర్యశ్రీఅని ప్రచురించేరు. దిన పత్రిక 'ఆంధ్రజ్యోతి శుక్రవారం 'వినోదం' ఎడిషన్‌లో పాటకు పట్టాభిషేకం' శీర్షికలో ఇదే పాటకు అభినయం అక్కినేని, లక్ష్మీరాజ్యం అని ప్రచురించేరు. నా ఈ సందేహం మన పత్రికా ముఖంగా తీర్చగలరని ఆశిస్తున్నాను.

-సోమయాజులసుబ్రహ్మణ్యం శర్మ, పలాస.

**('కాదు సుమా కల కాదు సుమా' పాటలో నటించినది సూర్యశ్రీ కాదు జూనియర్ లక్ష్మీరాజ్యం -ఎడిటర్)**

నేటి బిజీబ్రతుకులకి కాస్తంత టానిక్‌లా పనిచేసే పత్రిక అవసరం. అదే హాసం! ముఖ్యంగా 'హాసం' కబ్బుల వివరాలు ప్రముఖంగా ప్రకటిస్తూ మమ్మల్ని క్లబ్బుకు హాజరయ్యేట్టు చేసిన మీ కృషి అభినందనీయం. హాస్యం గల మినీ కవితలు పంపితే ప్రచురిస్తారా! రాంభట్లవారి చమత్కృతులు చదివి ఆనందించాం.

-జి. జి.కె. రావు, విశాఖపట్నం.

**(తప్పకుండా ప్రచురిస్తాం - ఎడిటర్)**

సంపుటి: 3 సంచిక:24

**16-30 సెప్టెంబరు 2004**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్) : $ 400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

72

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

మేనేజర్
పి.గిరి
చీఫ్ లే-అవుట్ డిజైనర్
జి.రాజేష్

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

**ఈ** సంచికతో 'హాసం' మూడేళ్లు పూర్తి చేసుకుంటోంది. ప్రోగ్రెస్ రిపోర్టు చూసుకోవలసిన తరుణమే!

ఈ మూడేళ్లలో 'హాసం' ఒక మంచి పత్రికగా ఎల్లెడలా పేరు తెచ్చుకుంది. రెండే రెండు సబ్జక్టులతో పత్రిక నడపగలరా? విషయం దొరుకుతుందా? లేకపోతే రకరకాల అంశాలు కలగలపి మామూలు కలగూరగంప పత్రికలా చేసేస్తారా? అన్న సందేహాలు పటాపంచలయ్యాయి. హాస్యం, సంగీతం అనే రెండు విషయాల విస్తృతి, పరిధి ఎంత విశాలమైనదో ఈ 71 సంచికలలో నిరూపించాక 'మన సందేహాలు నిరాధారాలు సుమా' అని సంశయాత్ములు సైతం ఒప్పుకుని అభిమానులుగా మారే పరిస్థితి వచ్చింది.

అంతవరకు సంతోషమే కాని, అభిమానం కాస్త ముందుకు వెళ్లి 'మీరు ఫలానావారిపై వ్యాసం వేస్తూ ఫలానా పాట వేయనే లేదు',' అసలు ఆయన రచనల్లో ఆణిముత్యం లాటిదాన్ని వదిలిపెట్టేశారు' వంటి వ్యాఖ్యలూ, ఫిర్యాదులూ చేస్తూంటే మాకు నవ్వు వస్తూంటుంది. ఎందుకంటే అనేకసార్లు చెప్పడం జరిగింది, 'హాసం' సావనీర్ కాదు. ఒక కళాకారుడి జీవితాన్ని పుక్కిటబట్టి ఒకేసారి ఏకరువు పెట్టవలసిన అగత్యం లేదు. ఇది నిరంతరంగా సాగే ఓ జీవవాహిక, జీవనస్రవంతి. కళాకారుల గురించి ముచ్చటించుకోవడానికి అనేక సందర్భాలు వస్తూ ఉంటాయి. ఒక్కొక్కసారి ఒక్కో కోణానికి ప్రాధాన్యత ఇచ్చి ప్రస్తావించడం జరుగుతూ ఉంటుంది. ఎవరినీ నిర్లక్ష్యం చేయడం కానీ, విస్మరించడం కానీ జరగదు.

దీని గురించి ఇదివరకే చెప్పినా మళ్లీ మళ్లీ పాఠకులు అడుగుతున్నారంటే కారణం వారు 'హాసం' తో ఏర్పరచుకున్న మానసిక అనుబంధం. 'ఇది మా పత్రిక. మా అభిరుచులకు అనుగుణంగా ఉంటుంది, ఉండాలి' అని ఎవరికి వారే ఫీలయి పత్రికతో మమేకం కావడం వల్లనే ఇటువంటి పరిస్థితి తలెత్తుతుంది.

ఇది కూడా మా విజయాలలో ఒకటి! సాధారణంగా వినియోగదారుడు ఏదైనా వస్తువును డబ్బిచ్చి కొనుక్కోవడంతో విక్రేతకు, అతనికి బంధం తీరిపోతుంది. వస్తువు గురించి ఫిర్యాదు చేసే సందర్భం వస్తే తప్ప అతడు విక్రేత గురించి పట్టించుకోడు. కానీ 'హాసం' విషయంలో మాత్రం పత్రిక వేస్తున్న ప్రతి అడుగునూ పరీక్షగా చూస్తూ, అభినందిస్తూ , స్పందిస్తూ నిర్వహణలో 'ఇన్వాల్వ్' అవుతున్నారు.

మామూలు పాఠకులే కాదు, మేధావి వర్గం కూడా తమ భావాలను పంచుకోవడానికి 'హాసం'ను వేదికగా చేసుకోవడం మా విజయాలో ఒకటి. మా పత్రికకు రచనలు రాసేవారి జాబితా చూస్తే ఎవరికైనా విస్మయాన్ని కలిగించేదే! మూడేళ్లు కూడా నిండని పత్రికకు ఇంత గుర్తింపా? అన్న అబ్బురం కలుగుతుంది.

ఇవిగాక అప్పుడే రెండు ప్రతిష్టాత్మకమైన అవార్డులు 'హాసం' ఖాతాలో జమ పడ్డాయి. యూరోపియన్ తెలుగు అసోసియేషన్ వారు గత సంవత్సరం ఉత్తమ పత్రికగా సంభావిస్తే ఈ ఏడాది సంగమ్ అకాడెమీ వారు ఎడిటరుకు, పబ్లిషర్‌కు అవార్డులు ఇచ్చి సత్కరించారు. ఆనాటి వేదికపై ప్రముఖ హాస్యనటులు బ్రహ్మానందం మాట్లాడుతూ ఉత్తమచిత్రం, ఉత్తమ నటుడు వంటి అవార్డులు ఇవ్వడం సర్వసాధారణమనీ, కానీ 'హాసం' కృషిని గుర్తించి ఉత్తమ పత్రికకు అవార్డు ప్రకటించడం ఉల్లేఖనీయమని ప్రస్తుతించారు.

అయినప్పటికీ మేము ఇంకా చేరవలసినంతమందిని చేరలేకపోతున్నామన్న విషయం మమ్మల్ని అప్రమత్తం చేస్తోంది. ఇటువంటి అభిరుచి గల వారెందరికో 'హాసం' గురించి ఇంకా తెలియదు. ఈ ఏడాదిలోనే ప్రారంభమై అంతకంతకు విస్తరిస్తున్న 'హాసం క్లబ్' ఉద్యమం వల్ల పలువురు హాస్యసంగీతాభిమానులకు 'హాసం' గురించి అవగాహన ఏర్పడుతుండటం కూడా ఈ సందర్భంగా మాకు కొంత ఉపశమనాన్ని ఇస్తోంది. వచ్చే ఏడాది మా రిపోర్టు ఇంతకంటె బాగుంటుందని హామీ ఇస్తూ.. ప్రోత్సహిస్తూన్నవారందరికీ కృతజ్ఞతల నర్పిస్తున్నాం.





సెప్టెంబరు 21న తన జన్మదినం సందర్భంగా 21వ కథగా ప్రముఖ దర్శకుడు శ్రీ సింగీతం శ్రీనివాసరావు 'హాసం' పాఠకుల కోసం ప్రత్యేకంగా రాసిన కథ ఇది.

కరాజు కథలు 21

# బాదరాయణ సంబంధం




కరాజు రాజ్యంలో సర్వజ్ఞాన సార్వభౌమ శ్రీబాదరాయణభట్టు పేరు వినని వారు లేరు. ప్రజల విద్యుక్త ధర్మాలను గురించి ప్రతివారం అద్భుతమైన ప్రసంగాలను చేస్తూంటాడు. ఎవరెవరు ఏయే విధంగా సంఘానికి సేవలందించవచ్చో విశదీకరిస్తాడు. రాజ్యంలో అన్ని చోట్లా సంఘాలేర్పరచి అందరూ అందులో సభ్యులై పరిశుభ్రత-ఆరోగ్య సూత్రాల వివరణ, రాజ్య రక్షణ, లలిత కళా ప్రోత్సాహం లాంటి అనేక సేవలను చేపడ్తే అనతి కాలంలోనే ఈ రాజ్యం రామరాజ్యమై ఆనంద జీవనానికి నిలయ మౌతుందని భట్టుగారు ఎప్పుడూ ఉద్ఘాటిస్తూనే వుంటారు. ఇటువంటి అమూల్యమైన ఉపదేశాలను అందజేస్తున్న భట్టుగారిని తగురీతిన సత్కరిస్తే బాగుంటుందని మంత్రి కరాజుకు విన్నవించుకున్నాడు. కాని కరాజు దీనికి ఎటువంటి జవాబు చెప్పకుండా ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"మహారాజా! తమర్నేదో తీవ్రంగా కలవర పెట్టేట్టుంది. అదేమిటో తెల్సుకోవచ్చా?" అనడిగాడు మంత్రి వినయంగా.

"మంత్రీ! నేను ఆలోచించేది రాతిబండ రత్తయ్యను గురించి. నిన్ననే అతనికి అయిదు సంవత్సరాల కారాగార శిక్ష విధించబడింది" అన్నాడు కరాజు.

"ఇందులో విచారించవలసిన పనేముంది మహారాజా! రత్తయ్య పురపాలక ముఖ్యాధికారినే తలమీద కఱ్ఱతో కొట్టాడు. అటువంటి నేరానికి ఈ శిక్ష సమంజసమే".

"పురపాలకాధికారికి, రత్తయ్యకు ఏమిటి సంబంధం? ఏ సంబంధమూ లేకుండా రత్తయ్య ఇలాంటి పనికి ఎందుకు పూనుకున్నాడు? న్యాయాధీశులవద్ద అతను నోరు విప్పలేదు. మనమే రహస్యంగా దీన్ని గురించి ఆరా తీయ్యాలని సంకల్పించాను" అన్నాడు కరాజు.

ఈ సంకల్పానుసారం ఎప్పటిలాగే కరాజు, మంత్రి యాత్రీకుల్లా మారువేషాలు ధరించి పరిశోధన నిమిత్తం బయలుదేరి మొదట చెరసాల చేరుకున్నారు. ముందు వీరిని లోపలికి అనుమతించని భటులు కరాజుగారి ఉంగరం చూసి మారువేషంలో ఉన్న రాజుగారిని గుర్తించి నమస్కరించి రహస్యంగా లోపలికి పంపించారు.

"రత్తయ్యా! మేము యాత్రికులం. ఈ రాజ్యంలో పర్యటించి ఇక్కడి జీవిత విశేషాలను సేకరించడానికి వచ్చాం . ఈ శిక్షకు కారణమైన నీ నేరం ఏమిటి?" అనడిగాడు కరాజు. రత్తయ్య కాస్సేపు మౌనందాల్చి చివరకు తన కథ చెప్పాడు.

అతను పురపాలక ముఖ్యాధికారిని తలమీద కొట్టడం వాస్తవమే. దానికొక కారణం వుంది. కారణం ఏదైనా అది న్యాయాధీశులకు అనవసరం. కనుక ఆ విషయం అక్కడ చెప్పలేదు.

"పోనీ మేం తెలుసుకుంటాం. దీనికి కారణమేమిటి?" అనడిగాడు కరాజు.

నిజానికి రత్తయ్య కొట్టాలనుకున్నది పురపాలకాధికారిని కాదట. అతను కొట్టాలనుకున్నది పట్టుచీరల వ్యాపారి బలరామయ్యను. ప్రతిరోజూ బలరామయ్య తన వ్యాపారం ముగించుకొని రాత్రి ఇంటికి

వెళ్ళడానికి ముందు, ఊరిపొలిమేరలో వున్న దుర్గమ్మ గుడిని దర్శించి ఆ తర్వాత ఇంటికి వెళ్ళడం అలవాటు. అక్కడంతా చీకటిగా ఉంటుంది గనక అతన్ని కొట్టడానికి అనువుగా ఉంటుందనుకున్నాడు రత్తయ్య. కానీ దురదృష్టవశాత్తూ అదే సమయంలో పురపాలక అధికారి కూడా గుడికి రావడం తటస్థించింది. అధికారి, బలరామయ్య ఇద్దరూ ఇంచుమించు ఒకే రకంగా ఉంటారు. అందువలన గుడినుంచి బయటకి వస్తున్న అధికారిని చీకట్లో చూసి అతనే బలరామయ్య అనుకొని ఒక కఱ్ఱతో అతని తలమీద బలంగా కొట్టాడు. గట్టిగా అరుస్తూ అధికారి కిందపడ్తే అతని అనుచరులు అక్కడికి పరుగెత్తుకొని వచ్చారు. అప్పుడు తెలిసి వచ్చింది రత్తయ్యకు తాను చేసిన తప్పేమిటో. నిర్ఘాంతపోయి అలాగే నిలబడి పోయాడు. భటులు వచ్చి అతన్ని పట్టుకెళ్ళారు. ''అసలు బలరామయ్యను ఎందుకు కొట్టాలనుకున్నావ్?'' అనడిగాడు కరాజు.

"భీమరాజు డబ్బిచ్చి అతన్ని కొట్టమన్నాడు. అది నా వ్యాపారం. ఎవరు డబ్బిచ్చి ఎవర్ని కొట్టమన్నా కొడ్తాను. ఈసారే ఈ తప్పు జరిగింది". అన్నాడు రత్తయ్య. "భీమరాజు ఎందుకు కొట్ట మన్నాడు?". "అదేమో నాకు తెలియదు. అది ఎవ్వరూ ఎప్పుడూ చెప్పరు. కొట్టమంటారు కొడ్తాను".

అంటే అసలు నేరస్థుడు రత్తయ్యకాదు భీమరాజన్నమాట. మరి భీమరాజు ఈ పని ఎందుకు చేసినట్టు? ఇది కనుక్కోడానికి కరాజు, మంత్రి జ్యోతిష్కుల వేషంలో భీమరాజు ఇంటికి వెళ్ళారు. ఇంటికి వచ్చిన జ్యోతిష్కులు భీమరాజుతో తను ఎలా బలరామయ్యను కొట్టమని రత్తయ్యకి చెప్పిందీ, అతను బలరామయ్యకు బదులు ఎలా పురపాలక అధికారిని కొట్టి చెఱసాల పాలైందీ వివరంగా చెప్తూంటే భీమరాజుకు ఆశ్చర్యమేకాక కాస్త కంగారు కూడా పుట్టింది.

మిగతా వివరాలను మీరు చెప్తే దానికి తగ్గట్టు మీకే ప్రమాదం రాకుండా మీరు చెయ్యాల్సిన శాంతిని గురించి చెప్తాము అని జ్యోతిష్కులు చెప్పేసరికి భీమరాజు తను ఎందుకా పని చేశాడో విశదీకరించి చెప్పాడు.

భీమరాజుకు, బలరామయ్యకు మొదట్నుంచీ మంచి స్నేహం. కాని ఒక ఉత్తరం మూలకంగా భీమరాజుకు బలరామయ్య నిజస్వరూపం తెలిసి అతన్ని కొట్టించాలనుకున్నాడు.

"ఏమిటా ఉత్తరం?" అనడిగాడు కరాజు.

"వడ్డీ వ్యాపారి నారాయణ గుప్త, నాకు రాసిన ఉత్తరం. ఏమి రాశాడో మీరే చూడండి". అంటూ లోపలికి వెళ్ళి ఒక ఉత్తరం పట్టుకొచ్చి కరాజు కిచ్చాడు. ఆ ఉత్తరంలో ఇలా వుంది.

''భీమరాజుకు- నీవు అయిదు వేల వరహాలు అప్పుగా ఇవ్వాలని కోరావు. కాని ఇవ్వను. ఎందుకో తెలుసా? మొన్న బలరామయ్య నీ గురించి మాట్లాడ్తూ 'భీమరాజును నమ్మొద్దు. ఆ ముండాకొడుకు ఒట్టి అబద్ధాలకోరు. మాట మారుస్తాడు. ఒకసారి డబ్బిస్తే మరి తిరిగిరాదు' అన్నాడు. అందుకని ఇవ్వను, ఇట్లు నారాయణ గుప్త.

"నా గురించి ఒక వడ్డీ వ్యాపారికి ఇంత దారుణంగా చెప్పిన బలరామయ్యను చితకబాదాలా, వద్దా !" అని ఆవేశంగా అడిగాడు భీమరాజు. భీమరాజు ఇచ్చిన ఉత్తరాన్ని ఒక్కసారి పరిశీలించి తిరిగి ఇచ్చేసి కరాజు, మంత్రి బయల్దేరారు. ఇప్పుడు అసలు నేరం భీమరాజుది కాదు, ఉత్తరం రాసిన నారాయణగుప్తది, అని తేలింది. వీధిలో నడుస్తున్న కరాజు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. మంత్రికర్థం కాలేదు. కాసేపటికి కరాజే మంత్రిని చూసి "మంత్రీ! ఆ ఉత్తరాన్ని పరీక్షించి చూశారా? మొత్తం ఉత్తరం ఒక దస్తూరిలో ఉన్నది. కాని నారాయణగుప్త సంతకం వేరే దస్తూరిలో ఉన్నది. అంటే ఉత్తరం రాసింది నారాయణగుప్తకాదు. ఎవరో రాసిందానికి అతను సంతకం పెట్టాడు. అంతే. మరైతే ఉత్తరాన్ని చూసి సంతకం పెట్టాడా? అసలు చూడలేదా?" అన్నాడు. ఇంతవరకు ఇవేవీ గమనించని మంత్రి ఇపుడు కరాజు చెప్పగానే 'ఔనుకదా?' అన్నట్టు చూశాడు.

''నారాయణ గుప్త పేరున్న వడ్డీ వ్యాపారస్థుడు లౌకికం తెల్సినవాడు. తన వ్యాపారంలో ఎవ్వరికీ కోపం రానివ్వడు. అటువంటతను మరొకరన్న మాటల్ని "ఇలా అన్నాడు" అని రాసుంటాడనేది సందేహంగా ఉంది"అన్నాడు కరాజు.

ఈ వుత్తరంలోని దస్తూరి మార్పుల రహస్యం తెల్సుకోవాలంటే అది నేరుగా నారాయణగుప్త నోటినే రాబట్టాలి. ఇద్దరూ అతనింటికెళ్ళారు. నారాయణగుప్త కుడిచెయ్యివిరిగి కట్టు కట్టించుకొని ఇంట్లోనే విశ్రాంతి తీసుకుంటున్నాడనే సమాచారం ముందే తెలియడంతో కరాజు, మంత్రి ఈసారి దేశాటన చేసే వైద్యుల్లా మారువేషాలు వేస్కొని నారాయణ గుప్త ఇంటికి వెళ్ళారు. ఇంట్లో నారాయణగుప్త పడుకొనున్నాడు. కట్లుకట్టున్న కుడిచేతిని ఒక దిండుమీదపెట్టి బాధతో మూల్గుతున్నాడు. ప్రక్కనే ఉన్న అతని అనుచరుడు సిద్ధయ్య మంచినీళ్ళు తాగిస్తున్నాడు. కరాజు, మంత్రి తమకు తామే వైద్యులుగా పరిచయం చేస్కొని నారాయణగుప్త చేతి గాయాన్ని పరీక్షించారు.

"బాధగా వుందా?" అనడిగాడు మంత్రి.

"ఈ బాధ ఏముంది? వారం రోజులుగా వ్యాపారం చెయ్యడం లేదు. రావలసిన వడ్డీ రాక విపరీతమైన నష్టం. ఆ బాధ మరీ ఎక్కువగా ఉంది" అన్నాడు నారాయణ గుప్త.

"ఇంతకు మీ చేతికి దెబ్బ ఎలా తగిలింది?" అడిగాడు కరాజు. "అదా! ఒక త్రాష్టుడు నడివీధిన పడేసిన అరటి తొక్క వల్ల" అన్నాడు నారాయణగుప్త.



"అరటి తొక్కా?" కరాజు, మంత్రి వింతగా ఒకరినొకరు చూసుకున్నారు. నారాయణగుప్త వివరించిన కథ ప్రకారం అతనొక రోజు పల్లకిలో కూర్చొని వీధిలో పయనిస్తున్నాడు. ఆ సమయంలో ఎవరో ఒకరు ఒక అరటి పండు తిని ఆ తొక్కును వీధి మధ్యనే పడేసి వెళ్ళిపోయారు. పల్లకీని మోస్తూన్న బోయిలు అది చూడకుండా దాని మీద

కాలు వేసేసరికి జారి కిందపడడం, దాంతో మొత్తం పల్లకీ కిందపడి నారాయణగుప్త కుడిచెయ్యి విరగ్గొట్టుకోడం జరిగింది. అంతకుముందు ప్రతి ఉత్తరం, ప్రతి వ్యాపార పత్రము నారాయణగుప్త తన స్వహస్తాలతోనే రాసేవాడు. ఎందుకంటే అతనికి ఎవ్వరి మీద నమ్మకంలేదు. తెలివి తక్కువ వాడైన సిద్ధయ్యను తన అనుచరుడిగా ఉంచుకోవడం కూడా అందుకే. ఇప్పుడు చెయ్యి విరగడంతో ఆ రాత కోతలన్నీ ఆగిపోయాయి. ఈ సమయంలో భీమరాజు అతన్ని అప్పడగడం, అతని గురించి బలరామయ్య చెప్పిన మాటలు గుర్తుకొచ్చి అప్పు ఇవ్వలేనని ఉత్తరం రాయడం జరిగింది.

"ఆ ఉత్తరం గురించి మాకూ తెలిసింది. వైద్యం నిమిత్తం భీమరాజు ఇంటికి వెళ్ళిన మాకు మీరు రాసిన ఉత్తరం చూపించాడు." అంటూ కరాజు ఆ ఉత్తరం సారాంశం ఇలా వుందనీ, అది చూసిన భీమరాజు ఉగ్రుడయ్యాడనీ చెప్పగానే నారాయణగుప్త నిర్ఘాంత పోయ్యాడు. అందరితో తీపిగా మాట్లాడటమే తన వ్యాపార ధర్మమనీ, అలాంటప్పుడు ఇలాంటి ఉత్తరం తాను రాయడం ఎన్నటికీ జరిగుండదని నారాయణ గుప్త చెప్పాడు. అయినా ఇది ఎలా జరిగిందని ఆరాతీస్తే నిజం బైటపడింది. చెయ్యి విరిగిన రోజే నారాయణ గుప్తకు ఆ ఉత్తరం రాయాల్సిన పరిస్థితి వచ్చింది. మాములుగా అయితే చాలా తీపిగా తనే ఉత్తరం రాసి డబ్బివ్వడానికి తనకెంతైనా ఇష్టమనీ, కాని పరిస్థితుల ప్రభావం వల్ల ఇప్పుడు ఇవ్వలేననీ క్షమించవలసిందనీ రాసుండేవాడు. కానీ ఇప్పుడు చెయ్యి విరగి, ఉత్తరం రాయలేక బాధతో మూల్గుతూ సిద్ధయ్యని పిలిచి "సిద్ధయ్యా!.. ఆ... భీమరాజుకు డబ్బు కావాలట- హు- అతనంటే హు...ఎవ్వరికీ మంచి అభిప్రాయం లేదు. ఒకరోజు బలరామయ్య -'ఆ ముండాకొడుకు.. అబద్ధాలకోరు.. మాట మారుస్తాడు... ఇచ్చిన డబ్బు తిరిగిరాదు" అన్నాడు.. హు ..అందుకని.... డబ్బు ఇవ్వలేనని ..ఒక ఉత్తరం రాయ్... సంతకం పెడ్తా". అని మూల్గుతూ చెప్పాడు. సిద్ధయ్య తన ప్రతిభను చూపించుకునే తీరులో నారాయణగుప్త చెప్పిన మాటల్ని తు.చ. తప్పకుండా యధాతథంగా రాసేడు. బాధలో మునిగున్న నారాయణగుప్తకుఉత్తరం చదివే ఓపికలేక సంతకం పెట్టేశాడు.

"చూశారా మంత్రీ! ఇది నారాయణగుప్త తప్పు కూడా కాదు. సిద్ధయ్యది" అన్నాడు కరాజు వీధిలో నడుస్తూ "ఔను మహారాజా! అతని చెయ్యి విరగకుండా వుండివుంటే ఈ అనర్థం వాటిల్లేది కాదు".

"ఔను దానికి కారణం వీధిలో ఎవరో పడేసిన అరటితొక్క ఆ పని చేసిందెవరు?" ఈ ఆలోచన రాగానే ఇద్దరూ నేరుగా పల్లకి పడ్డ వీధిలోకి వెళ్ళారు. కాసేపు అటూ, ఇటూ తిరిగి పరిశీలించారు. ఒక ఇంటిముందు ఒక అయిదేళ్ళ కుర్రాడు ఆడుకుంటున్నాడు. అతని దగ్గరికి వెళ్ళి కరాజు "బాబూ! కొన్ని రోజుల క్రితం ఈ వీధిలో ఒక పల్లకి కింద పడిండట. నీకు తెలుసా?" అనడిగాడు.

"ఓ! నేనప్పుడిక్కడే ఉన్నాను" అన్నాడు కుర్రాడు "ఏం జరిగింది?" మళ్ళీ అడిగాడు కరాజు.

"ఆ ఇంట్లో ఆయన ఇంటిముందు అరుగుమీద కూర్చోని అరటిపండుతిని తొక్కపారేస్తే అది నడివీధిలో పడింది. అప్పుడే ఆ దారిన ఒక పల్లకిని మోస్కొని, వస్తున్న వారు దాని మీద కాలేసి కిందపడ్డారు. పల్లకి కూడా కింద పడింది. అని గట్టిగా నవ్వి పరుగెత్తివెళ్ళిపోయ్యాడు. ఇంతకూ ఆరోజు అరుగుమీద కూర్చోని అరటిపండు తింటున్న వ్యక్తి ఎవ్వరో తెలుసుకునేసరికి ఇద్దరూ నిర్ఘాంతపొయ్యారు. అతనెవరోకాదు. సాక్షాత్తు సర్వజ్ఞాన సార్వభౌమ శ్రీబాదరాయణభట్టు.

ఇప్పుడర్థమైందా మంత్రీ! ఈ అనర్థాల కంతా కారణం బాదారాయణభట్టు. అతను బోధించే విద్యుక్తధర్మాల ప్రకారం తొక్కను పెరట్లో మూలపడేయాలి. కానీ అతను అరటి పండు తొక్క నడివీధిలో వేసాడు గనుక పల్లకి కిందపడి నారాయణగుప్త చెయ్యివిరిగింది. దాంతో తప్పనిసరి సిద్ధయ్య ఉత్తరం రాయాల్సి వచ్చింది. ఈ ఉత్తరంతో భీమరాజుకు బలరామయ్య మీద కోపం వచ్చింది. దాంతో రత్తయ్యకి డబ్బిచ్చి బలరామయ్యని కొట్టమన్నాడు. రత్తయ్య మొరటోడు. చీకట్లో బలరామయ్య అనుకొని పురపాలక అధికారిని కొట్టి చెఱసాల పాలయ్యాడు. అంటే బాదరాయణభట్టు తొక్కను వీధిలో పడెయ్యక పోతే రత్తయ్య చెఱసాల పాలయ్యేవాడు కాడు".

మంత్రి కంతా వింతగా కన్పిస్తోంది. కరాజు మంత్రివైపు అర్థవంతగా చూస్తూ "మంత్రీ ! రాజ్యంలో ప్రతి ఒక్కరు బాదరాయణుడిలా ఇతరులకు ఏం చెయ్యాలో బోధిస్తూ ఉపన్యాసాలిస్తూంటారు. వాళ్ళంతా ఈ ఉపన్యాసాలు మాని ఎవరిపనులు వారు సక్రమంగా నిర్వర్తిస్తే ఈ రాజ్యం రామరాజ్యాన్ని మించిన ఆదర్శరాజ్యం ఔతుంది" అన్నాడు.

**శ్రీ రాజా గారికి,**

చాలా సంవత్సరాల తర్వాత నా చేత మళ్లీ కథలు రాసేట్టు చేసినందుకు ముందుగా మీకు థాంక్స్. ఒకరోజు మీరు 'హాసం' కోసం నా అనుభవాల్లాంటివి ఏదైనా రాస్తే బాగుంటుందని అన్నారు. "మనం ఏ రోజైనా ఆ రోజు చేసిందాన్ని గురించి చెప్పామంటే, ఈ రోజు ఏమీ చెయ్యడం లేదన్నమాట" అని ఒకసారి నేనే ఎక్కడో అన్నాను. అది గుర్తుకొచ్చి, ఏదైనా కొత్తగా, క్రియేటివ్‌గా రాస్తే బాగుంటుందనుకొని మీతో చెప్తే, "అంతకంటేనా" అన్నారు. అంతకంటె ఏం కావాలి? ఇరవై ఒక్క 'కరాజు కథలు' రాసిపారేసా.

సినిమా కథలూ, స్క్రీన్‌ప్లేలు రాసినప్పుడెల్లా లక్ష సమస్యల్ని దృష్టిలో పెట్టుకొని, అవసరమైతే (అవసరం లేనిదెప్పుడు?) ఎదటి వారిని ఒప్పించేలా రాయాల్సుండేది. ఇక్కడ ఆ బాధలేవీలేవు. ఈ కథలన్నీ పూర్తిగా ఎంజాయ్ చేస్తూ, ఎదటి వారితో నిమిత్తం లేకుండా నాకు సంతృప్తినిచ్చేలా రాసుకున్నవే. ఈ ఆనందమే వేరు.

ఇక ఇది చదివిన వారు కూడా 'బాగుంది' అంటె అంతకంటె ఏం కావాలి? ఈ సందర్భంగా ఈ కథల్ని చదివి నన్ను అభినందించిన డి.వి.నరసరాజు గారు, డా॥ సి.నారాయణరెడ్డి గారు, సత్యానంద్ గారు, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం గారు, రావి కొండలరావు లాంటి ప్రముఖులు, మిత్రులే కాక ఎందరో పరిచయం లేనివారు కూడా ఉత్తరాల ద్వారా, ఫోన్ల ద్వారా నన్ను అభినందించారు. వారందరికీ నా కృతజ్ఞతలు.

చివరిగా ఒకమాట. 21 కథలతో ఈ శీర్షికకు ఫుల్‌స్టాప్ పెడ్దామనుకున్నాను. కానీ మీరు ఫుల్‌స్టాప్ వద్దు, తప్పనిసరి అయితే 'కామా' పెట్టండి అన్నారు. అలాగే ప్రస్తుతం దీనికి 'కామా' పెడ్తున్నాను. కొంత గ్యాప్ తర్వాత బహుశా మరొక ఐడియాతో 'హాసం'లో మళ్లీ చేరుకుంటాను.

మీ
సింగీతం శ్రీనివాసరావు

www.singeetam.com




ఇది మామూలు కవితా సంకలనం కాదు. గానసౌలభ్యం గల గజళ్ల సంకలనం. తెలుగు గజళ్ల గురించి ఈ మధ్య చాలా వింటున్నా గజల్ కవితా ప్రక్రియ ఉర్దూ భాషకు చెందినది. ఆ మాట కొస్తే వారూ వేరేచోట నుండి తెచ్చుకున్నదే! అరబ్బీ సుల్తాన్‌లను, సర్దార్‌లను కీర్తించటానికి పాడే దీర్ఘకీర్తనలను 'కసీదా' అనేవారు. పారసీకులు ఈ కసీదాలను అరువు తెచ్చుకుని వాటికి నాజూకు పరిమళాలను, వస్తువైవిధ్యాన్ని జోడించారు. పేరు ఘజల్ గా మారి అక్కడ నుండి ఉర్దూ భాషలోకి వచ్చింది.

ఘజల్‌కు సరియైన పర్యాయ పదంగా 'సల్లాపం' అని చెప్పుకోవచ్చు. సల్లాపం అనే మాటలోనే మార్దవం, కోమలత్వం స్ఫురిస్తాయి. ఈ పేరును ఉర్దూ లిపి స్టయిల్‌లోనే రాసి గజల్‌కు, ఉర్దూకు గల సాన్నిహిత్యాన్ని మరింతగా స్ఫురింపచేశారు బాపు.




ఉర్దూ వచ్చీరాని హిందీ పాటల శ్రోతలకు - వాట్లో కొన్నిటిని మాత్రమే గజల్ అంటారని, అవేదో భావగీతాల్లా చాలా చరణాలతో ఉంటాయనీ, మదన్‌మోహన్,ఖయ్యాం లాంటివారు వాటికి సంగీతం సమకూరుస్తారని- జగజీత్ సింగ్, పంకజ్ ఉదాన్ వంటివారు - ఓ హార్మోనియం పెట్టుకుని మంద్రంగా పాడతారని అన్పిస్తుంది. అది వ్యాకరణబద్ధమైనదనీ, దానికో ఛందస్సూ గట్రా ఉంటాయని చాలామందికి తెలియదు, తోచదు.

అలాగే ముషాయిరాలనబడే కవితా సమ్మేళనాల్లో వహ్వా, వహ్వాల మధ్య కనబడే చిన్న, చిన్న కవితలను 'షేర్' అంటారని కూడా తెలుస్తుంది. షేర్ షాయరీ అనేమాట తరచుగా వినబడుతుంది.

ఉర్దూ భాషే రానప్పుడు ఉర్దూ వ్యాకరణం, ఉర్దూ కవితా ఛందస్సు ఊసు మనకెందుకు అనిపించేది చాలాకాలం. కానీ సినారె, గజల్ శ్రీనివాస్‌ల ధర్మమాని గజల్ అనే మాట తెలుగునోట విరివిగా వినబడుతోంది. మనకు తోచిన నాలుగు పంక్తులు కవితాపరంగా రాసేసి దాన్ని గజల్ అనవచ్చా? అన్న సందేహం సాధారణ పాఠకశ్రోతను వేధిస్తుంది.

ఈ పుస్తకంలో ముందు, వెనుక మాటల్లో గజల్ స్వరూప స్వభావాలను వివరించారు. రచయిత కవిత్వాన్ని ఆస్వాదించే ముందు వాటి గురించి కాస్త సమాచారం-

ఉర్దూ కవిత్వంలో ఒక్కపాదాన్ని 'మిస్రా' అంటారు.

రెండు పాదాల యూనిట్‌ను - ద్విపద అందామా- 'షేర్' అంటారు. ఈ షేర్‌లో మొదటి పాదం దేన్నో ప్రతిపాదిస్తూనో, తెలుపుతూనో సాధారణంగా ఉంటుంది. రెండో పాదం మొదటి వాక్యాన్ని సమర్థిస్తూనో, సవరిస్తూనో, ఖండిస్తూనో , వివరిస్తూనో - చమత్కారయుతంగా ఉంటుంది. అందుకే ముషాయిరాలలో రెండోపాదం విన్న తర్వాతనే 'వాహ్వా' కారాలు చేస్తారు.

కొన్ని షేర్‌లు కలిసి గజల్‌గా తయారవుతుంది. సాధారణంగా ఏడు షేర్‌లు ఉంటాయి. మొదటి షేర్‌ను 'మత్లా' అంటారు. ఆఖరి షేర్‌ను 'మక్తా' అంటారు. (తెలుగు 'ముక్తాయింపు'కు దగ్గరగా ఉంది కదూ!) దీనిలో కవి తన ఉపనామాన్ని (తఖల్లుస్) ప్రయోగిస్తాడు. త్యాగరాజకీర్తనలలో ఆఖరిపాదంలో 'త్యాగరాజనుత' అని ఉండేట్టు 'గాలిబ్', 'మీర్' ల గజళ్లలో కూడా చివర వాళ్ల పేరు వినబడుతూండడం గమనించే వుంటాం. ఈ ఉపనామం సాధారణంగా మూడు నాల్గు మాత్రలదై ఉంటుంది.

అదృష్టవశాత్తూ ఈ కవి ఇంటిపేరు చిన్నది. అందువల్ల దానినే 'తఖల్లుస్' గా ఉపయోగించుకోగలిగాడు. అందువల్ల 'వినురవేమ' అంటూ వేమన తనకు తానే నీతులు చెప్పుకున్నట్టు

ఒక మజిలీ చేరానని ప్రమోదమేల 'పెన్నా'
ప్రతి మజిలీ దూరాలను కొలుచుకునేటందుకే!

అని మక్తాలో చెప్పుకున్నాడు.

ఇలా హితోక్తులే కాదు, లోకంతీరుపై వ్యాఖ్యలు, ప్రేమ గురించి వాపోవడాలు, ప్రకృతిపై పరిశీలనలు - ఇలా అనేకం కనబడతాయి. మచ్చుకు కొన్ని షేర్‌లు-



★ గాలితరగ కొమ్మపై
ఊయలలూగిపోయెను
నేటిదాక శూన్యడోల ఊగుతూనె
ఉన్నది
★కథ ముగిసినా ఒక పాత్ర మనసును
వీడనే లేదు
సుడిగాలిలోనూ బాష్పకుసుమం
వాడనే లేదు
★మబ్బు 'చిల్మను'లోనె జాబిలి
మసలినది మలిజాముదాకా
మద్యపాత్రికలోని తారక కన్నుగీటితె
ఏమి చేయను
★ఆవారా గాలి ఆటలాడుతూనె ఉన్నది
ప్రతి వెదురూ గుండె పగిలి
పాడుతూనె ఉన్నది
★స్వప్నమూ నిజజీవితానికి దాసియైనది ఎందుకో
కలలలోనూ నేటికీ కరుణించనిది తానే కదా
★దూతగ నా మనసునేల పంపితినో కాని
తిరిగి రాక నీ సిగలో విరియై పోయింది
★మల్లెలుగా కురులలోన ముడుచుకొంటివేమొ
నా నింగిని ఒక్క తార కరువైపోయింది
★శశిబింబమూ నా చెలియలాగే ఎపుడు ఏ కళ నుండునో
బహురూపియగు జాబిల్లి కంటే తారలే ఎంతో నయం
★ఇన్నినాళ్లఖకు అందుకొంటిని మొదటిలేఖను వింతగా
తడిసె ఆనందాశ్రువులతో దాన్ని నే చదివిదెలా
★చెలియ కంటే చిత్రపటమే నన్ను వేధిస్తున్నది
గాయానికంటే మరకయే నన్నతిగ బాధిస్తున్నది
★బుగ్గపై ముద్దీయకుండిన పెదవిపైనే చాలును
రోజాలు కోరను, రెమ్మతో సరిపెట్టుకుంటాను

కొన్ని మిస్రాలు

★రాలిపోయిన విరికి కొమ్మే గగనమై కనిపించెను
★కలత నిదురైపోయె మనుగడ, కలగ మారెను ప్రేయసి
★నిద్ర దోచుకున్న దొంగ కలగమారితే ఎలా?
★నా మది దోచిన దొంగకు పల్లకినయ్యాను
★ కరవాలమునకే గాయమును చూపెట్టుకుంటాను

**వచ్చేసారి మరికొన్ని షేర్‌లు, గజల్ నిర్మాణం గురించి మరికొంత సమాచారం..**

- ఎమ్బీయస్ ప్రసాద్




# పెళ్ళిపుస్తకం

## దర్శకత్వం : బాపు

స్క్రీన్‌ప్లే-మాటలు-నిర్మాత
**ముళ్ళపూడి వెంకటరమణ**

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

వెండితెర నవల
**14**

### జరిగిన కథ

మధ్యతరగతికి చెందిన కృష్ణమూర్తి, సత్యభామలకు పెళ్లవుతుంది. ఒకే ఊరిలో ఉండాలని శ్రీధరం కంపెనీలో ఉద్యోగాలలో చేరతారు. చేరడానికి తామిద్దరం భార్యాభర్తలు కాదని చెప్పవలసి వస్తుంది. కృష్ణమూర్తి బ్రహ్మచారి అనుకుని శ్రీధరరావు కూతురు వసుంధర అతన్ని అభిమానిస్తూ ఉంటుంది. భామకు ఇది కంటగింపుగా ఉంటుంది. శ్రీధరం బావమరిది గిరి సత్యభామపై కన్నేస్తాడు. వసుంధర శనాదివారాలు కృష్ణమూర్తి దగ్గర ఆర్టు నేర్చుకుంటానని చెప్పి అతని గదికి వస్తుంది. ఆ ఏర్పాట్లు చూడడానికి వచ్చిన కొండల్రావు, కృష్ణమూర్తి వసుంధరను వలలో వేసుకుంటున్నాడని చెప్పడంతో భయపడుతుంది.

-(ఇక చదవండి)

ఇంటి వెనుక తోటలో మౌనంగా కూర్చుని తనలో తానే క్షోభిస్తున్నాడు కృష్ణమూర్తి. ఈ వయసులో, అందరి ముందు తాను యజమాని చేత దెబ్బలు తినవలసి రావడం అతని హృదయాన్ని కలిచివేస్తున్నది. బ్రతుకు దుర్భరమైతే -భార్య ఎదురుగా ఉండి-ధైర్యంగా ఓదార్చే పరిస్థితి లేకపోవడం మరింత దుర్భరం. గిరి అంతరంగమేంటో అతనిమనసులోనని కల్మషమేంటో తనకు పూర్తిగా తెలుసు. ఈ కీచకుడి బారినుండి తన భార్యను రక్షించుకోవడం ఎలా? నిండు కొలువులో సైరంధ్రి కీచకుడితో అవమానానికి గురౌతుంటే- ఎంతో బలశాలులై ఉండీ కూడా-బేలగా వీక్షించవలసి వచ్చిన పాండవుల్లా- తనూ చేష్టలుడిగి పోవలసిందేనా?

కృష్ణమూర్తి మనసంతా వికలమై శలకలమైపోయింది. భర్త భరిస్తున్న ఆవేదన అర్థం చేసుకుంది భామ. ఆసమయంలో తాను పోషించవలసిన పాత్ర ఏమిటో గుర్తెరిగింది. మల్లెపూవులా నవ్వుతూ అతని సరసన చేరింది. దివ్యసుమంలా విరబూసింది. ఆ దరహాసానికి సగంబాధ తగ్గినట్లయింది కృష్ణమూర్తికి. ఇల్లాలి ఒడిలో సేదదీరాడు. భామ తల్లిలా లాలించింది. జోలపాటపాడింది.



ఆయీ - ఆయీ -
శ్రీరంగ సాయి ॥2॥
మా పెద్ద పాపాయి కాపదలు కాయి
మా పెద్ద పాపాయి కాపదలు కాయి
ఆయీ- ఆయీ శ్రీరంగ శాయీ
ఏదీ కానీ వేళా- ఎడద ఉయ్యాల
ఏదీ కానీ వేళా- ఎడద ఉయ్యాల



కోరి జో కొట్టింది -కుసుమ సిరిబాల
ఆయీ ఆయీ శ్రీరంగ శాయి ॥2॥
అజ్ఞాత వాసాన- అతివ పాంచాలి
ఆరళ్ళు భీమన్న దూరమ్ముసేయు

కృష్ణమూర్తికి ఆవేశం తన్నుకొచ్చింది. గిరిని ఒక్కవేటున చంపెయ్యాలన్న కసి కలిగింది. పక్కనే ఉన్న చిన్నచెట్టును పెకలించి స్తంభానికేసి కొట్టాడు. కర్తవ్యం భోదించింది భామ.

ఆవేశ పడరాదు- అలిసిపోరాదు
అభిమానమే చాలు- అణుచుకొనమేలు
ఆయీ ఆయీ శ్రీరంగ శాయీ
మా పెద్ద పాపాయి కాపదలు కాయీ
ఆయీ - ఆయీ - శ్రీరంగ శాయీ

ఆడుతూ పాడుతూ పూజగదిలోకి వెళ్ళి భగవంతుడిముందు దీపం వెలిగించి కైమోడ్పులు చేసింది. భార్య లాలనలో బాధను మర్చిపోయాడు కృష్ణమూర్తి. పడకగదిలోకి వెళ్ళాడు. మంచం మీద విలాసంగా పవళించాడు. కృష్ణమూర్తి కళ్ళు అరమోడ్పులయ్యాయి. పతిదేవుడి ముఖాన్ని ప్రేమగా నిమిరింది.



నిద్రా కన్యకలొచ్చి నిలచీ దీవిస్తే
భద్రా కన్యకలేమో పలుకు తథాస్తూ
నిద్రా కన్యకలొచ్చి నిలచీ దీవిస్తే
భద్రా కన్యకలొచ్చి పలుకు తథాస్తూ
మాగన్నులోనైన- మరిచిపో కక్ష
సిరికనుల నిద్దురకు - శ్రీరామరక్ష

* * *



గెస్ట్‌హౌస్‌లో - తోటలో అందంగా తీర్చిదిద్దిన చిన్నినీటి కొలను. అందులో తేలాడుతున్న తామర తూండ్లు కలువలు, కొలనులో ఈదులాడుతున్న బుల్లి బుల్లి కొంగలు! ఎటు చూసినా పచ్చదనం విహరిస్తున్న ఆ తోటలో - కొలను వద్ద పిట్టగోడ మీద విచారవదనంతో కూర్చున్నది భామ.

తమ పనేదో తాము చేసుకుంటూ సుఖంగా బ్రతుకుదామని ఇంతదూరం వస్తే అడుగడుగునా దుష్టశక్తులు, అవమానాలు వెంటాడుతున్నాయి. ఒంటరిగా ఉండే స్త్రీకి సమాజంలో రక్షణ లేదా? ఆడది అంటే అనుభవించదగినవస్తువేనా? గిరి ప్రవర్తన, అతని చూపులు కంటగింపుగా ఉన్నాయి. యజమానికి ఫిర్యాదుచేసే ధైర్యంలేదు. కుంటివాడైనా గుడ్డివాడైనా భర్త అనే స్థానంలో ఒక మగవాడుంటే ఆ స్త్రీ వంక కన్నెత్తి చూడటానికి కూడా ఎవ్వరూ ధైర్యం చెయ్యరు. సాక్షాత్తూ భీముడిని భర్తగా కలిగిఉండి అతను ఆ స్త్రీకి భర్త అని తెలియకపోతే ఆమెను అందరూ తినాలని ప్రయత్నించేవారే. ప్రస్తుతం తన పరిస్థితీ అలాగే వుంది. కొలనులో తనవైపు వస్తున్న విరిసిన పూవును పట్టుకుందామని ప్రయత్నిస్తున్నది భామ. అందినట్లే అంది పక్కకు వెళ్ళిపోతున్నది ఆ పువ్వు.

ఎప్పట్నుంచి అనుసరిస్తున్నాడో -ఆమె వెనుకే చేరాడు గిరి. ఏదో విధంగా భామను వలలో వేసుకోవాలన్న ప్రయత్నాలు కొనసాగిస్తున్నానే ఉన్నాడు. పూవును అందుకోవడానికి భామ చేస్తున్న ప్రయత్నాన్ని చూసి "అందిన పూలకన్నా అందీ అందని పూలే అందం" అన్నాడు శ్లేషగా.



ఉలికిపడి చూసింది భామ. "వాటికవే సాటి. కోసివ్వమంటారా? మీకోసం ఏమైనా చేస్తాను" అన్నాడు భామను తాకబోయి.

భామ విసురుగా లేచింది. "నో థాంక్స్. మీ వరస నాకేం నచ్చలేదు" అన్నది కోపంగా.

"మీ వరసా నాకు నచ్చలేదు" అన్నాడు గిరి మరింతగా ముందుకొచ్చి.

"దయచేసి నా జోలికి రాకండి" అన్నది భామ దణ్ణం పెట్టి. "మీ జోలికి రావడానికే నాకు ఉద్యోగం. జీతం, భత్యమూనూ. ఇది నా డ్యూటీ" అన్నాడు గిరి.

భామ దూరంగా వెళ్ళింది. వెంటపడ్డాడు గిరి నీడలా. "యూసీ...మన బాసుగారు పూర్వకాలం రాజుల్లాగా చారుచక్షువు. అంటే నాలాంటి ఒకళ్ళిద్దరు భటాచోర్ జీనియస్‌లనే నమ్ముతాడు"అన్నాడు తనెలాంటి వాడినో చెబుతూ.

భామ భయంగా దిక్కులు చూడసాగింది. చుట్టుపక్కలెవరూ లేరు. పకపక నవ్వాడు గిరి. "నా కళ్ళతో చూస్తాడు. నా చెవులతో వింటాడు. నా నోటితో తింటాడు. నా వరస అలా వుంచండి. నాకు అన్నం పెట్టే యజమాని గారి గూఢచారిగా నేను గమనించిన మీవరస గురించి కొన్ని నగ్నసత్యాలు చెప్పమంటారా?" వత్తిపలికాడు గిరి.



ఏం చెబుతాడోనని భామ గుటకలు మింగింది. తాను, కృష్ణమూర్తి భార్యభర్తలమని తెలిసిపోయిందా? బ్లాక్ మెయిలింగ్‌కు పాల్పడుతున్నాడా?

"మీరు ఒకరి ఇల్లాలు. పాపం! మీ భర్త వెన్ను విరిగి మారుమూల పల్లెటూళ్ళో వైద్యం పొందుతూ నరకబాధపడుతున్నాడు. ఇక్కడ మీరు... ఆర్ట్ డైరెక్టర్ గారికి చీమకుడితే పాము కరిచినంత అప్‌సెట్ అయిపోతున్నారు... అవునా?



భామలో ఆందోళన అధికమైంది. భామ ఆందోళనకు ఆనందించాడు గిరి. "ఆయన కూడా మీ రక్షణ కోసం ప్రాణాలిచ్చేట్లు దాఖలాలున్నాయి. ప్రస్తుతం ఆయన ఒక పరపురుషుడు. మీరొక పరస్త్రీ. అందువల్ల మీరిద్దరూ చేసేశృంగారాన్ని గిట్టని వాళ్ళు, మీ శత్రువులు వ్యభిచారం అంటారు. కానీ నేను తొందరపడి అలా అనను. నా రహస్య రిపోర్టులో రాయను. రాస్తే రేపు పదిన్నర కల్లా డిస్మిస్ ఆర్డర్స్ వచ్చేస్తాయి. కానీ తొందరపడి నేను అపకారం చెయ్యను. నా మాట కటువు కానీ, మనసు వెన్న. రాత్రి పదిన్నరకి వస్తాను. మీ సంజాయిషీ శ్రద్ధగావింటాను. ఇద్దరం చర్చలు జరుపుకుందాం. ఆ తర్వాతే నా రిపోర్టు. బై" అంటూ వెళ్ళిపోయాడు గిరి క్రూరంగా నవ్వుతూ.



"నా గురించి మీరేం భయపడక్కర్లేదు. నాకు డాన్సే కాదు. కరాటే కూడా వచ్చు" అంటూ భర్తతో ఓసారి తను అన్న మాటలు గుర్తొచ్చాయి భామకి.

* * *

ఇంట్లో కృష్ణమూర్తి కూచొని డిజైన్లు గీసుకుంటున్నాడు.

తనవెనుక బెలూన్ పగిలిన శబ్దం వినగానే ఉలికిపడి వెనుక్కు చూశాడు. నవ్వుతూ నిలుచుంది వసుంధర మరో అందమైన యువకుడితో.

వస్తూనే పెద్దగా నవ్వి "సర్‌ప్రైజ్ ...మెర్రీ క్రిస్మస్.... హ్యాపీ న్యూ ఇయర్..." అన్నది వసుంధర.

అందరూ కోరస్‌గా పాడారు.



కృష్ణమూర్తి నవ్వి వసుంధర పక్కనున్న యువకుడికి "అలో అలో అలో" షేక్ హాండిచ్చాడు. "అదేమిటి కంట్రాక్టర్‌లా, హ్యాపీ న్యూ ఇయర్ అను కేకే..." అన్నది వసుంధర.

"హేపీ న్యూ ఇయర్" అన్నాడు కృష్ణమూర్తి.

"సేమ్ టూ యూ, శేషు హియర్" అన్నాడా యువకుడు చిరునవ్వుతో.



"వీడే శేషు" పరిచయం చేసింది వసుంధర యువకుడిని.

"హాయ్" అన్నాడు కృష్ణమూర్తి.

"ఇతను నా ఫస్ట్ హజ్బెండ్.. అంటే నా మొట్టమొదటి మొగుడు" శేషును చూపిస్తూ చెప్పింది వసుంధర.

"మొదటి మొగుడా?" ఆశ్చర్యంగా అన్నాడు కృష్ణమూర్తి.

"ఇడియట్..." అన్నాడు వసుంధర బుగ్గ గిల్లి శేషు.

పువ్వులా నవ్వింది వసుంధర. కృష్ణమూర్తి చేతులు పట్టుకుని ఊపుతూ "ఫస్ట్ హజ్బెండ్ అంటే నేను మొగుడిగా ఓకే చేసిన ఫస్ట్ మొగాడు... కేకే..." అన్నది.



"ఓ ...ఐ ...సీ..."" అన్నాడు కృష్ణమూర్తి నవ్వి.

"శేషూ ...ఈ కేకే నే నా రెండో మొగుడు" అన్నది వసుంధర.

-(ఇంకావుంది)

50 సంవత్సరాల
నట జీవితాన్ని పూర్తి చేసుకున్న
స్వర్ణోత్సవ నటీ జమున
'హాసం' పాఠకుల కోసం
ప్రత్యేకంగా అందిస్తున్న
జ్ఞాపకాల ధారావాహిక

(13)

# నేనూ నా పాటలు



- శ్రీమతి జమునా రమణారావు

పాత చిత్రాల్లో మ్యూజిక్ సైడ్ నాకు బాగా నచ్చిన చిత్రం-'పెళ్ళికాని పిల్లలు'. ఓ మరాఠీ పిక్చర్ ఆధారంగా తీశారు. ఆ మరాఠీ పిక్చర్ పేరు ఏమిటో నాకు గుర్తులేదు, తెలుగులో హైదరాబాద్ మూవీస్ పేరిట గంగాధరరావు గారు తీశారు. ఫస్ట్ ఆయన తీసింది మా ఇంటి మహాలక్ష్మి. అసలు సినిమా పరిశ్రమ అంటూ హైదరాబాద్‌లో సారథీ స్టూడియోలో 'మా ఇంటి మహాలక్ష్మి' సినిమాతో స్టార్ట్ చేసింది ఆయనే. ఆ సంగతి ప్రస్తుతం చాలా మంది మరిచిపోయారు. ఆ తరువాత చాలామంది కొంత కృషి చేసిన మాటవాస్తవం. మా ఇంటి మహాలక్ష్మి తరువాత జల్సారాయుడు, ఆ తరువాత పెళ్లికాని పిల్లలు. వరుసగా మూడు చిత్రాలు అక్కడే చేయడం వల్ల నేను హైదరాబాద్ ఆర్టిస్ట్‌ని అయిపోయాను. ఆ మూడు చిత్రాలు చాలా మంచి చిత్రాలు. ముఖ్యంగా మ్యూజిక్ సైడ్ వెళ్లినప్పుడు 'పెళ్లి కాని పిల్లలు' మ్యూజిక్‌ని బాగా లైక్ చేసా. ఎందుకంటే అందులో ట్యూన్స్ అన్నీ మరాఠీ ట్యూన్‌కు దగ్గరగా ఉంటాయి. వేణు గారు చాలా చక్కగా ట్యూన్ చేశారు. ఇందులో రమణారెడ్డిగారికి 5గురు కూతుళ్లుంటారు. ఆఖరు అమ్మాయిని నేను. నాకుండే 4గురు అక్కల పెళ్ళి అయ్యేదాకా నా పెళ్ళికి ఒప్పుకోరని హీరో (జగ్గయ్య) ఆ 4గురికి సంబంధాలు వెతకడానికి నానా తిప్పలూ పడతాడు. అదీ కథ. చాలా గొప్ప థీమ్. ఆ

| | |
|---|---|
| చిత్రం : పెళ్ళికాని పిల్లలు | రచన : ఆరుద్ర |
| సంగీతం: మాస్టర్ వేణు | గానం : పి. సుశీల |





తెలియని హాయి ఇది -
ఎందుకో పులకించెను నా మది
ఎందుకో పులకించెను నా మది ॥తె॥
నిలువదు మనసు - నిదురే రాదు
నిలువదు మనసు - నిదురే రాదు
కమ్మని వెతలో నెమ్మది లేదు -
కమ్మని వెతలో నెమ్మది లేదు
తలచిన చాలు తానే ఎదురై -
తలచిన చాలు తానే ఎదురై -
తన్మయమొందితి సఖీ
ఎందుకో పులకించెను నా మది
ఎందుకో పులకించెను నా మది ॥తె॥
మానసమురళీ మంజులరవళీ
మానసమురళీ మంజులరవళీ
మధురిమ ఎదలో నింపిన దెవరో
మధురిమ ఎదలో నింపిన దెవరో
నాలో నేనే నాదము వినుచు
నాలో నేనే నాదము వినుచు
నాట్యము చేసితి చెలి
ఎందుకో పులకించెను నా మది ॥తె॥









చిత్రం : పెళ్ళికాని పిల్లలు
రచన : ఆరుద్ర
సంగీతం: మాస్టర్ వేణు
గానం : ఘంటసాల

ప్రియతమా రాధికా
ప్రియతమా రాధికా రావే - రయమున
కలియవె ప్రేమాభిసారిక ॥ప్రి॥
పరువము నీ మేన పరుగులు తీయ
పరువము నీ మేన పరుగులు తీయ
చరణాల కింకిణులు స్వరమేళపాడ
చరణాల కింకిణులు స్వరమేళపాడ ॥ప్రి॥
కదవనిడుకొని కలహంస నడతో
విడువని బిడియాన వేమారు వెదకి
కదవనిడుకొని కలహంస నడతో
విడువని బిడియాన వేమారు వెదకి
అడుగులు తడబడ నడుమల్లాడ
అడుగులు తడబడ నడుమల్లాడ
వడివడిగ నడిచేటి వనితా లలామ ॥ప్రి॥









చిత్రం : పెళ్ళికాని పిల్లలు
సంగీతం: మాస్టర్ వేణు
రచన : ఆరుద్ర
గానం : ఘంటసాల, పి. సుశీల

నాలోని మధుర ప్రేమ లోలోన దాచలేను
నీ ముందు ఎందువలనో నేనేమి తెలుపలేనూ ॥నా॥
నీ లోని మధుర ప్రేమ మునుముందె వింటినోయి
నునుసిగ్గు వేసెనోయి - వేరేమి తెలుపకోయి ॥నా॥
మేఘాల దారిలోన పయనించు చందమామా
ఏకాంత సీమలోని మా వైపు చూడకోయి
మాగాధలన్ని నీవు లోకాన చాటకోయి ॥నా॥
మనసైనవాడు ఇపుడే మదిలోనిమాట తెలిపె
నా చేత చేయివేసి ప్రియమైన బాసచేసె
దయచేసి చందమామ దీవించి సాగవోయి ॥నా॥











రోజుల్లో ఫ్యామిలీ ప్లానింగ్ అబ్జర్వ్ చేయక పోవడం వల్ల ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చిందీ, ఆ పిల్లలకి పెళ్లి చేయటానికి ఎంత శ్రమ పడాలీ అనేది చాలా చక్కగా హాస్య రసస్ఫోరకంగా చూపించారు. అందులో నాకు బాగా నచ్చిన పాట 'తెలియని హాయి ఇది ఎందుకో....' అని సుశీల గారు చాలా చక్కగా పాడారు. ఆరుద్ర గారు రాశారు. ఈ పాట ట్యూన్ మరాఠీ సంగీతానికి దగ్గరగా ఉంటుంది. ఇంకోటేమిటంటే హరనాథ్ గారు పాడతారు. అది నా పాట కాకపోయినా చాలా మంచి పాట. ప్రియతమా రాధిక అని క్లాసికల్‌గా ఉంటుంది. ఈ రెండూ కాక 'నాలోన మధురప్రేమ లోలోన దాచలేను' అని ఇంకో మంచి పాట ఉంది. చందమామని ఉద్దేశిస్తూ ప్రేమికులు పాడే పాటల్లో రచనాపరంగా వైవిధ్యాన్ని చూపించారు ఆరుద్రగారు. 'ఏకాంతసీమలోన మావైపు చూడకోయి మా గాధలన్ని లోకాన చాటకోయి' అనడం 'దయచేసి చందమామ దీవించి సాగవోయి' అనడం చాలా వెరైటీ. ఈ పాటను దేశ్ రాగంలో కంపోజ్ చేశారు. దేశ్ రాగం అంటే తెలుసుగా... భజేసుర్‌మే హర్‌తరఫ్ సే అంటూ వనస్తుందే అదన్నమాట. ఈ సినిమాకు సంబంధించి పెద్దగా తమాషా సంఘటనలు ఏమీ జరగలేదు. కాకపోతే ఒక స్టేజ్‌లో కొంచెం అందమైన అమ్మాయిని పట్టుకువచ్చారు. హరనాథ్ జోడిగా అన్నమాట. అసలు నాకు చెప్పినదాని ప్రకారం నా పాత్రకే ఎక్కువ పాటలు ఉన్నాయి. కానీ ఒక స్టేజ్ వచ్చేటప్పటికి మరి ఎట్లా జరిగిందో ఏమిటో ఆవిడకు చాలా ప్రాముఖ్యతనిచ్చేసి, రెండు మూడు పాటలు ఆమెకు పెట్టేశారు, జమునను బీటవుట్ చేసేయాలనుకున్నారేమో తెలీదు. దానిమీద నేను కొద్దిగా బాధపడటం... తరువాత గంగాధరరావు గారితో 'ఇదేమిటండీ నాకు చెప్పిన కథలో ఇంతమంది కూతుళ్లుంటారు... ఇలా ఉంటుంది.. అంటూ చెప్పారు. ఇప్పుడేమో ఆవిడ పాత్రకు ప్రాముఖ్యత నిచ్చేసి పాటలు పెంచేశారు. మరి ఇంత డబ్బు ఇచ్చి నన్ను ఎందుకు హీరోయిన్‌గా బుక్ చేసుకున్నారు. ఆవిడనే హీరోయిన్‌గా పెట్టుకుని ఉంటే మీకు డబ్బు ఆదా

# నేనూ నా పాటలు



| | |
|---|---|
| చిత్రం : గులేబకావళి కథ | రచన : సి.నారాయణరెడ్డి |
| సంగీతం: జోసఫ్ - కృష్ణమూర్తి | గానం: ఘంటసాల, పి.సుశీల |

అ: నన్ను దోచుకొందువటే ...
నన్ను దోచుకొందువటే వన్నెల దొరసానీ
ఆ: కన్నులలో దాచుకొందు నిన్నే నాస్వామీ నిన్నే నాస్వామీ ॥నన్ను॥
ఆ: తరియింతును నీ చల్లని చరణమ్ముల నీడలోన
పూలదండవోలె-కర్పూరకళిక వోలె
కర్పూరకళిక వోలె
అ: ఎంతటి నెరజాణవో నా అంతరంగమందు నీవు
ఎంతటి నెరజాణవో నా అంతరంగమందు నీవు
కలకాలము వీడని సంకెలలు వేసినావు
సంకెలలు వేసినావు ॥నన్ను॥
ఆ: నా మదియే మందిరమై నీవే ఒక దేవతవై
వెలసినావు నాలో నే-కలసిపోదు నీలో
కలసిపోదు నీలో
అ: ఏనాటిదో మనబంధం ఎరుగరాని అనుబంధం
ఎన్నియుగాలైనా యిది యిగిరిపోని గంధం
ఇగిరిపోని గంధం ॥నన్ను॥







అయ్యేది కదా" అంటూ అడగటం జరిగింది. ఆ సినిమా చేస్తున్నప్పుడు ఇటువంటి సంఘటనలవల్ల నేను ఇరిటేట్ అవ్వాల్సిన పరిస్థితి వచ్చింది. సినిమా కూడా యావరేజ్‌గా వెళ్లింది.

ఎందుకంటే ఆ రోజుల్లో జమునను ఎక్కువగా చూడాలని ప్రేక్షకులు కోరుకునేవారు. జమున వేషం ఎప్పుడైతే తగ్గి, సైడ్ క్యారెక్టర్ పెరిగిందో అది ఒక విధంగా పిక్చర్‌కు ఎఫెక్ట్ ఇచ్చింది. అలాంటి ఓ అనుభూతిని ఎదుర్కొన్నాను ఆ చిత్రంలో.

'ప్రియతమా రాధిక ' పాట ఎంతిష్టం అంటే ఎక్కడ నాకు పబ్లిక్ ఫంక్షన్ అయినా, ఈ పాటనే ఎక్కువగా పాడేదాన్ని. 'పదండి ముందుకు' సినిమా కోసం మేం రష్యా వెళ్లాం. అక్కడ రష్యన్ సబ్‌టైటిల్స్‌తో సెకండ్‌షోగా 'పదండి ముందుకు' వేస్తే, మొదటి ఆటగా వేరే సినిమా జరుగుతుండేది. అక్కడ చీర కట్టుకుని నేను ఒక్కదాన్నే ఉండేదాన్ని. రష్యా వాళ్లకు చీర కట్టిన వాళ్లంటే చాలా అభిమానం. వారు నా దగ్గరకు వచ్చి మాట్లాడుతున్నప్పుడు హిందీలో లతా పాడిన 'జ్యోతికలశ్ ఝలకే', 'ఆప్‌కీ నజరోం మే సమ్‌ఝా' పాటలతో పాటు 'ప్రియతమా రాధిక' పాటను పాడేదాన్ని. మారిషస్‌లో తెలుగు వాళ్ల సభలకు వెళ్లినప్పుడు కూడా 'ప్రియతమా రాధిక' పాటనే ఎక్కువగా పాడేదాన్ని. ఈ సినిమా తరువాత గంగాధరరావు గారి దర్శకత్వంలో 'కీలుబొమ్మలు' చేశాను అలా వరుసగా నాలుగు సినిమాల్లో చేశాను.

'గులేబకావళి కథ' గురించి కొన్ని జ్ఞాపకాలు చేసుకోవాలి. ఈ చిత్రం చేయటానికి ముందు ఓ సెన్సేషనల్ గాథ ఒకటుంది. గుండమ్మకథకు ముందు ఇద్దరు పెద్ద హీరోలు నాతో చేయుననటం, నేను కూడా అదే రీతిన సమాధానం ఇవ్వడం, తరువాత రాజీపడటం ఇవన్నీ మనం చెప్పుకున్నాం. కాకపోతే తమాషా ఏమిటంటే - గుండమ్మకథ కోసం కాంప్రమైజ్ అయిపోయిన మరునాడే రామారావుగారు పుండరీకాక్షయ్యగారిని మా ఇంటికి పంపించారు. "జమున గారికి గులేబకావళి కథలో ఓ మంచి క్యారెక్టర్ ఉంది. 10 రోజులు షూటింగ్ ఉంటుంది. ఆమె అయితే బాగుంటారు. నువ్వు వెళ్లి కథ చెప్పి ఆమెను ఒప్పించుకురా" అని చెప్పి పంపారు. పుండరీ కాక్షయ్య గారు కథ మొత్తం చెప్పారు. అది వేశ్య పాత్ర కదా! ఇదేమిటబ్బా రామారావు గారు ఈ వేషం ఇస్తానంటున్నారు అని నాకు డౌట్ వచ్చింది. కొద్దిగా గునుస్తూ .. "అదేమిటండీ అది వేశ్య క్యారెక్టర్ కదా! రామారావు గారు నన్ను ఎందుకు వేయమంటున్నారు "అని అడిగా. దానికి ఆయన "లేదండీ రామారావు గారు అలా ఆ క్యారెక్టర్ తీయట్లేదు. మిమ్మల్ని తీసుకున్న తర్వాత అలా ఎందుకు తీస్తారు? మీకు స్క్రిప్ట్ తీసుకువచ్చి చూపిస్తాను, ట్రీట్‌మెంట్ చాలా బాగుంటుంది" అన్నారు. మరి అంతపెద్ద హీరో నన్ను అడిగారు అంటే ట్రీట్‌మెంట్ చాలా బాగా చేసి ఉంటారని అనుకుని, రామారావుగారి మీద ఉన్న నమ్మకం, విశ్వాసంతో ఏమీ డిస్కస్ చేయకుండా సరే



అన్నాను. తరువాత రెండు మూడు రోజులకే షూటింగ్ స్టార్ట్ అయింది. హ్యాట్సాఫ్ టు రామారావు గారు... ఇప్పటికి కూడా 'గులేబకావళి కథ' సినిమా వేసుకుని చూస్తుంటే... నిజంగా ఓ వేశ్య క్యారెక్టర్‌లా అనిపించదు. ఓ కథానాయికని, ఓ రాజకుమారిని ఎలా ట్రీట్ చేయాలో అలాగే మహాపతివ్రతలా చిత్రించారు. సాధారణంగా వేశ్య క్యారెక్టర్ అంటే ఎలా చిత్రీకరిస్తారు? అలాంటిది మొత్తం కాన్సెప్ట్ మారిపోయింది. ఎంత డిగ్నిఫైడ్‌గా తీశారు...!? చెలికత్తెలు డ్యాన్స్ చేస్తుంటే ఒక తెర అడ్డుగా ఉంచి ఆవిడ పాడుతున్నట్టు చూపించారు. జమున నటిస్తున్నది కాబట్టి ఆ పాత్రను మార్చి వేశారు రామారావు గారు. ఆ క్యారెక్టర్ చూస్తున్నప్పుడు ఓ పవిత్రత కనిపిస్తుంది కానీ, వల్గారటీ ఏమీ కనిపించదు. జమున లాంటి ఆర్టిస్ట్ తో చేయిస్తున్నప్పుడు అది ఏ విధంగా చూపిస్తే జనం ఆదరిస్తారో ఆలోచించి.... అందులోనూ ఆయన పక్కనే ఉండే క్యారెక్టర్ కదా... కాబట్టి ఎంత బాగా ఆలోచించి ఆ క్యారెక్టర్ డిజైన్ చేశారో అనిపిస్తుంది.

ఇందులో పాటలు వచ్చినప్పుడు - డా॥సి.నారాయణరెడ్డి గారిని ఈ చిత్రం ద్వారానే రామారావు గారు చిత్రరంగానికి పరిచయం చేశారు. ఈచిత్రంలో వెరీ ఫేమస్ సాంగ్... ఇప్పటికీ జనం మురిసిపోయి చూసేటటువంటి పాట 'నన్ను దోచుకొందువటే వన్నెల దొరసాని'. సాహిత్యపరంగా, 'కర్పూరకళికవోలే.. ఇగిరిపోని గంధం' లాంటి పదాల్తో నారాయణరెడ్డి గారు చాలా గొప్పగా రాశారు. ఇక చిత్రీకరణ కూడా ఎంతో గొప్పగా చేశారు. ఒన్లీ ముఖాలు మాత్రమే చూపిస్తూ చాటుగా ఎంత సున్నితంగా తీశారో... ఒళ్లు జలదరించి... పులకిస్తుందంటామే... ఆ పులకరింతలు... అటు రామారావుగారి అందం కానీ, ఇటు జమున అందంకానీ చెప్పనలవి కానంత గొప్పగా తీశారు. లవ్‌సాంగ్ అంటే ఎలా తీయాలి... హృదయంలో పులకింత కలగాలి.... అలాంటి పులకరింత కలిగించినటువంటి పాట, పిక్చరైజేషన్, పెర్ఫార్మెన్స్... అన్నీ కలిసిన పాట ఇది. ఆయన కూడా ఎంత సున్నితంగా యాక్ట్ చేశారంటే... జనరల్‌గా రామారావు గారు లవ్ సీన్స్‌లో కూడా కొద్దిగా మొరటుగా, రఫ్‌గా చేసేవారు. అలాంటిది ఈ సీన్‌లో చాలా సున్నితంగా, చాలా చక్కగా యాక్ట్ చేశారు.

నాకు బాగా నచ్చినవి 'మిస్సమ్మ'లో 'మీకు మీరే మాకు మేమే', గుండమ్మ కథలో 'మౌనముగానే మనసు..', దీనిలో 'నన్ను దోచుకుందువటే' పాటలు. మనసు బాగా లేనప్పుడు మూడిటినీ నేను ఎప్పుడూ వేసుకుని చూసుకుంటుంటాను. ఈ పాటలను చూస్తున్నప్పుడు మళ్లీ నేను యాక్ట్ చేస్తున్నట్టుగా ఫీల్ అయిపోతూ ఉంటాను. యాక్ట్ చేసిన నాకే ఇలా ఉంటే చూసే ప్రేక్షకులకు ఎంత హృదయం పులకరించిపోయింటుందో కదా! ఈ పాట కోసం లిప్ మూమెంట్ కూడా ప్రత్యేకంగా ఇచ్చాం. రామారావుగారు కూడా అంతే. చాలా మంచి పాట.

వేషం చిన్నదైనా కూడా ఓ తృప్తి కలిగింది. ఇప్పటికి హైదరాబాద్ వచ్చి 30 ఏళ్లయింది. నారాయణరెడ్డి గారయితే... ఏ సభలోనైనా నేనూ, ఆయన ఉంటే ఈ పాట గురించి ప్రస్తావించకుండా ఉండరు. ఆయనకు నామీదున్న అభిమానం చెప్పనలవి కాదు. మేమిద్దరం ఉన్న ఏ సభలోనైనా ఈ పాట ప్రస్తావన లేకుండా సభలేదు.

ఆయనకు కూడా అంత గొప్పగా నచ్చిన పాట ఇది. రచయిత ఓ మంచి పాటరాసినా, ఆ పాటను చిత్రీకరించే దర్శకుడు, ఆ పాటను చక్కగా అభినయించిన నటీనటులు అన్నీ కలిసి వచ్చినప్పుడే ఆ రచయితకు కూడా మంచి పేరొస్తుంది. మరి ఇవాళ 'గులేబకావళి కథ' చిత్రం అంటేనే 'నన్ను దోచుకొందువటే' పాట గుర్తొస్తుంది. అన్‌ఫర్‌గెటబుల్ సాంగ్ అది. నారాయణరెడ్డి గారికి కూడా మంచి పేరొచ్చింది.

రామారావు గారికి ఓ అలవాటు ఉంది. కాస్ట్యూమ్స్ వేసుకుని సెట్‌లోకి వెళ్లగానే అందరు ఆర్టిస్టులూ ఆయనకి కనబడాలి. అందరినీ కింద నించీ పైదాకా చూసి ఏమైనా మార్పులుంటే చేస్తారు. అన్నిటికన్నా ముఖ్యమైనదేమిటంటే ఆర్టిస్టులందరికీ ఆయనే బొట్లు పెడతారు. మంచి కళాకారులు ఆయన. మంచి మంచి బొమ్మలు కూడా వేస్తారు. ఆయన హేండ్ రైటింగ్ కూడా చాలా బాగుంటుంది. అలాగే గడ్డం కింద ఆయన చేయి పెట్టి సున్నితంగా చక్కగా బొట్టు పెట్టి, దాని చుట్టూ మంచి డిజైన్స్ వేస్తారు. రామారావుగారి సినిమా ఏదైనా బొట్టు మాత్రం ఆయనే పెట్టేవారు. మగవాళ్లకి, ఆడవాళ్లకి, ముసలాళ్ళకి ఎవరికైనా సరే. ఈ గులేబకావళి కథలో నాకు బొట్టు పెట్టింది కూడ ఆయనే.

మరికొన్ని పాటల గురించి
వచ్చే సంచికలో...

తెలుగు సినిమా నేపథ్య గాయనీమణుల జీవిత చిత్రాలు తెలిపే

# కోయ్మా కోయ్మా కోకిలమ్మా 12



- ఇంద్రగంటి జానకీబాల

"ఓ వహో...
మేఘమాలా...
అందాల మేఘమాల
చల్లగ రావేలా-
మెల్లగ రావేలా-"
"అందమే ఆనందం
ఆనందమె జీవిత మకరందం"
"ఏడు కొండల వాడ
వెంకటారమణ"-

లీల పేరు చెప్పగానే తెలుగు సినిమా పాటల్లో ఆమె పాడిన ఎన్నో పాటలు ఒకదాని వెంట మరోటి గుర్తుకొచ్చి ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. ఒకటా రెండా! వందల కొద్దీ పాటలు, వరదలా మనసునిండా నిండిపోతాయి. తెలుగు పాటలు విని ఇష్టపడి, ఆనందపడే శ్రోతలకు మనసు ఉత్సాహంతో వుప్పొంగి పోతుంది.

పి. లీల పాడిన తెలుగు పాట వింటే ఆమె మాతృభాష తెలుగు కాదనీ, మలయాళమనీ ఎవరేనా అంటే నమ్మబుద్ధి పుట్టదు. అది ఆమె ప్రతిభకే కాక, పాట పాడటంలో ఆమెకు గల శ్రద్ధాసక్తులకు నిదర్శనంగా చెప్పుకోవాలి.

పాల్ఘాట్ చిత్తూరులో మీనాక్షి - ఇ.కె.కె. మీనన్ దంపతులకు లీల జన్మించారు. చిన్న వయసులోనే ఆమెలో గల సంగీత జ్ఞానాన్ని వారు గ్రహించి, ఆమెకు చక్కని శిక్షణ నిప్పించారు.

నాలుగో తరగతి వరకే చదువుకున్న ఆమె మణి భాగవతార్, చెంబై వైద్యనాథ భాగవతార్ వద్ద, రాజగోపాలయ్యర్ వద్ద కర్ణాటక సంగీతం నేర్చుకున్నారు. ఊరికే నేర్చుకోవడమే కాకుండా చిన్న వయసులోనే కచ్చేరీలు చేసి పేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

అయితే సాధారణంగా శాస్త్రీయ సంగీతం పాడటానికుండే అర్హతలతో బాటు, మరికొన్ని అదనపు మెలుకువలు, సొగసులు ఆమె కంఠంలో వుండటం వల్ల ఆమె 1948లో సినీరంగ ప్రవేశం చేశారు. మొట్టమొదట ఘంటసాల వెంకటేశ్వరరావు ఆమెకు శోభనాచల వారి 'మనదేశం'(1949) సినిమాలో అవకాశమిచ్చి పాడించారు. అందులో'బాలా త్రిపురసుందరీ' అనే పాటతో తన సినీ నేపథ్య గానానికి శ్రీకారం చుట్టారామె. అనతికాలంలోనే తిరుగులేని కళాకారిణిగా చిత్ర సీమలో స్థిరపడ్డారు.

ఇక్కడొక సంగతి స్మరించుకోవాలి. తెలుగువారి అభిమాన నటుడు, ఆరుకోట్ల ఆంధ్రుల ఆత్మాభిమానాన్ని రాజకీయంగా ప్రపంచానికి చాటి చెప్పిన నందమూరి తారక రామారావు కూడా ఇదే 'మనదేశం' సినిమా ద్వారా చిత్ర పరిశ్రమకు పరిచయం కావడం గమనించదగ్గ విషయం. గొప్ప కళాకారుల్ని సినిమా పరిశ్రమకి పరిచయం చేసిన గౌరవం, ఘనత నిర్మాత సి. కృష్ణవేణికి చెందుతాయి. నటి, గాయకురాలు అయి, ఎదుటివారిలోని ప్రతిభను గుర్తించి, ప్రోత్సహించిన సంస్కారవంతురాలు కృష్ణవేణి.

లీలది మధురమైన కంఠం, పైగా గంభీరమైన స్థాయీ భావం గల కఠం కూడా, చక్కని 'రేంజ్' వుండి, అత్యంత స్పష్టంగా, మాటలలోని భావాన్ని సున్నితంగా, సంగీతపరంగా మేళవించగల నైపుణ్యం వున్న గాయని పి. లీల.

ఘంటసాల ఆమెను పరిచయం చేసినప్పటికీ వరుసగా అందరు సంగీత దర్శకులు ఆమెకు పాటలిచ్చి పాడించారు. దానికి కారణం ఆమెలోని ప్రతిభా, ప్రావీణ్యమే గానీ మరోటి లేదు.

"నేను తెలుగు సినిమాలలో పాటలు పాడటం మొదలుపెట్టగానే మా నాన్నగారు నాకు తెలుగు ట్యూషన్ పెట్టి నేర్పించారు. భాష తెలియకపోతే భావంతో పాటెలా పాడగలవు అనేవారు" అంటూ లీల వాళ్ళ తండ్రిగార్ని తల్చుకుంటారు.

సి.ఆర్. సుబ్బురామన్ సంగీతం వహించిన 'శ్రీ లక్ష్మమ్మ కథ' (అంజలీదేవి, నాగేశ్వరరావు) పాటలన్నీ పాడి భేష్ అనిపించుకున్నారు. 'కీలుగుఱ్ఱం'లో 'దిక్కుతెలియదేమి సేతు - దేవ దేవ కావరావా' పాట చక్కగా వుంటుంది. అందులోని విషాదం లీల గొంతులో నిండుగా పలికింది, అన్యాయానికి గురైన మహారాణి (నటి బాలామణి) గుడ్డిదై అడవులలో పడరాని పాట్లు పడుతూ పాడే పాట యిది. చిన్న వయసైన లీల ఈ పాటకు ప్రాణం పోశారు.

ఓగిరాల రామచంద్రరావు సంగీతం చేసిన 'గుణసుందరి కథ'లో నాయిక



శ్రీరంజని పాటలన్నీ లీలే పాడారు.

**శ్రీతులసీ - ప్రియ తులసీ జయము నీయవే...**

**ఉపకార గుణాలయవై వున్నావుకదే -మాతా!**

**ఓ మాతా.... రావా... మొరవినవా....**

ఈ పాటలు ఆంధ్రులనందర్నీ వుర్రూత లూగించేశాయి. జూనియర్ శ్రీరంజని ముఖంలో చూపించిన విషాదమంతా లీల తన గొంతులో పలికించారు. ఆ కాలంలో గృహిణులు తులసికోట దగ్గర కూర్చుని 'శ్రీ తులసీ ప్రియ తులసీ' పాడుకునే వారంటే అది అతిశయోక్తి కాదు.

అంతవరకు లీల జాలి గొలిపే విషాద గీతాలు, సౌమ్యత గల భక్తి పాటలూ పాడి అందర్నీ ముగ్ధుల్ని చేసి వున్నప్పటికీ 'పాతాళభైరవి' (1951) సినిమాతో లీల పాటలో శృంగారాన్ని పలికించే నేర్పుకీ, గొంతులో వున్న రాజసానికీ, ఠీవికి, మధురమైన లాలిత్యానికి ఒక గుర్తింపు వచ్చింది. పండితుల్ని, పామరుల్నీ 'పాతాళభైరవి' పాటలు అలరించాయి. ఘంటసాల, లీల యుగళగీతాలు యువతను వుయ్యాల లూగించాయి.

**'తీయని ఊహలు హాయిని గొలిపే**

**వసంత గానమే హాయీ**

**వసంత నాట్యమే హాయ్ -హాయ్'**

అనే పింగళి నాగేంద్రరావు రచనను లీల బృందంతో పాడి నందనవనాల్ని చూపించారు. ఘంటసాల సంగీతానికి, పింగళి రచనలకు లీల మధురమైన కంఠం ప్రాణం పోసింది.

**'నాలో ఏమొ నవభావనగా మెల్లన వీణ మ్రోగిందీ**

**అనురాగాలే ఆలాపనగా మనసున కోయిల కూసే..**

**('కలవరమాయె మదిలో' ఘంటసాలతో యుగళగీతం)**

ముద్దుముద్దుగా ముగ్ధమోహనంగా పలికింది లీల గొంతు. శృంగార భావనను అత్యంత మధురంగా పలికించిన ఉదాహరణలు విజయా వారి చిత్రాలలోనే ఎక్కువగా కనిపిస్తాయి.

'పెళ్ళిచేసి చూడు' (1952)లో 'ఏడుకొండలవాడా! వెంకటారమణా!' పాట భక్తి పాటన్నట్టు మొదలై చివర కొంటెతనపు ముక్తాయింపుతో ముగుస్తుంది. అందులోనిదే 'మనసా ! నేనెవరో నీకు తెలుసా' ఎంతో ప్రజాదరణ పొందింది.

మిస్సమ్మ (1955)లో

**'ఏమిటో ఈ మాయా !'**

**'కరుణించు మేరీ మాతా!'**

**'రాగ సుధారస' (త్యాగరాజ కీర్తన)**

**'రావోయి చందమామా!' (ఏ. ఎమ్.రాజాతో యుగళ గీతం)**

**'తెలుసుకొనవె చెల్లీ'**

ఇలా అన్ని పాటలూ మిస్సమ్మలో ఆణిముత్యాలే.

మాయాబజార్ (1957)లో -

**'లాహిరి లాహిరి లాహిరిలో'**

**'చూపులు కలిసిన శుభవేళ'**

**'నీవేనా నను పిలిచినదీ'**

**'నీ కోసమే నే జీవించునదీ'**

-చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయాయి.

పి.లీల విజయావారిచిత్రాలకే పరిమితమై పోలేదు.

సంసారం-1950 (ఇటుపై నా గతేమి?), జయసింహ-1955 (ఈనాటి ఈ హాయి), ఇలవేల్పు-1956(స్వర్గమన్న వేరే కలదా), తెనాలి రామకృష్ణ- 1956 (జగములా దయనేలే జననీ), ముద్దుబిడ్డ - 1956 (జయమంగళ గౌరీ దేవి), పాండురంగ మహాత్యం-1957 (వన్నెల చిన్నెలనెరా!), భలే అమ్మాయిలు- 1957 (మురళీధరా -హరే మోహన కృష్ణా -గోపాల జాగేలరా), అప్పుచేసి పప్పుకూడు - 1957 (కాలం కాని కాలంలో), భలేరాముడు- 1957 (ఓహో మేఘమాలా), చిరంజీవులు-1956 (తెల్లవారవచ్చె) రాజమకుటం, -1960 (సడిసేయకోగాలి), శాంతి నివాసం (కలనైనా నీ తలపే), లవకుశ (రామకథను వినరయ్యా, శ్రీరాముని చరితమునూ) (పి.సుశీలతో), రహస్యం (శ్రీలలిత శివజ్యోతి సర్వకామదా), సీతారామ కల్యాణం (సరసాల జవరాలను), జయం మనదే (కలువల రాజా కథ వినరావా), సువర్ణ సుందరి (బంగారు వన్నెల), బ్రతుకుతెరువు (అందమె ఆనందం), మహామంత్రి తిమ్మరసు (చరిత్ర ఎరుగని మహాపాతకము), పాండవ వనవాసం (దేవా ! దీనబాంధవా!), మర్మయోగి (నవ్వుల నదిలో పువ్వుల పడవ)....

ఇలా చెప్పుకుంటూపోతే వేలకొద్దీ పాటలావెుకు వున్నాయి. పి.లీల ఒక పదిహేనేళ్ళు తెలుగు సినిమా నేపథ్య గానంలో మకుటంలేని మహారాణిగా వెలుగొందారు. క్రమంగా ఆమె కంఠం స్వభావం కొంచెం లావుగా మారడం వల్ల, గంభీరంగా వుండటం వల్ల కథానాయికకు పాడటానికి శృంగార అభివ్యక్తికి నప్పదనే భావం కలిగింది నిర్మాతలలో, సంగీత దర్శకులలో.

నృత్యగీతాలు, భక్తిపాటలు, దుఃఖం, విషాదం, పాడటానికి ఆమెకు అవకాశాలు వస్తున్నా సోయగంగా, హుషారైన కథానాయిక పాటలకు అవకాశాలు 1964 నుంచి బాగా తగ్గిపోయాయని చెప్పాలి. రానురాను ఆమె కంఠం కర్ణాటక శాస్త్రీయ సంగీతానికి అనువైన కంఠంగా రూపుదిద్దుకుంది.

ఆమె సినిమా సంగీతంలో ఎంత ఎత్తు ఎదిగినా, ఎన్ని వేల పాటలు పాడినా, ఎంత కీర్తి, ఎంత డబ్బూ సంపాదించినా శాస్త్రీయ సంగీతం వదలకుండా సాధన చేస్తూ పాట కచ్చేరీలు చేస్తూనే వున్నారు. అందువల్ల కంఠంలో శాస్త్రీయత (Classical Touch) ఎక్కువగా వుంటూ వచ్చింది.

అదీకాక సినిమా పాట చాలా రూపాంతరాలు చెందుతూ వచ్చింది. పాట రాయడంలో, బాణీ కూర్చటంలోనూ, ఆర్కెస్ట్రా వాడే విధానంలోనూ , పాట చిత్రీకరణలోనూ ఎన్నో మార్పులు వచ్చాయి. వీటిలో ముఖ్యంగా పాశ్చాత్య సంగీత ధోరణులు, హిందూస్తానీ సంగీత పోకడలు తెలుగు సినిమా పాటలో కలిసిపోతూ వచ్చాయి. కేవలం రంగస్థల సంగీతానికి అనుసంధానంగా వుండే సినిమా పాట లీల వచ్చేనాటికి సొంత రూపురేఖలు దిద్దుకుంది. పూర్తిగా నాటకాల పాటల బాణీల నుండి వేరుపడింది. ఇందులో భాగం హెచ్చు శ్రుతిలో పాడటం, రకరకాల విన్యాసాలు చేయడం, నెమ్మదిగా స్థిమితంగా పాడే పద్ధతి పోయి, అన్నింటా వేగం పంజుకోవడం జరిగింది. అప్పటికే అత్యున్నత స్థానంలో పి. సుశీల స్థిరపడి, లీల గొంతులో వున్న లక్షణాలకు మించి మరికొన్ని మెలుకువలు కలిగి వుండి, 'సినిమా పాట'లో ఒదిగిపోయిన సుశీల విజృంభించింది. పి.లీల గొంతులో బాగా పెద్దరికం ధ్వనించటం వల్ల సుశీల గొంతును నిర్మాతలు, సంగీత దర్శకులు ఎక్కువ ప్రాముఖ్యంతో ఆదరించారు.

అయితే శాస్త్రీయ సంగీతం రేడియోలో పాడటం, బయట కచ్చేరీలు చేయడం, భక్తిగీతాల క్యాసెట్లు పాడటం పి. లీల చేస్తూనే వున్నారు.

"మీకు మీ వృత్తి పట్ల అసంతృప్తి ఏమైనా వుందా" అనడిగితే, ఆమె గలగలా నవ్వుతూ "లేదండీ. నేను చాలా సంతోషంగా వున్నాను. భగవంతుని దయవల్ల నేను ఎన్నో పాటలు పాడాను. తెలుగులో మరీ ఎక్కువ పాడాను. నాకు డబ్బు, పేరూ వచ్చాయి. నాకెంత ప్రాప్తమో అంతా వచ్చిందని నేను నమ్ముతాను" అన్నారు పి.లీల.

"మీకే సంగీత దర్శకులంటే ఎక్కువ ఇష్టం" అంటే "మా గురువుగారు ఘంటసాల, వారే నాకు మొదట అవకాశం యిచ్చారు. ఆ తర్వాత కూడా ఎప్పుడూ నాచేత వారి సినిమాల్లో పాడిస్తూ వచ్చారు. వారు సంగీత దర్శకత్వం వహించిన దాదాపు అన్ని సినిమాల్లోనూ నేను పాడాను. ఇంకా పెండ్యాల నాగేశ్వరరావు గారు, రాజేశ్వరరావుగారూ నాకెంతో మంచి పాటలిచ్చి పాడించారు" అంటూ వారిని గౌరవ భక్తులతో తల్చుకుంటారామె.

"నాకు భక్తిరసమంటే యిష్టం. నా ఇష్టదైవం శ్రీకృష్ణుడు. అదీ గరువాయూరు బాలకృష్ణుడు నాకు కులదైవం. నాకు భక్తిపరమైన పాటలు పాడటం యిష్టం. కరుణ, విషాదం, కూడా పాడాను. హుషారు పాటలు ఎక్కువ పాడలేదు. కానీ శృంగారం, ప్రేమ, కొంటెతనం గల పాటలు పాడినప్పుడు కూడా సమర్థంగా పాడి భేష్ అనిపించుకున్నాను. ఎవ్వరూ నేను పాడింది బాగాలేదు అని అనలేదు".

"మగవారి అండ, అంటే భర్త అండదండలు లేకుండా సినిమా పరిశ్రమలో నిలద్రొక్కు కోవడం కష్టమనే అంటారు. మరి మీరేమంటారు"-

"నాకలాంటి సమస్యలేం లేవు. మా నాన్నగారు వున్నారు. ఆయనే చూసుకున్నారు. నాకు పాటలు పాటంతటవే వచ్చాయి. చక్కగా రిహార్సిల్స్ చేసేవాళ్ళం. సంగీత దర్శకులు సంతృప్తి పడేవరకు, పాట బాగా రికార్డు అయ్యేవరకు పాడేదాన్ని. వాళ్ళు అనుకున్నది నా కంఠంలో పలకడం ముఖ్యం. దానికోసం వినయంగా కృషిచేసి, విసుగు లేకుండా పాడేదాన్ని".

పి.లీల గొంతును ఎక్కువగా అభిమానించి పాడించిన వారిలో మొదటివారు ఘంటసాల, రెండోవారు రాజేశ్వరరావు, వారి దగ్గర ఆమె చాలా చక్కని పాటలు పాడారు.

ఇప్పుడామెను చూస్తే ఎంతో హుషారుగా, నిర్మలంగా, స్నేహంగా కనిపిస్తారు. వచ్చిన అతిథుల్ని ఎంతో అప్యాయంగా ఆహ్వానించి, గౌరవించి, మర్యాద చేసే ఉత్తమ సంస్కారం ఆమెకుంది.

తెలుగు సినిమా పాట చరిత్రలో పి.లీల ప్రథమ స్థానంలో నిలబడి వున్నారు. ఆమెకు విశిష్టమైన కీర్తి వుంది.

"మీరు సంగీత దర్శకత్వం వైపు దృష్టి మళ్ళించలేదా" అన్నప్పుడు

ఆమె నిగర్వంగా నవ్వారు. "అదొక ప్రత్యేకమైన పని. అయినా 'చిన్నారి పాపలు' అనే సినిమాకి నేను సంగీతం కూర్చాను. ఆ సినిమాకి అందరం మహిళలమే. ఆ చిత్రాన్ని వి.మధుసూధనరావు (డైరెక్టర్) భార్య సరోజిని నిర్మించారు. దర్శకత్వం మహానటి సావిత్రి చేయగా నేను సంగీతం చేశాను. అయితే నాకు పూర్తి సహాయం, సహకారం అందించిన వారు స్వర్గీయ ఎస్.పి.కోదండపాణిగారు. ఆయన గొప్ప వ్యక్తి. అందులో సంగీతానికేమైనా క్రెడిట్ వుంటే అది ఆయనకే దక్కాలి " అన్నారామె.

ఆమె మాటల్లో ఎంతో నిజాయితీ, నిరాడంబరత కనిపిస్తాయి. ఏమాత్రం క్రెడిట్ ఎదుటివారికి పోతుందన్నా వాటాకొచ్చే కళాకారుల నైజానికిది పూర్తిగా విరుద్ధం.

మొదట్లో మన సినిమాల్లో సంగీతం నాటకాలలోని సంగీతానికి నకలుగా వుండేదని చెప్పుకున్నాం కదా ! అందులో భక్తి, విషాదం ఎక్కువగా వుండేవి. కారణం స్త్రీ పాత్ర చిత్రణ రెండుగా విభజించి మంచీ - చెడుగా నిర్ణయించేవారు. మంచి అంటే సౌశీల్యం , భక్తి, పతివ్రతా ధర్మం. భర్త వేధించుకుతింటున్నా అతని పాదాలు దగ్గరే పడివుండటం ఇదే కథానాయిక పాత్రకు ముఖ్య గుణాలు. -అలాంటి సందర్భాలలో నాయికకు పాడటానికి లీల కంఠాన్ని సంగీత దర్శకులు ఎక్కువగా యిష్టపడ్డారు- నాటకాలను సినిమాగా తీయడం వెనుకబడ్డాక, కాశీమజిలీ కథలు, పేరంటాళ్ళ కథలు తీశారు. ఇలాంటి వాటిలో 'కీలుగుఱ్ఱం' ఒకటి. ఈ చిత్రం సమయానికి ఆమె కొత్తగా పరిశ్రమలోకి అడుగుపెట్టిన యువ కళాకారిణి అయినా ఆమె చేత పెద్ద తరహా పాటలే పాడించారు.

'కీలుగుఱ్ఱం'లో నాగేశ్వరరావు సరసన వున్న కథానాయికకు పి.లీల చేత పాడించకుండా, మహారాణి (నాగేశ్వరావు తల్లి)కి పాడించారు. అందుకే 'కాదు సుమా! కల కాదు సుమా! ఘంటసాల, వక్కలంక సరళ పాడారు. ఇదొక పరిశీలన మాత్రమే. దానికి కారణం ఆమె గొంతు లావుగా, నిండుగా, బరువుగా వుండటమే కావచ్చు. అయితే ఆమె వెనువెంటనే పాడిన 'పాతాళభైరవి ' పాటల వల్ల ఆమె గొంతును ఎంత సున్నితంగా, లలితంగా, శృంగారం పలికిస్తుందో అర్థమైంది.

లీల ప్రముఖులైన హీరోయిన్లు అంజలీదేవి, దేవిక, బి.సరోజాదేవి, సావిత్రి, కృష్ణకుమారి, జమున, షావుకారు జానకి, మాలతి, జి.వరలక్ష్మి, రాజసులోచన, శ్రీరంజని, లక్ష్మీరాజ్యం అందరికీ పాడి, మెప్పు పొందారు.

అయితే 'గుండమ్మకథ' చిత్రంలో సావిత్రికి అంతవరకు లీల ప్లేబ్యాక్ పాడినా 'అలిగిన వేళ నే చూడాలి' పాట సుశీల చేత పాడించటం ద్వారా లీల నుంచి సుశీలకి మొగ్గటం బాగా కనిపిస్తుంది.

నాకు కృష్ణుడంటే చాల ఇష్టమని చెప్పాను కదా ! అందుకే దేవా ! దీన బాంధవా! అసహాయకురాలరా కావరా' (పాండవ వనవాసం) పాడినప్పుడు నేను నిజంగా ఆ కృష్ణుడ్ని భక్తితో ప్రార్థించాను. ఆ పాట పాడేటప్పుడు నాకు కళ్ళల్లో నీరూరింది" అన్నారామె.

శాస్త్రీయ సంగీతం పునాదిగా సినిమాల్లో పాడాలంటే మొదటగా లీల పేరే గుర్తుకొస్తుంది. ఆమె సుశీలతో కలిసి లవకుశలో పాడిన పాటలు అత్యంత మధురాలు.

పి.లీల తెలుగు, కన్నడం, తమిళం, మళయాళం, సింహళం మొదలైన భాషల్లో వేలాది పాటలు పాడారు. మాతృభాష మళయాళంలోనే ఆమె తక్కువ పాటలు పాడారుట. తెలుగు సినిమా నేపథ్య గానానికి ప్రతిష్ఠ కూర్చిపెట్టిన పి.లీల తెలుగు గాయనియే. తెలుగు పాటలో ఆమె కామే సాటి. ■



# పి.లీల హిట్స్

**చిత్రం: పెళ్ళిచేసి చూడు** రచన: పింగళి
**సంగీతం: ఘంటసాల** గానం: పి.లీల

ఏడు కొండల వాడ వెంకటారమణా
సద్దు సేయక నీవు నిదురపోవయ్యా
పాలసంద్రపు టలలు పట్టెమంచముగా
పున్నమి వెన్నెలలు పూలపానుపుగా
కనులనొలికే వలపు పన్నీటి జల్లుగా
అన్ని అమరించెనీ అలిమేలు మంగా ।ఏడు॥
మా పాలి దైవమని నమ్ముకున్నామయ్య
నా భాగ్యదేవతా ననుమరువకయ్య
బీబి నాంచారమ్మ పొంచి ఉన్నాదయ్య
చాటు చేసుకు ఎటులో చెంతచేరెదనయ్య
ఏడు కొండల వాడ వెంకటారమణా
సద్దు శాయక... దొంగా....నిదురపోవయ్య

**చిత్రం: సంసారం** రచన: సదాశివబ్రహ్మం
**సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి** గానం: పి.లీల

అమ్మా... శ్రీతులసీ... దయారాశివమ్మా
మాయమ్మా... శ్రీతులసీ... దయారాశివమ్మా
నీ పదమే... తారకమే దేవీ... ॥అమ్మా॥
కోరెద నీ సన్నిధీ... బాధలలో... పెన్నిధీ...॥కోరెద॥
నీవే కాదా శరణము దేవీ... ॥అమ్మా॥
మా స్త్రీజాతికి పరమా ధర్మము, నీ గుణమే తల్లీ...
ఇల స్త్రీజాతికి పరమా ధర్మము, నీ గుణమే తల్లీ...
రూపముగొని సౌశీల్యము నీలో ॥రూపము॥
కలుషహారిణీదేవి... ॥అమ్మా॥
ఈ భవ జలధీ, నీవే వారధీ ॥ఈ భవ॥
ఇహపర సౌఖ్యప్రదాయి, ప్రదాయి ॥ఈ భవ॥
నమ్మితి నా మదిలో, భవభయహారిణీ
సాధన నీ నామస్మరణే ॥సాధన॥
దేవీ ॥అమ్మా॥

**చిత్రం: బ్రతుకుతెరువు** రచన: జూనియర్ సముద్రాల
**సంగీతం: సి.ఆర్.సుబ్బరామన్, ఘంటసాల** గానం: పి.లీల

అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం
అందమె ఆనందం
పడమట సంధ్యారాగం
కుడి ఎడమల కుసుమ పరాగం ॥పడమట॥
ఒడిలో చెలి తీయని రాగం ॥ఒడిలో॥
జీవితమే మధురానురాగం ॥జీవితమే॥ ॥అందమె॥
చల్లని సాగర తీరం
మది జిల్లను మలయసమీరం ॥చల్లని॥
మదిలో కదిలే సరాగం ॥మదిలో॥
జీవితమె అనురాగయోగం ॥జీవితమె॥
అందమె ఆనందం
ఆనందమె జీవిత మకరందం

చిత్రం : రహస్యం　　రచన: మల్లాది రామకృష్ణశాస్త్రి
సంగీతం: ఘంటసాల　　గానం : పి.లీల

శ్రీలలితా శివజ్యోతి సర్వకామదా
శ్రీ గిరి నిలయా గిరామయా సర్వమంగళా ॥శ్రీ లలితా॥
జగముల చిరునగవుల పరిపాలించే జననీ
అనయము మము కనికరమున కాపాడే జననీ
మనసే నీ వశమై స్మరణే జీవనమై
మాయని వరమీయవే పరమేశ్వరీ మంగళనాయకి ॥శ్రీ లలితా॥
అందరికన్నా చక్కని తల్లికి సూర్యహారతి
అందాలేలే చల్లని తల్లికి చంద్రహారతి
రవ్వల తళుకుల కళలా జ్యోతుల కర్పూర హారతి
సకల నిగమ వినుత చరణ శాశ్వత మంగళ హారతి ॥శ్రీ లలితా॥

చిత్రం: చిరంజీవులు　　రచన: మల్లాది రామకృష్ణశాస్త్రి
సంగీతం: ఘంటసాల　　గానం: పి.లీల

తెల్లవారవచ్చె -తెలియక నాసామి
మళ్లీ పరుండేవు లేరా మళ్లీ పరుండేవు లేరా ॥తెల్లవారు॥
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మళ్లీ పరుండేవు మసలుతూ వుండేవు
మారాము చాలింక లేరా
మారాము చాలింక లేరా ॥తెల్లవారు॥
కలకలమని పక్షి గణములు
చెదిరెను కళ్యాణ గుణధామ లేరా ॥కలకల॥
తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా తరుణులందరు దధి చిలికే వేళాయే
దైవరాయ నిదురలేరా దైవరాయ నిదురలేరా
నల్లనయ్యా రారా! ననుగన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నల్లనయ్యా రారా! ననుగన్నవాడా!
బుల్లితండ్రి రారా బుజ్జాయి రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా
నాన్నా మీ అమ్మ గోపెమ్మ పిలిచేను
వెన్నతిందువుగానీ రారా వెన్న తిందువుగాని రారా ॥తెల్లవారు॥

చిత్రం: మహామంత్రి తిమ్మరుసు　　రచన: పింగళి
సంగీతం: పెండ్యాల　　గానం: పి.లీల, బృందం

ఆంధ్రదేవా
వెంకటేశ్వరా
విరూపాక్షస్వామీ... ... ...
చరిత్ర ఎరుగని మహాపాతకము మా దేశానికి పట్టినదా... ...
ఆంధ్రదేవా వెంకటేశ్వరా విరూపాక్షస్వామీ ॥చరిత్ర॥
ఉపకారమే ఒక నేరమా... ...
అపకారమే ప్రతిఫలమా... ...
ఇదే నీ న్యాయవిధానమా... ...
మౌనమె నీ సమాధానమా... ...
మౌనమె నీ సమాధానమా ॥చరిత్ర ఎరుగని॥
నాల్గు పాదముల ధర్మము నడిచే రోజులు
నేటితో తీరినవా... ...
న్యాయమరయక జాలక రాజే
అన్యాయానికి పాల్పడెనా
అన్యాయానికి పాల్పడెనా ॥చరిత్ర ఎరుగని॥
అందరి కన్నూ అప్పాజీ
ఆ మహాత్ము కన్నులె పొడిపించే... ...
ఆంధ్రజ్యోతియే ఆరిపోవగా
ఈ విధి రాయలె జేసెనా... ...
ఈ విధి రాయలె జేసెనా..

చిత్రం: శాంతినివాసం　　రచన: జూనియర్ సముద్రాల
సంగీతం: ఘంటసాల　　గానం: పి.లీల

సాకీ : తుషార శీతల సరోవరాన అనంత నీరవ నిశీథిలోన
ఈ కలువ నిరీక్షణ... నీ కొరకే - రాజా - వెన్నెల రాజా
ప : కలనైనా నీ తలపే ॥కలనైనా॥
కలవరమందైనా నీ తలపే ॥కలనైనా॥
చ : కలువ మిరాలపు కమ్మని కలలు ॥కలువ॥
కళలూ కాంతులు నీ కొరకేలే ॥కళలూ॥
చెలి ఆరాధన సాధన నీవె జిలిబిలి రాజా జాలి తలచరా ॥కలనైనా॥
చ: కనుల మనోరథ మాధురి దాచి ॥కనుల॥
కానుక చేసే వేళకు కాచి
వాడే రేకుల వీడని మమతల వేడుచు నీకై వేచి నిలచెరా ॥కలనైనా॥

చిత్రం : రాజమకుటం　　రచన: దేవులపల్లి
సంగీతం: మాస్టర్ వేణు　　గానం : పి.లీల

ప: సడిచేయకోగాలి సడిచేయబోకే ॥2॥
బడలి ఒడిలో రాజు పవళించెనే ॥సడి॥
చ: రత్న పీఠికలేని రారాజు నాస్వామి మణికిరీటం లేని మహారాజు గాకేమి
చిలిపి పరుగులు మాని కొలుచుకోరాదే ॥సడి॥
చ: ఏటి గలగలలకే ఎగిరి లేచేనే
ఆకు కదలికలకే అదరి చూసేనే
నిదుర చెదిరిందంటే నే నూరుకోనే ॥సడి॥
చ: పండు వెన్నెల నడిగి పాన్పు తేరాదే
నీలి మబ్బులదాగు నిదుర తేరాదే
విరుల వీవన పూని విసిరిపోరాదె ॥సడి॥

చిత్రం: ఉయ్యాల - జంపాల　　రచన: ఆరుద్ర
సంగీతం: పెండ్యాల　　గానం: పి.లీల, బృందం

అందాల రాముడు ఇందీవర శ్యాముడు
ఇనకులాబ్ధి సోముడూ ఎందువలన దేముడూ ॥అందాల॥
ఎందువలన దేముడు
తండ్రి మాటకై పదవుల త్యాగమె చేసెనూ ॥తండ్రి॥
తన తమ్ముని బాగుకై తాను బాధపొందెను
అందాల రాముడు అందువలన దేముడు ॥అందాలా॥
అనుభవించదగిన వయసు అడవిపాలుజేసెను ॥అనుభవించు॥
అడుగు పెట్టినంతమేర ఆర్యభూమి జేసెను
అందాల రాముడూ అందువలన దేముడూ ॥అందాల॥
ధర్మపత్ని చెరబాపగ దనుజుని దునుమాడెనూ ॥ధర్మపత్ని॥
ధర్మము కాపాడుటకా సతినే విడనాడెనూ
అందాల రాముడూ అందువలన దేముడూ
అందాలా రాముడు ఇందీవర శ్యాముడు
ఇనకులాబ్ధి సోముడూ ఇలలో మన దేముడూ ॥అందాలా॥

చిత్రం : పాండవ వనవాసము　　రచన : సముద్రాల
సంగీతం: ఘంటసాల　　గానం : పి.లీల

కృష్ణా ! కృష్ణా ! కృష్ణా !
దేవా ! దీనబాంధవా ! అసహాయురాలరా ! కావరా దేవా !
కాలుని అయినా కదనములోనా గెలువజాలిన నా పతులూ
ధర్మబంధము త్రెంచగలేక మిన్నకుండేరుస్వామీ
నిన్నే మదిలో నమ్ముకొనేరా నీవే నాదిక్కు రారా ॥దేవా॥
మకరిపాలై శరణమువేడిన కరినికాపాడినావే
హిరణ్యకశిపు తామసమణచి ప్రహ్లాదు రక్షించినావే
కుమతులు చేసే ఘోరమునాపి కులసతి కాపాడలేవా
కుమతులు చేసే ఘోరమునాపి కులసతి కాపాడలేవా॥దేవా॥
గోవిందా ! గోపీ జనప్రియా ! శరణాగత రక్షకా !
పాహిమాం పాహి ! పాహి ! కృష్ణా !

సెప్టెంబరు 18, 2004 వినాయక చవితి సందర్భంగా....



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

# లలిత సంగీతం

## శ్రీ గణేశా చిత్స్వరూపా

ప॥ శ్రీ గణేశా చిత్స్వరూపా
సిద్ధి బుద్ధుల నొసగుమా
విఘ్నములు తొలగించుమా
విభవముల చేకూర్చుమా ॥శ్రీ గణేశా॥

చ॥ పల్లవమ్ముల పూజ చేతుము
చల్లగా కాపాడుమయ్యా
తొల్లిపూజలు నీకు భక్తిని
ఎల్లవేళల చేతుమయ్యా ॥శ్రీగణేశా॥

చ॥ తానమాడెడి శైలసుతమది
తలపునందున జననమంది
తండ్రి వరమున ఏన్గుముఖమున
దివ్యగణ వాల్లభ్యామందిన ॥శ్రీగణేశా॥

చ॥ కుడుములను తెమ్మందువా
కోరినవి మాకిత్తువా
నీదుపూజలు భక్తి చేతుము
నింద చెందక బ్రోవుమా ॥శ్రీగణేశా॥

**బృందగీతం**

**రచన** : శ్రీమతి డా॥ఎం. పద్మినీదేవి
**సంగీతం** : ఎం. చిత్తరంజన్
**రాగం** : కీరవాణి -21 వ మేళ కర్త రాగం
**తాళం** : మిశ్రచాపు (కర్ణాటక సం॥)
రూపక్ తాల్ (హిందుస్తాని సం॥)
**ఆరోహణ** : సరిగమపదనిస
**అవరోహణ** : సనిదపమగరిస

షడ్జము, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, శుద్ధధైవతం, కాకలినిషాదం యీ రాగంలోని స్వరాలు.

కీరవాణి కర్ణాటక సంగీతంలో బాగా ప్రచారంలో వున్న రాగమే. భక్తి, శృంగారాలకు అనువైనది. కనుక లలిత సంగీతంలో కూడా యీ రాగంలో ఎన్ని భక్తి గీతాలు, విరహగీతాలు మొదలైనవి చాలా మంది స్వరకర్తలు మన కందించారు. ఈ రాగం గురించి మరికొన్ని వివరాలతో 'హాసం' 1-15 అక్టోబర్, 2002 సంచికలో ప్రస్తావించాను.

హైందవ సంప్రదాయంలో గణపతికి చాలా విశిష్టమైన ప్రాముఖ్యత వున్నది. తొలి పూజలందుకునే దైవంగాను. సకల విఘ్నాలను నశింపజేసి విజయాన్ని ప్రసాదించే విఘ్నేశ్వరుడు గాను, సకల గణాధిపత్యమును పొందిన గణపతి గాను తలచి ప్రజలు ఆయనకు పూజలు చేసుకుంటారు. శాస్త్రీయ సంగీతంలో చాలామంది వాగ్గేయకారులు గణపతిని కీర్తిస్తూ వివిధ రాగాలలో కీర్తనలు రచించారు. 'శ్రీ గణపతిని సేవింపరావే' (సౌరాష్ట్ర రాగం), 'శ్రీ గణనాథం భజామ్యహం' (కనకాంగి) మొదలగు త్యాగరాజు కీర్తనలు, 'శ్రీగణనాథం భజారే' (ఈశ మనోహరి),'శక్తి సహిత గణపతిం (శంకరాభరణం), 'పంచమాతంగ



ముఖగణపతినా పరిపాలితోహం (మలహరి), మహాగణపతే పాలయమాశుమాం' (నటనారాయణి). 'వాతాపిగణపతిం భజేహం' (హంసధ్వని), 'సిద్ధివినాయకం అనిశంచితయామ్యహం' (చామరం) మొదలగు దీక్షితర్ కీర్తనలు, కర్ణాటక సంగీతంలో ఎంతో ప్రాచుర్యాని పొందినది. ఇంకా అనేకమంది వాగ్గేయకారులు ఎన్నెన్నో కీర్తనలు వినాయకునిపై రచించారు. అదే విధంగా లలిత సంగీతంలో కూడా ఎన్నో గణేశస్తుతి గీతాలున్నాయి.

భాద్రపద శుద్ధ చతుర్థినాడు వినాయకునికి గణాధిపత్యం ఒసంగబడింది. కనుక ఆ దినము ప్రజలు భక్తి శ్రద్ధలతో వినాయకునికి పూజ చేస్తారు. గణపతి వ్రతకథతో పాటు శమంతకోపాఖ్యానము కూడా పఠించి పూజాక్షతలు శిరసున దాల్చుకుంటే ఆ దినము పొరపాటున చంద్రుని చూసినా గానీ నీలాపనిందలు పొందరు అని శ్రీకృష్ణుడు మునులకు వరమిచ్చాడు. దీనిననుసరించి మనవారు యధావిధిగా గణనాథుని పూజించుకుంటారు. కుడుములు, అపూపములు, రకరకాల పిండివంటలు, టెంకాయలు, పాలు,తేనె, అరటిపళ్ళు, పానకము స్వామికి నివేదన చేస్తారు.

మహారాష్ట్రలో వినాయక పూజలు, ఉత్సవాలు, గణపతి నవరాత్రులుగా ఎంతో కాలం నుండి ఎంతో వైభవంగా జరుపబడుతున్నాయి. ఇటీవల సుమారు రెండు దశాబ్దాలుగా మన భాగ్యనగరంలో కూడా భారీ ఎత్తున వినాయక విగ్రహాలను అనేక విధాలుగా తయారు చేయించి ఊరంతా ప్రతి సందులో కూడా వినాయకుని విగ్రహాలను ప్రతిష్ఠించి 3 రోజులు, లేక 5 రోజులు లేక 7 గాని , 9గాని,11 రోజులుగాని, అనగా బేసి సంఖ్యదినాలు పూజలు జరుపుకుంటారు. హైదరాబాద్, సికింద్రాబాద్ జంటనగరాలలో శోభాయామానంగా యీ ఉత్సవాలు జరుగుతుంటాయి.



ఆ తరువాత జరిగే వినాయక నిమజ్జనోత్సవం కన్నుల పండువగా ఉంటుంది.

ఈ వినాయక చవితి పర్వదినాన్ని పురస్కరించుకుని డా ॥ పద్మినీదేవి రచించిన 'శ్రీగణేశా చిత్స్వరూపా' అనే యీ స్తుతిగీతాన్ని ఎంపిక చేయడం జరిగింది. కీరవాణి రాగంలో నేను బాణీ కూర్చి బృందగీతంగా గాయనీ గాయకుల చేత యీ గీతాన్ని చాలా సభలలో పాడించాను. ■

## కీరవాణి/మిశ్ర కీరవాణి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. పతిరూపము నీయరయా (రాగమాలిక - ఇందులో పల్లవి మాత్రం కీరవాణి రాగం) | బాలరాజు | ఎస్. వరలక్ష్మి | గాలి పెంచలనరసింహారావు |
| 2. ఏనాటికైనా నీ దాననే | చిరంజీవులు | పి. లీల | ఘంటసాల |
| 3. కీరవాణి..... చిలకలా కలకలా పాడవే | అన్వేషణ | బాలు, జానకి | ఇళయరాజా |
| 4. ముక్కోటి దేవతలు ఒక్కటైనారు (ఇందులో "ఎల్లలోకాలకు తల్లివై నీ వుండ" అనే చరణం మాత్రం కీరవాణి రాగం) | బావామరదళ్ళు | ఘంటసాల | పెండ్యాల |
| 5. వల్లభా ప్రియవల్లభా | శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కథ | యస్.జానకి | పెండ్యాల |
| **హిందీ** | | | |
| 1. యాద్ న జాయే బీతే దినోంకే | దిల్ ఏక్ మందిర్ | రఫీ | శంకర్- జైకిషన్ |

# జంధ్యా మారుతం





⑦

## 'వివాహ భోజనంబు' వింతైన వంటకంబు
## జంధ్యాల వారి విందు.. అహహ్హా భలే పసందు








**జం**ధ్యాల వండి వడ్డించిన నవ్వుల విందు ఇది. జంధ్యాల విందుకి అందరూ ఆహ్వానితులే కాబట్టి అందరూ కనువిందు చేసుకుని మనసు నింపుకున్నారు. జంధ్యాల, మరో ప్రముఖ నిర్మాత జయకృష్ణతో కలిసి జె.జె. మూవీస్ బేనర్‌లో నిర్మించిన చిత్రమిది.

ప్రేమ వ్యవహారంలో దెబ్బతిన్న ఓ యువకుడు పగిలిపోయిన అద్దం లాంటి హృదయంలో విరిగిపోయిన పాల లాంటి ప్రేమ భావాలతో అమ్మాయిల పట్ల కాకరకాయంత చేదు ధోరణి పెంచేసుకుంటాడు. 'అమ్మాయిల్ని కన్నెత్తి చూడను.. పన్నెత్తి పలకరించను' లాంటి సూత్రాలతో పరమఘోరదీక్షలో మునిగి పోతాడు. అలాంటి యువకుడిని మళ్ళీ ప్రేమ పట్టాల మీదకి ఎక్కించి పెళ్ళికూడా చేయించి, 'వివాహభోజనంబు' ఎలా పెట్టిస్తారన్నదే ఈ సినిమా కథ.

ఆ స్త్రీద్వేషే మన కథానాయకుడు రాజేంద్రప్రసాద్. పేరు సీతారామారావు. కథానాయిక లావణ్య(అశ్వని) తనని మోసం చేసిందని భావించి మొత్తం స్త్రీజాతి మీదనే విరక్తిని, ద్వేషాన్ని పెంచుకుంటాడు, చివరకు తన పేరులోని 'సీత'ని కూడా తొలగించుకుంటాడు. భార్యా బాధితుల సంఘం పెట్టి వివాహాలే

## పాత్రలు - పాత్రధారులు

| | |
|---|---|
| సీతారామారావు | : రాజేంద్రప్రసాద్ |
| లావణ్య | : అశ్వని |
| లింగం | : సుత్తివీరభద్రరావు |
| కవి | : బ్రహ్మానందం (అరగుండు) |
| కైలాసం | : శుభలేఖ సుధాకర్ |
| దుర్గమ్మ | : రమాప్రభ |
| వాసూరావు | : చంద్రమోహన్ |
| సుభద్ర | : రాజ్యలక్ష్మి |
| హెడ్‌కానిస్టేబుల్ నిప్పు అప్పల స్వామి | : వేలు |
| జ్యోతి | : రజిత |
| కావేరి | : రత్నాసాగర్ |
| సుబ్బారావు | : సాగర్(విద్యాసాగర్) |
| వసుంధర | : శ్రీశైలజ |
| శ్యామల | : పావలా శ్యామల |
| కృష్ణమూర్తి | : హరి(హరీష్) |
| లక్ష్మి | : హరిత |
| సింహాచలం | : పొట్టిప్రసాద్ |
| హనుమంతుడు | : భీమరాజు |
| జేబుదొంగ | : థమ్ |
| మోళీవాడు | : జిత్‌మోహన్‌మిత్రా |
| పురోహితుడు | : అశోక్‌కుమార్ , జూ.రేలంగి |
| పోలీస్‌ఇన్‌స్పెక్టరు | : యస్ .పి.బాలసుబ్రహ్మణ్యం (స్పెషల్ ఎపియరిన్స్) |
| కానిస్టేబుల్ నెం.111 | : హనుమంతరావు(గుండు) |

మరియు

నాగమణి, పత్తిబాబు, విజయరాం ప్రకాశరావు, ఏ.యస్.ప్రసాద్, రామలింగేశ్వరస్వామి, అప్పలస్వామి, తాతా అప్పారావు, వీర్రాజు, ప్రసాదమూర్తి, అచ్చన్న శాస్త్రి, రఘు, ఎస్.గోపాల్, సుధ, పద్మ, సునీత, సుజాత, సుమిత్ర, మాస్టర్‌విజయ్, మాస్టర్ సంజయ్, మాస్టర్ రావిశాస్త్రి బేబి శ్రీలక్ష్మి, ఇంకా విశాఖ రంగస్థల కళాకారులు.

నశించాలంటూ జనానికి ఉపదేశాలిస్తాడు. ఆడదంటే ఆడించేదని, పెళ్ళి ముహూర్త సమయంలో నెత్తిన చెయ్యి పెట్టి కిందికి దింపుతుందని, సత్యభామ భర్తనే తన్నిందని, స్త్రీలను నమ్మకూడదని, సీతాదేవి సాక్షాత్తు శ్రీరామ చంద్రుని బంగారులేడి కావాలని పంపి ఇక్కట్ల పాలు చేసిందని ఉపన్యాసాలు ఇస్తూ వుంటాడు. తన ఇంట్లో హనుమంతుడు, వివేకానందుడు వంటి వారి ఫొటోలే పెట్టుకుంటాడు.

ఇలా రాజేంద్రప్రసాద్ పాత్ర చాలా సీరియస్‌గా వుంటూనే విపరీతమైన హాస్యాన్ని కలిగిస్తుంది.

ఇందులో ఆయన మరో తమాషా కూడా చేశారు. కథానాయికను ఆకట్టుకోవడం కోసం హీరో ఇందులో ఆడవేషం కూడా వేస్తాడు. 'అమ్మా తల్లీ... ప్రియా... ఆకలీ' పాటలో ఈ లేడీ గెటప్‌ని దర్శించవచ్చు. రాజేంద్రప్రసాద్ లేడీ గెటప్ వేసిన తొలి సినిమా ఇదే. ఈ విషయమై రాజేంద్రప్రసాద్ స్పందిస్తూ- తన కాలేజీ రోజులనాటి ఓ చిలిపి సంఘటనను గుర్తు తెచ్చుకున్నారు. "నేను 'వివాహభోజనంబు' సినిమా కంటే ముందే అమ్మాయిగా ఓసారి నటించాను. గూడూరులో ఇంజనీరింగ్ ఫైనలియర్ చదువుతుండగా స్నేహితులందరం కలిసి ఓ నాటిక వేసాం. అవసరార్థమై అందులో ఆడవేషం వేశాను. నాకు ఫస్ట్ ప్రైజ్ కూడా వచ్చింది. ఆడవేషం వేసింది నేనేనని తెలుసుకున్న మా కాలేజి అమ్మాయిలు గ్రీన్‌రూమ్‌లోకి వచ్చి ఆ నాటికలో నా పేరు 'చిలక' కావడంతో 'చిలకా... ఒక ముద్దు ఇవ్వవూ! జాంపండు ఇస్తాం' అంటూ గోల గోల చేశారు. ఆ తర్వాత కూడా కాలేజీలో చాలా రోజులు నన్ను 'చిలకా' అంటూ పిలిచేవారు. 'వివాహభోజనంబు'లో ఆడ గెటప్ వేసినపుడు ఈ మా కాలేజీ ఎపిసోడ్‌ని చెబితే జంధ్యాలగారు కూడా నవ్వుకున్నారు" అని చెప్పారు ముసిముసిగా నవ్వుతూ రాజేంద్రప్రసాద్.

ఈ సినిమాలో అశ్వనిని కలుసుకోవడం కోసం ట్రాఫిక్ పోలీస్‌గా వచ్చి రాజేంద్రప్రసాద్ పడ్డ కష్టాలు తలచుకుంటేనే నవ్వొస్తుంది. ఇక చూస్తుంటే నవ్వు ఆపుకోవడం కష్టం. ట్రాఫిక్ పోలీస్‌గా నిలబడలేక వంగడం తర్వాత కూర్చోవడం, చివరకు రోడ్డుకు అడ్డంగా పడుకుండిపోవడం లాంటివి మన నవ్వుని రెట్టింపు చేస్తాయి.

ఇక సుత్తివేలు విషయానికొస్తే రాజేంద్రప్రసాద్ చెప్పే ఫ్లాష్‌బ్యాక్ కథని వింటూ, ఆ కథలో వచ్చే అన్ని ప్రమాదాలను తను ఎదుర్కొంటూ, హీరో తిన్న దెబ్బలన్నీ తనూ తింటున్నా, వినడంలో ఏ మాత్రం ఉత్సాహం సడలని పోలీస్ హెడ్ కానిస్టేబుల్ నిప్పు అప్పల స్వామిగా వేలు తనదైన శైలిలో హాస్యాన్ని కురిపించారు. "ఇందులో నా పాత్రకు పెళ్లాం అంటే భయంకరమైన భయం. పెళ్లాం ముందు పిల్లిలా ఉండే ఈ పాత్ర బయట మాత్రం పెద్ద పులిలా కనబడుతుంది. అనలే గుండు, దానికితోడు పెద్ద పెద్ద మీసాలు. మరి











## పాటలు

వివాహాలే నశించాలి
విరాగాలే ఫలించాలి
రాజేంద్రప్రసాద్, శుభలేఖ సుధాకర్,
బ్రహ్మానందం తదితరులు
**రచన: జొన్నవిత్తుల , గానం : బాలు బృందం**

ఝంతనన తనన తకిజం
నెచ్చెలి నడకే మదగజ గమనం
రాజేంద్రప్రసాద్, అశ్వని
**రచన : వెన్నెల కంటి, గానం : బాలు**

అమ్మా..తల్లీ...ప్రియా..ఆకలీ
ముద్దెట్టవే తల్లి దండం
రాజేంద్రప్రసాద్, అశ్వని
**రచన : వేటూరి , గానం : బాలు**

సీతారామస్వామి
నే చేసిన నేరము లేమి
రాజేంద్రప్రసాద్, అశ్వని
**రచన : ముళ్లపూడి శాస్త్రి , గానం : బాలు,జానకి**

ప్రేమ..రెక్క విప్పిందే భామ
రాజేంద్రప్రసాద్,అశ్వని
**రచన : వెన్నెల కంటి, గానం : బాలు,శైలజ**

చూసేవాడికి నేను పులిలాగానే కనిపిస్తాను. డబ్బు సంపాదించడం కోసం కొత్త కొత్త మార్గాలు ఎన్నుకుంటుంటాను. లాకప్‌లో ఉన్నవాళ్లతో పేకాట ఆడతాను, నాకు సరిగా ఆట రాకపోయినా చచ్చినట్టు వాళ్లు గెలిపిస్తారు. లేకపోతే వేరే నేరం మోపుతానని భయం వాళ్లకి. ఇలా చాలా రకాలుగా డబ్బును వెనకేసు కుంటుంటాను. నా కెరీర్‌లో వన్ ఆఫ్‌ది బెస్ట్ కేరెక్టర్ ఇది. ఇప్పటికీ చాలా మంది ఈ పాత్ర గురించి చెప్తుంటారు. సినిమా టైటిల్‌కు తగ్గట్టుగానే షూటింగ్ కూడా పెళ్లిసందడిలా ఉండేది. ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు ద్రోణంరాజు శ్రీనివానరావు గెస్ట్‌హౌస్‌లో ఉండేవాళ్లం. షూటింగ్ కొంత అక్కడ కూడా జరిగింది. మొత్తం మీద 'వివాహభోజనంబు' ఎప్పటికీ మరచిపోలేని తీపిగుర్తు." అని తన అనుభవాన్ని గుర్తు తెచ్చుకున్నారు వేలు.

ఈ నిప్పు అప్పలస్వామి గారి భార్య దుర్గమ్మగా రమాప్రభ నటించారు. గిన్నిస్‌బుక్ రికార్డులన్నీ బద్దలు కొట్టే సంకల్పంతో చీరకట్టుకుని మరి శీర్షాసనం వేయడం దగ్గర్నుంచి రోడ్ల మీద వంటికాలుతో నడవడమో, ఏకధాటిగా 7వేల బిందెల నీళ్ళతో స్నానం చేయడమో, తులసికోట చుట్టూ కందకం ఏర్పడేలా 11వేల సార్లు ప్రదక్షిణలు చేయడమో లాంటి అన్ని రకాల ప్రయోగాలు చేస్తూ మొగుడికి మాత్రం ప్రయివేటు చెప్పడంలో రికార్డ్ స్థాపించిన దుర్గమ్మగా రమాప్రభ సహజంగా జీవించారు.

ఈవిడ గారిని ఎలాగైనా గుప్పిట్లో పెట్టుకోవాలని ప్రయత్నించి, ప్రతిసారి గుండు పై 'రామకీర్తన' పాడించు కుంటుంటాడు వేలు.

అలాగే ఈ సినిమాలో సుత్తివీరభద్రరావు, బ్రహ్మానందంల కాంబినేషన్ నవ్వుల వంట పండిస్తుంది. వీరభద్రరావు కేమో ఆననాల పిచ్చి. కవి అయిన బ్రహ్మానందం వీళ్ళింట్లోనే అద్దెకి వుంటుంటాడు. 'సినిమా తీస్తాను - మంచి కథ చెప్పు - కథ నచ్చితే అద్దె మొత్తం మాఫీ చేస్తాను' అని వీరభద్రరావు చెబితే ఆశతో వందల కథలు చెబుతూనే వుంటాడు బ్రహ్మానందం.

ఇలా 1256 కథలు చెప్పించుకుని ఇంకా చెప్పించుకుంటూ తనే చాంతాడు కథలు చెప్పి, తనతో పాటు బ్రహ్మానందంతో ఆననాలు వేయిస్తుంటాడు వీరభద్రరావు. ఇందులో వీరభద్రరావు ఊతపదం 'తిత్తి-తీస్తా'. బ్రహ్మానందం కి వీరభద్రరావు ఎదురు కథలు చెబుతాడు.

అవి ఎలా ఉంటాయంటే - ఆ కథలో హీరో హోటల్‌కి వెళ్ళి టిఫిన్ తెమ్మంటే సర్వర్ లిస్ట్ ఇలా చెబుతాడని మొదలుపెడతాడు వీరభద్రరావు. 'ఇడ్లీ.. వడ.. పెసరట్టు..' ఇలా లిస్ట్‌ల మీద లిస్ట్‌లు వీరభద్రరావు కళ్ళు ఆర్పుతూ చెబుతుంటే, బ్రహ్మానందం నెత్తినోరూ బాదుకుంటుంటాడు.

ఆ ప్రోసెస్‌లో వీరభద్రరావు విచిత్రమైన మాడ్యులేషన్‌తో 'హైదరా బాఆఆఆ దు', 'సికింద్రా బా ఆఆఆ దు', 'ఆదిలాబా ఆఆఆదు' అనడం ఆ రోజుల్లో బాగా పాపులర్ అయింది. అలాగే బీచ్‌లో బ్రహ్మానందంను పీకల్దాకా కప్పెట్టేసి వీరభద్రరావు కథ చెబుతుంటే, ఇక బ్రహ్మానందం ఎక్స్‌ప్రెషన్స్ చూడాలి. 'ఎలాంటి వాడైనా పొట్ట చెక్కలయ్యేలా నవ్వక మానడు. ఈ డైలాగ్ కాన్సెప్ట్ అంతా జంధ్యాలదే.

ఇక క్లైమాక్స్‌లో బ్రహ్మానందంను చెట్టుకు కట్టేసి వీరభద్రరావు సినిమా కథ చెబుతుంటే -ఇక్కడ బ్రహ్మానందంకు గడ్డాలు పెరిగి పోతాయి. తర్వాత



ముసలి గడ్డం వచ్చేస్తుంది. చివరకు అస్థిపంజరమై మిగులుతాడు. వీరి కాంబినేషన్‌లో నవ్వుల జాతరకి ఇలా ఫినిషింగ్ ఎఫెక్ట్ ఇచ్చారు జంధ్యాల. ఈ దృశ్యాల్లో వీరభద్రరావు యాక్షన్‌కి బ్రహ్మానందం ఇచ్చిన రియాక్షన్స్ చూస్తూంటే బ్రహ్మానందం టాప్ కమెడియన్‌గా ఎందుకు ఎదిగారో అర్థమవుతుంది. అంతకుముందు 'అహనా పెళ్ళంట'లో బ్రహ్మానందం క్యారెక్టర్ 'అరగుండు'గా క్లిక్ అవడంతో ఈ చిత్రం టైటిల్స్‌లో బ్రహ్మానందం పేరుని 'అరగుండు బ్రహ్మానందం'గా వేశారు.

ఈ సినిమా తాలూకూ అనుభవాల గురించి బ్రహ్మానందంను కదిపితే చాలాసేపు మౌనంగా వుండిపోయారు. "అదో గొప్ప సినిమా అండి. ఆ సినిమాకోసం పనిచేసిన ప్రతిక్షణం ఓ విలువైన అనుభవం" అన్నారు ఉద్వేగంగా. తర్వాత తన అనుభవాల గురించి

ఈ చిత్రం టైటిల్స్‌ని చివర్లో జంధ్యాల తమాషాగా ప్రదర్శించారు. అదిలా ఉంటుంది...

జంధ్యాల
రచన-దర్శకత్వంలో
ఆదివిష్ణు
కథకు
శివ-సుబ్రహ్మణ్యం
నృత్యదర్శకులుగా
యస్.పి. బాలసుబ్రహ్మణ్యం
స్వరరచన చేయగా
టి.సుబ్బిరెడ్డి
సమర్పణలో
జంధ్యాల-జయకృష్ణ
నిర్మాతలుగా
జె.జె.మూవీస్ వారు చేస్తున్న వినోదాల
విందు
వివాహ భోజనంబు

ఇలా వివరించారాయన.

"వీరభద్రరావుగారు రకరకాల ఆసనాలు వేస్తూ నా చేత కూడా వేయిస్తుంటారు. నిజ జీవితంలో నాకు ఆసనాలు బొత్తిగా అలవాటు లేదు. రావంటే వేషానికేమైనా అడ్డంకి అవుతుందని 'ఓకే' చెప్పేశాను. ఓసారి శీర్షాసనం, ఇంకోసారి వజ్రాసనం... మరోసారి వళ్లంతా బురద రాసుకుని పద్మాసనం... ఇలా రకరకాల ఆసనాలు చచ్చిచెడి చేయాల్సి వచ్చింది. ఓ రోజు



సముద్రపు ఒడ్డున షూటింగ్, మెడదాకా నన్ను ఇసుకలో కప్పెట్టారు. టైం మధ్యాహ్నం పన్నెండు గంటలు. ఇహ చూడండి నా పరిస్థితి. లోపల ఒళ్లు కాలుతోంది. కదలడానికి వీల్లేదు. పక్కనే వీరభద్రరావు గారు కూర్చుని ఊర్లపేర్లు, ఆ ఊళ్లో వున్న పేటల పేర్లు చదువుతూ నాకు కథ వినిపించే సీన్ అది. అంత పెద్ద సీన్‌ని మహానుభావుడు వీరభద్రరావుగారు సింగిల్ టేక్‌లో ఓకే చేశారు గానీ, లేకుంటే నా పని పెనం మీద పెసరట్టే. నేనంటే వీరభద్రరావు గారికి చాలా అభిమానం. గోతిలో కప్పబడి వున్న నా పక్కన కూర్చుని, 'సారీ బ్రహ్మానందం - చాలా ఇబ్బందిగా వుంది కదూ. అయినా పర్వాలేదు. ఓపికపట్టు. నీకీ సినిమాలో మంచి పేరొస్తుంది' అన్నారు. గోతిలో వున్న నాకు ముక్కు మీద దురద కలిగింది. గోక్కునే పరిస్థితి లేదు. ఆ విషయమే జంధ్యాల గారితో చెబితే నవ్వుకుని వెంటనే ఓ డైలాగ్ సృష్టించేశారు. **"ముక్కు మీద దురద పుట్టినా, కుక్క వచ్చి కాలెత్తినా ఏమీ చేయలేని దరిద్రపు బ్రతుకై పోయింది మహాప్రభో! ఇప్పటికైనా నన్ను కనికరించి వదిలేయండి"** అన్నది ఆ డైలాగ్. అప్పుడు ఎలా చేశానో నాకే అర్థం కాదు. ఇప్పుడు తలుచుకుంటేనే ఒళ్లు జలదరిస్తుంది. ఓ వైపు మిట్ట మధ్యాహ్నం ఎండ, మరోవైపు రిఫ్లెక్టర్స్ వేడి, ఈ రెండింటి మధ్య కదలడానికి వీల్లేని పరిస్థితి. ఊహిస్తేనే భయంకరంగా అనిపిస్తుంది. సినిమా రిలీజైన తరువాత చూస్తుంటే - ప్రేక్షకుల చప్పట్లు ఆ పాత్ర ద్వారా నాకొచ్చిన గుర్తింపు తలుచుకుంటే ప్రసవ వేదన అనుభవించిన తల్లి - పొత్తిళ్ళలో బిడ్డను చూసినపుడే ఆనందం గుర్తుకొచ్చింది. విజయవాడలో నక్సెస్‌మీట్ జరిగినపుడు కీ॥ శే॥ ఉషశ్రీ గారు నన్ను ఆలింగనం చేసుకుని 'చాలా బాగా చేశావురా! జంధ్యాలా... వీణ్ణెక్కడ పట్టావురా. ఫేస్ అష్టవంకర్లు తిప్పుతూ, పొట్ట చెక్కలయ్యేలా నవ్వించాడు' అని అన్న మాటలు ఇప్పటికీ గుర్తు."

వీళ్ల కామెడీకి తోడు రాజేంద్రప్రసాద్ అసిస్టెంటుగా శుభలేఖ సుధాకర్, తమ్ముడుగా హరీష్ నడిపే ప్రేమకథలు కాస్త రొమాన్స్‌ని, టెన్షన్‌ని సృష్టిస్తాయి.

ఇక ఈ సినిమా విషయంలో ప్రత్యేకంగా పేర్కొనాల్సింది ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంను. సంగీత దర్శకుడుగానూ, నటుడుగానూ తన కత్తికి రెండు -వైపులా పదునుందని మరోసారి చాటి చెప్పారిందులో. బాలసుబ్రహ్మణ్యం సంగీతం ఈ చిత్రానికి సాంకేతికంగా ప్రధాన ఆకర్షణగా నిలిచింది. బాణీల్లో కొన్న వైవిధ్యాన్ని కనబరిచారాయన. ముఖ్యంగా 'నెచ్చెలి నడకే మదగజగమనం' ట్యూన్ హృద్యంగా వుంది. నేపథ్య సంగీతాన్ని కూడా కామెడీకి దోహదం చేస్తూ చాలా ఇంటలిజెంట్‌గా వాడారు.

'ముద్దెట్టవే తల్లీ దండం
పొద్దెక్కినకొద్దీ గండం'

పాటలో జంధ్యాల గారి కోరికపై ఆయన హిందీ సంగీత దర్శకుల బాణీలను అనుకరించారు. పల్లవి నుంచి మొదటి చరణం పూర్తయ్యే వరకు ఓ.పి.నయ్యర్ శైలిని, రెండవ

## సాంకేతిక నిపుణులు

బేనర్
జె.జె. మూవీస్
పాటలు
వేటూరి, వెన్నెలకంటి, జొన్నవిత్తుల, ముళ్ళపూడి శాస్త్రి
సంగీతం
యస్.పి. బాలసుబ్రహ్మణ్యం
నేపథ్యగానం
బాలు,జానకి,శైలజ
కళ
రాజు
అసోసియేట్ డైరెక్టర్
బత్తుల రామకృష్ణ
చీఫ్ అసోసియేట్ డైరెక్టర్
బి.యస్.నిష్ఠల
కథ
ఆదివిష్ణు
స్టిల్స్
గిరి-దేవదాసు
నృత్యం
శివ-సుబ్రహ్మణ్యం
డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ
సి. విజయకుమార్
సమర్పణ
టి.సుబ్బిరెడ్డి
నిర్మాతలు
జంధ్యాల-జయకృష్ణ
రచన-దర్శకత్వం
జంధ్యాల

**రిలీజ్**
ఏప్రిల్ 1988

**నిర్మాణప్రాంతాలు**
వైజాగ్, పరిసరాలు

**నిర్మాణవ్యయం**
15 లక్షలు పైన

**వర్కింగ్ డేస్**
50 రోజులు



చరణం 'దయామయుడా- కృపాకరుడా'కి సలిల్ చౌధురి శైలిని తనదైన బాణీలో స్వరపరచి, వినిపించి సంగీత ప్రియుల మన్ననలను అందుకున్నారాయన.

ఇక నటన విషయానికొస్తే సంగీత ప్రియుడైన పోలీస్ ఇన్‌స్పెక్టర్ పాత్రలో కాస్తంత సంగీతాన్ని, హాస్యాన్ని ఒలికిస్తూ రాజేంద్రప్రసాద్‌కి ప్రేమ గురించి హితబోధ చేస్తారు.

రాజేంద్రప్రసాద్‌కి అప్పుడప్పుడూ ప్రత్యక్షమయ్యే హనుమంతునిగా భీమరాజు నటించారు. 'హోటల్ నల' పేరుతో మగవాళ్ళ స్పెషల్ హోటల్‌ని రాజేంద్రప్రసాద్ ప్రారంభిస్తే, హోటల్ అన్నపూర్ణను అశ్వని ప్రారంభిస్తుంది. ఇక్కడ వడ్డించేది, వండేది ఆడవాళ్ళే. ఈ సీన్‌లో చంద్రమోహన్ ఆడవేషంలో కనిపిస్తారు.



ఈ చిత్రం ద్వారా ముగ్గురు కొత్తవాళ్ళని పరిశ్రమకు పరిచయం చేసారు జంధ్యాల. రంగస్థలం మీద పేర్గాంచిన రత్నాసాగర్ (నటుడు విద్యాసాగర్ భార్య) ఇందులో వీరభద్రరావు భార్య కావేరిగా నటించారు. అలాగే నటి రజితకు కూడా ఇదే తొలిచిత్రం. ఈ చిత్రం ద్వారా సి.విజయ్ కుమార్ కెమెరామెన్‌గా పరిచయమయ్యారు.

కథ ముగింపు పొట్టిప్రసాద్ కొట్టే 9వ గంట మీద నిలిపి, అన్ని పాత్రల్ని, ఓ చోట చేర్చి చక్కటి శుభాన్నిచ్చారు జంధ్యాల.

'శ్రీకృష్ణతులాభారం'లోని 'ఓ చెలీ కోపమా' (ఎన్‌టిఆర్, జమున) పాటను, 'సంపూర్ణ రామాయణం'లోని శోభన్‌బాబు, చంద్రకళ నటించిన ఓ సన్నివేశాన్ని, 'గుండమ్మ కథ'లో 'లేచింది...నిద్ర లేచింది మహిళా లోకం' (ఎన్‌టిఆర్.. సావిత్రి) సాంగ్‌నూ సందర్భోచితంగా ఉపయోగించుకున్నారు జంధ్యాల. భార్యాబాధితుల సంఘాధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ తమ సభ్యులకు ఇచ్చే ఉపదేశాల్లో ఈ పాటల క్లిప్పింగ్స్ కనిపిస్తాయి. టైటిల్స్ పడుతున్నప్పుడు 'వివాహభోజనంబు' (మాయాబజార్) పాటను ఉపయోగించారు.

సినిమా చివర్లో 'మాయాబజార్'లోని 'వివాహభోజనంబు' పాటవేసి, యూనిట్ సభ్యులంతా తృప్తిగా పెళ్ళిభోజనం ఆరగిస్తున్నట్టు చూపించడం జంధ్యాల మార్కు ఫినిషింగ్ టచ్.

ఆదివిష్ణు రాసిన 'శివతాండవం' నవల ఆధారంగా ఈ సినిమా రూపొందింది. 'ఆంధ్రభూమి' వీక్లీలో సీరియల్‌గా వచ్చిన 'శివతాండవం'ను చదివిన దర్శకుడు బీరం మస్తాన్‌రావు ఈ లైన్‌తో సినిమా చేస్తే బాగుంటుందనుకున్నారు. ఈలోగా జంధ్యాల ఆ నవలను 'వివాహభోజనంబు' సినిమాగా తీశారు. సినిమాకనుగుణంగా క్లైమాక్స్ మాత్రం కొత్తగా జత చేశారని ఆదివిష్ణు తెలిపారు.

21 డిసెంబర్ 1987న వైజాగ్‌లోని జనప్రియ గెస్ట్‌హౌస్‌లో ఈ చిత్రం ప్రారంభమైంది. ప్రముఖ రాజకీయవేత్త నిర్మాత కీ.శే. మాగంటి రవీంద్రనాథ్ చౌదరి క్లాప్ కొట్టగా, స్థానిక వ్యాపారవేత్త వి.గంగిరెడ్డి కెమెరా స్విచాన్ చేశారు. "మీ ఆశీర్వాదాలు నాకు కావాలి స్వామీ" అంటూ రాజేంద్రప్రసాద్ తన ముందు ప్రత్యక్షమైన హనుమంతుని ముందు మోకరిల్లడాన్ని ముహూర్తపు షాట్‌గా చిత్రీకరించారు. ఈ ఓపెనింగ్ రోజున అయ్యప్ప దీక్షలో వున్నారు జంధ్యాల. జనవరి 8, 1988 వరకూ తొలిషెడ్యూల్ చేసి శబరిమలై వెళ్ళారు. తిరిగి జనవరి 26 నుంచి సినిమా పూర్తయ్యేంతవరకూ షూటింగు జరిగింది.

ఈ సినిమా గురించి జంధ్యాల మాట్లాడుతూ -"సెంటిమెంట్ డ్రామా వున్న ట్రీట్‌మెంట్ సబ్జెక్ట్ ఇది. హీరో ప్రేమలో విఫలమై స్త్రీ ద్వేషిగా మారి భార్యాబాధితుల సంఘాన్ని

హే హేయ్... ఆహా... ఓహో... లాలల...
అమ్మా... తల్లే... ప్రియా.... ఆకలి...
ముద్దెట్టవే తల్లీ దండం పొద్దెక్కినకొద్దీ గండం
నీ ముద్దే ప్రేమకు పిండం ప్రియ మాదాకోళం ॥ముద్దెట్టవే॥
నే బిచ్చగాణ్ణి అయినానే నీ దర్శనం కోసం
నీ పిచ్చివాణ్ణి అయినానే నీ ప్రేమ నా ప్రాణం
ఇటు చూడవే ఓ సారి
మనసీవే మన్నించి ఓ భామిని ॥ముద్దెట్టవే॥
అమ్మా... తల్లే... ప్రియా.... ఆకలి...॥2॥
దయామయుడా కృపాకరుడా అనాథుల కావ రావేలా
ప్రియా అనుచు ఇలావగచే విరాగిని బ్రోవరావేలా
వరిస్తున్నా స్మరిస్తున్నా చెలీ ఒడి చేరుకోవేలా
తపిస్తున్నా జపిస్తున్నా ప్రియా దరి చేరరావేలా
ఇదా చలి కాలమాయె ఇలా చెలి దూరమాయె
కథే నడివీధికెక్కి పేవ్‌మెంట్ ప్రేమగా మారే ॥ఇదా॥
చెలీ నా దీనగాథ కష్ట నిష్ఠుర గుడ్డిబాధాయె
వరిస్తున్నా స్మరిస్తున్నా చెలీ ఒడి చేరుకోలేనా
తపిస్తున్నా జపిస్తున్నా ప్రియా దరి చేరరావేలా
ఊళ్ళో సందడి ఒళ్లే పచ్చడి ॥2॥
మోళీ నే కడితే మగువకు తాళే నే కడితే
వలపుల కేళీ మొదలెడితే ॥ఊళ్ళో॥
తొంగిచూడు చందమామ...
తొంగిచూడు చందమామ వలపుల పిస్తా
కసిగల ఆటే చూపిస్తా పస గల పాటై వినిపిస్తా॥ఊళ్ళో॥
మోళీ గురువును నేను ఎవడవు రా కొడకా
నా పేట కొచ్చిన భడవా
మోళీ గురువుల గురువుని నేనేరా బచ్చా
ఈ ఊరే నాదిరా లుచ్చా
అగ్గి రింగు చూడు - నీకు దమ్ములుంటే దూకు
దమ్ములేక కాదు సొమ్ముచూపు ముందు
దూకు దూకు దూకు అరె దూకుడొద్దు ఆగు
చూసెద... దూకెద... దూకర... దూకెద...
దూకరా.... ఆగరా... దూకుబె... చూడుబె...
అమ్మా... అబ్బా... అయ్యా... హూ....

## కథాంశం

తల్లితండ్రులు చిన్నతనంలోనే చనిపోవడంతో అక్కా, బావ ఇంట్లోనే పెరుగుతారు సీతారామారావు, కృష్ణమూర్తి. అమాయకుడైన సీతారామారావుని పనిపిల్ల అతని తండ్రి మోసం చేయబోతే లావణ్య వచ్చి కాపాడుతుంది. లావణ్యని సీతారామారావు మనసారా ప్రేమిస్తాడు. తన మనసు విప్పి చెప్పాలని చాలా రకాలుగా ప్రయత్నిస్తాడు. కాలేజీ ఫంక్షన్‌లో 'వరూధినీ ప్రవరాఖ్యులు' నాటకంలో సీతారామరావు ఉద్రేకపడటంతో లావణ్య అభాసుపాలౌతుంది. దాంతో పెద్దలు లావణ్యను కాలేజి మానిపిస్తారు. ప్రేమించాననీ ఉత్తరం రాసి మోసగిస్తుంది లావణ్య. దాంతో మనసు విరిగిన సీతారామారావుకి ఆడదంటే ఆదిశక్తికాదు, ఆటంబాంబు అని అర్థమవుతుంది. ఇంగ్లాండ్‌లో కొన్నాళ్ళుండి తిరిగి వచ్చాక భార్యా బాధితుల సంఘాన్ని, స్త్రీద్వేష సమాజాన్ని స్థాపిస్తాడు. సీతారామారావు అక్క, బావల సపోర్టుతో లావణ్య స్త్రీద్వేష సమాజానికి ఎదురుగా పురుషద్వేష సమాజాన్ని స్థాపిస్తుంది. సీతారామారావు తమ్ముడు కృష్ణమూర్తి, లావణ్య చెల్లెలు వసుంధరలు ప్రేమించుకుంటారు. వీళ్ళిద్దరూ పారిపోయి ఆత్మహత్య చేసుకోవాలనుకుంటారు. ఇక్కడ సీతారామారావు కూడా ఆత్మహత్య చేసుకోవాలనుకుంటాడు. చివరికి కథ సుఖాంతమవుతుంది. సీతారామారావు, లావణ్య ఒక్కటవుతారు. అలాగే కృష్ణమూర్తి-వసుంధర, కైలాసం-జ్యోతి పెళ్ళి చేసుకుంటారు.

వివాహాలే నశించాలి.... విరాగాలే ఫలించాలి...
వివాహం నాటకమన్నా...
కాపురం బూటకమన్నా...
సమస్తం నాశనమన్నా... పెళ్ళిరోజుతో...
ఇల్లేమో ఇరకటమంట....
పెళ్ళామే మరకటమంట...
బ్రతుకంతా చింతా.... చిల్లిముంతా...
ఒక్క మూడుముళ్ళతో... ॥వివాహాలే॥
కైక మాట విని కాకరేగి పరలోకమేగె ఒకడు
అంబ దెబ్బతిని పంబరేగి ఉదకంబు తాగెనొకడు
ఇంద్రదేవుడికి ఇంతివల్ల ఒళ్లంత చెడినదపుడు
తార వల్ల మన పూర్ణచంద్రుడికి తాటలెచెనపుడు
చిత్రాంగి బలిపెట్టె సారంగుని...
అప్సరస చెరిపింది రాజర్షిని...
కావ్యాలు గ్రంథాలు తిరగేసినా
ఇతిహాస డ్రామాలు వడపోసినా
గయ్యాళి పెళ్ళాలు ఒళ్ళోని దెయ్యాలు
మగవాళ్ల ప్రాణాల్ని తీసేటి భూతాలు
అమ్మమ్మో ఆడోళ్ళు రండోళ్ళు ఆనోళ్ళు
కలిసిన సుఖమిక సున్నా
నరకమునను పడకన్నా
చిన్నా కన్నా వద్దురా ॥వివాహాలే॥
ఆడదానిపై ప్రేమ అన్నది మాయరోగమనుకో
పాముకన్నా అణుబాంబు కన్నా
అది పెద్ద డేంజరనుకో
ముద్దులాటలు కౌగిలింతలు ఒట్టిభ్రాంతి బ్రదరూ
ముద్దు గుమ్మ తన ప్రేమ నటనతో
పిచ్చి చేయు మెదడు
వంటింటి తాబేళ్లు అవ్వద్దురా
కన్నీళ్ల కల్లాపి జల్లద్దురా
సన్యాసమె బెస్టు మనజాతికి
స్త్రీ సౌఖ్యమే రొష్టు మగజాతికి
జై వీర హనుమాను అనుకోండి రారండి
సద్బ్రహ్మచారులుగా చరితార్థులవ్వండి
పెళ్లిళ్లు మానండి పెళ్లాలు వద్దండి
అతివను వలచుటకన్న మతిచెడి తిరుగుట మిన్న
అయ్యా బాబూ వద్దురా
వివాహం నాటకమన్నా... కాపురం బూటకమన్నో...
సమస్తం నాశనమన్నా... పెళ్ళిరోజుతో...
ఇల్లేమో ఇరకటమంట.... పెళ్ళామే మరకటమంట...
బ్రతుకంతా చింతా.... చిల్లిముంతా...
ఒక్క మూడుముళ్ళతో... ॥వివాహాలే॥

కూడా ఏర్పాటు చేస్తాడు. చివరికి ప్రతి మగవాడికి ఒక తోడు అవసరమని తెలుసుకుంటాడు" అని సెలవిచ్చారు.

ఇదండీ 'వివాహభోజనంబు' గురించి వినసొంపైన కథ. ఈ సినిమాని వెండితెరపై కళ్లారా ఆరగించిన ప్రతి ప్రేక్షకుడూ మనసు నిండిన ఆనందంతో తృప్తిగా 'బ్రేవ్' మని తేన్చి (సారీ... 'వావ్' అని పొగిడి) జంధ్యాలను 'అన్నదాతా సుఖీభవా' లాగా 'వినోద ప్రదాతా సుఖీభవా' అని ఆశీర్వదించుకుంటూ వెళ్లిపోయారు. అందుకే 'వివాహభోజనంబు' కు సినీ హాస్య చరిత్రలో ఓ ప్రత్యేక అధ్యాయం కేటాయించబడింది.

-పులగం చిన్నారాయణ

## 'వివాహ భోజనంబు'లో ప్రజాదరణ పొందిన కొన్ని డైలాగ్స్

☆ బావగారూ.. మీ పెళ్లయిన 15 ఏళ్లకు మా అక్కయ్యను చూసి వెళ్దామని పొరపాటున భోపాల్ నుండి ఇక్కడకు వచ్చాను. మీ ఇంటిలో భోజనం చేయాలంటే ఇలా ఆసనం వేయాలని నిజంగా నాకు తెలియదు బావగారూ.. ఆ భోపాల్ గ్యాస్ ప్రమాదంలో పోయినా బాగుండేది. ఈ బాధ తప్పేది.

☆ అక్కయ్యా... నా ఒంట్లో ఉన్న అవయవాలన్నిటినీ చాకలి మూట కట్టినట్టు కట్టేస్తున్నాడే బావ. ఈ ఆసనాలు వేయటం నా వల్ల కాదు.

☆ మనసు నీతిలేని కోతిలాంటిదైతే.. వయసు కళ్లెంలేని గుఱ్ఱం లాంటిది

☆ నా జేబే కత్తిరిస్తావా... గుండుసూది చెత్తెధవా
బస్సులో నిగనిగలాడే తమ గుండు చూసి ఎవరో తిరుపతి భక్తులని భ్రమపడ్డాను బాబూ.. ఇంకోసారి క్షవరం చేద్దామని కత్తిరేసాను

☆ కులాసాగా ఉన్నావా సీతారాముడు
ఆగు.. నా పేరులోంచి ఆడపేరు తీసేశాను. ఒట్టి రాముడు అని పిలువ్ చాలు
కులాసాగా ఉన్నావా ఒట్టి రాముడు
ఇదిగో ఒట్టి రాముడు తొట్టి రాముడు కాదు.. రాముడు అను చాలు

☆ ఇంకా ఎంతసేపు మహాప్రభో ఈ మట్టి పట్టీ
ఈ చెమ్మ ఇగిరే లోపు మన కళ్లు చెమ్మగిల్లుతాయేమో మహాప్రభో
ఇట్లా మనల్ని ఎవరు చూసినా ప్రమాదమే. జూ వాళ్లు చూస్తే వాళ్ల కోతులు తప్పించుకొచ్చాయని పట్టుకెళ్లిపోతారు. జనం ఎవరైనా చూస్తే ఇతర గ్రహాల నుండి ఎవరో వచ్చారని రాళ్లిచ్చుక్కొడ్తారు. ఇంకా ఎంచక్కా కడిగేసుకుందామా మహాప్రభో

☆ ఇది కథా?
పోని స్టోరీ అనుకోండి మహాప్రభో

☆ ఈ కథ నేను సినిమాగా తీస్తే నేను అడుక్కుతినాలి. ఓ ఊరు ఊరంతా పస్తుండి నాకు ముష్టివేయాలి.

☆ మధ్యతరగతి వెధవనాయాలా
మహాప్రభో తమరు నన్ను తిట్టారా?
లేదు సినిమా పేరు చెప్పాను
ఆ పేరు తిట్టులా ఉంది ప్రభో
పేరులో తిట్టుంటేనే సినిమా హిట్టవుతుందయ్యా

☆ తెర లేవంగానే హీరో ఓ కాఫీ హోటల్‌కెళ్తాడు. సర్వర్ రాగానే హీరో ఏమున్నాయ్ అని అడిగాడు
అప్పుడు సర్వర్ ఇడ్లీ, రవ్వ ఇడ్లీ, గారె, మసాలాగారె, ఉప్మా, కిచిడీ,
పెసరట్టు, మినపట్టు, రవ్వట్టు, మసాలా అట్టు, బాతు, టమాటో బాతు,
బొండా, బజ్జీ, మైసూర్ బజ్జీ, మిరపకాయ బజ్జీ, అరటికాయ బజ్జీ, తమలపాకు బజ్జీ,
లడ్డు, బందరు లడ్డు, రవ్వ లడ్డు,
మిఠాయి, పీచు మిఠాయి, బందరు మిఠాయి, బొంబాయి మిఠాయి, కలకత్తా మిఠాయి, జాంగ్రీ, పాలకోవా, హల్వా, మైసూరుపాకు, అమలాపురం కాజా, భీమవరం బాజా, పెద్దాపురం కూజా ఉన్నాయంటాడు.
అప్పుడు హీరో అట్టు తెమ్మంటాడు
అప్పుడు సర్వర్ ఏ అట్టు... పెసరట్టా, మినపట్టా, రవ్వట్టా, మసాలా అట్టా, 70 ఎం.ఎం. అట్టా, ఎం.ఎల్.ఏ. అట్టా, నూనేసి కాల్చాలా, నెయ్యేసి కాల్చాలా, నీళ్లోసి కాల్చాలా, పెట్రోలు పోసి కాల్చాలా, కిరసనాయిలు పోసి కాల్చాలా, డీజిలేసి కాల్చాలా, అసలు కాల్చాలా, వద్దా అని అడిగాడు.
అప్పుడు హీరో పెసరట్టు, నెయ్యేసి కాల్చమన్నాడు, కాఫీ కూడా తెమ్మన్నాడు
అప్పుడు సర్వరు... ఏ కాఫీ..మామూలు కాఫీయా, స్పెషలు కాఫీయా, బుర్రా కాఫీయా, నెస్సుకాఫీయా, బ్లాక్ కాఫీయా, వైటు కాఫీయా, హాటు కాఫీయా, కోల్డ్ కాఫీయా, నురగ కావాలా, వద్దా, కావాలంటే ఎన్ని చెంచాలు కావాలి అని అడిగాడు.
అప్పుడు హీరో మామూలు కాఫీ తెమ్మన్నాడు
అప్పుడు సర్వరు నీలగిరి కాఫీయా, హిమగిరి కాఫీయా, సిమలా కాఫీయా.....
ఆపండి మహాప్రభో..ఆపండి. తమలో ఇంత ఊహా శక్తి ఉందని ఊహించలేకపోయాను. ఈ కథే సినిమా తీసుకోండి. పదివేల రోజులాడుతుంది.

☆ హైదరాబాదు, ఆదిలాబాదు, సికిందరాబాదు, అహ్మదాబాదు, ఫకీరాబాదు, అలహాబాదు, ఫరీదాబాదు, ఔరంగాబాదు, దన్‌బాదు, సింధ్‌బాదు, ముస్తాబాదు, ఫైసలాబాదు, ఘజియాబాదు, అబ్దుల్లాబాదు, చపాలాబాదు, హుస్సేనుబాదు....
నా బొంద బాదు.. నా శ్రార్థం బాదు.. నా పిండాకూడు బాదు...




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

## రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



## తెలుగు పక్షులు !

అనగా అనగా అన్నట్టు- ఏళ్ల క్రితం (1941) జెమినివారు ''మదనకామరాజన్'' అని తమిళంలో ఓ జానపద సినిమా తీశారు. అప్పటికి డబ్బింగ్‌లు రాలేదు, తెలీదు గనక తమిళ చిత్రాలు ఆంధ్ర దేశంలో అలాగే విడుదలయేవి - తెలుగు తెలుగులా ఇతర రాష్ట్రాల్లో విడుదలయినట్టు. థియేటర్ల (అప్పటికి ఈమాట రాలేదు, హాళ్లు-) లో కాస్త కూస్త తమిళం తెలిసిన వాళ్లు- తెలుగులో కథ చెబుతూ వుండేవారు.

సినిమా నడుస్తూ వుంటే 'మదనకామరాజు' లో ఒక రాజు, మంత్రీ వుంటారు. (ఈ కథే దరిమిలా 'మదనకామరాజు కథ' పేరుతో తెలుగులో వచ్చింది. కాంతారావు, హరనాథ్ ఇత్యాది) రాజు గండంలో ఇరుక్కుంటాడు. మారువేషాల్లో వాళ్ళిద్దరూ ఓ చెట్టు కింద పడుకుంటారు. ఆ చెట్టుమీద రెండు పక్షులు, మాట్లాడుకుంటాయి. మంత్రికి పక్షి భాష తెలుసుట - అతను అర్థం చేసుకుంటాడు. ఆ పక్షులు, రాజుకి గండం వుందని చెప్పుకోవడం మంత్రి వింటాడు. అయితే ఇందులో హ్యూమరేముంది? ఉంది. అది తమిళ చిత్రం గనక, తమిళ ప్రేక్షకులకి తెలుగు తెలీదు గనక, పక్షి భాషని తెలుగు భాషలో పెట్టారు. అంటే, ఆ రెండు పిట్టలూ తెలుగులో మాట్లాడు కుంటాయి! అదే సినిమాని, తెలుగుదేశంలో విడుదల చేసినపుడు, సినిమా ఏమీ అర్థం కాని తెలుగు ప్రేక్షకులకి - పక్షి భాష మాత్రమే అర్థమైంది. హాల్లోని అనువాదకుడు - అది కూడా వ్యాఖ్యానించే వాడనుకోండి! కాని ప్రేక్షకులు "పక్షి భాష అంటే తెలుగా!" అని కొందరు, "ఆ రహస్యం మనకి అర్థమైపోయిందే!" అని కొందరు- "పక్షులు తెలుగు మాట్లాడ్డం ఏమిటి?" అని కొందరు -వ్యాఖ్యానాలు చేసుకున్నారు. ఆ సినిమా చూసిన చిన్నపిల్లలు, చెట్లమీద వున్న పక్షుల్ని చూసి, "మన వూళ్లో వున్న ఏ పిట్టా తెలుగు మాట్లాడదే'' అనుకునేవారు అమాయకంగా.

❖ ❖ ❖

## తమిళంలో తెలుగు !

జెమినివారికి పరభాష అంటే తెలుగే కాబోలు. అటు తర్వాత తీసిన మరొక జానపదం "మంగమ్మ (1943) లో (వైజయంతీమాల తల్లి వసుంధర, రంజన్) కూడా, తక్కిన తమిళ పాత్రలకి అర్థం కాకుండా వుండాలని ఒక ఘట్టంలో,


జెమినీవారి 'చంద్రలేఖ'లో ఓ దృశ్యం

రంజన్ తెలుగులో మాట్లాడతాడు. అతని భాష అర్థం కాని, ఒక పాత్ర తమిళంలో "నువ్వేమంటున్నావో నాకు అర్థం కాలేదు" అన్నట్టుగా అంటే ప్రేక్షకులు నవ్వేవారు. ఒకరోజు ఒక ప్రేక్షకుడు "మాకు అర్థమయిందిలే బాబూ!" అని గట్టిగా అరిచాడు !

జెమినీవారు - ఆ తర్వాత 1948లో ఓ భారీ సినిమా 'చంద్రలేఖ' తీశారు. ఇందులో ఇంక తెలుగు -హిందీ అన్న గొడవ లేకుండా ఎక్కడా లేని ఎవరికీ అర్థం కాని భాషతో జిప్సీ పాత్రలు ప్రవేశపెట్టి -ఆ భాషలోనే పాటలు కూడా పాడించారు!

❖ ❖ ❖

## నటించని నటుడు !

గూఢాచారి -116, ప్రమీలార్జునీయం, బందిపోటు భీమన్న, ముహూర్త బలం, అందరికీ మొనగాడు మొదలైన సినిమాలు డైరెక్టు చేసిన ఎమ్. మల్లికార్జునరావు 'గొల్లభామ' సినిమాలో రాకుమారుడి వేషం కట్టారు. తర్వాత కొంత కాలం సహాయ దర్శకుడు. అదెలా జరిగిందంటే -విజయ సంస్థ నిర్మాణం ఆరంభిస్తూ నెలజీతాల మీద నటుల్ని తీసుకున్నారు. ఎన్.టి.ఆర్, రంగారావు, పద్మనాభం, మాధవపెద్దిసత్యం, బాలకృష్ణ, చదలవాడ, వల్లం నరసింహారావు, మహంకాళి వెంకయ్య - వీళ్లంతా జీతాలు తీసుకుంటున్న కంపెనీ నటులు. వీళ్లతోపాటు, ఈ మల్లికార్జునరావుని కూడా తీసుకున్నారు. ప్రతిరోజూ ఆయన స్టూడియోకి వెళ్లడం, టిఫిన్ భోంచెయ్యడం, కాస్సేపు అలా అలా తిరిగి ఆ మాటా ఈ మాటా కబుర్లాడి ఇంటికి పోవడం, ఒకటో తేదీ రాగానే జీతం తీసుకోవడం- అదీ ఆయన ఉద్యోగం. పైన చెప్పిన వాళ్లందరూ చిన్నా చితకా, పెద్దా మెతకా వేషాలు వేశారుగాని, మల్లికార్జునరావు ఎక్కడా వెయ్యలేదు. వెయ్యలేదేమిటి- వాళ్లే వెయ్యమనలేదు. అలా ఓ సంవత్సరం గడిచింది. మరీ పనిపాటాలేక (పాట ఎలాగూ రాదు!) అలా తినడం తిరగడం బాగుండందమోనని ఒక రోజు చక్రపాణిగారి


ఎమ్. మల్లికార్జునరావు

దగ్గర కెళ్లి నిలబడ్డాడు. ఆయన ఎగాదిగా చూసి, "ఎవరు నువ్వు?" అని అడిగారు. తన వివరాలు చెప్పి, "సంవత్సరంగా జీతం తీసుకుంటూ, చిన్న వేషంలో కూడా కనిపించని నటుణ్ని" అని తన అనుభవం చెప్పాడు. మొదట్లో అతన్ని "బుక్" చేసిన చక్రపాణి గారికే అతను గుర్తులేడు! "సంవత్సరంగా ఇక్కడ జీతాలు తీసుకుంటూ టిఫిన్లు తింటూ తిరుగుతున్నావా?..." అని, ఎంత దారుణం' అన్నట్టు చూసి, "వేషం మాటకేంగాని, దర్శకత్వంలో చేరు" అని చక్రపాణి గారు ఎల్.వి. ప్రసాద్ గారి దగ్గర జేర్పించారు. 'పెళ్లిచేసి చూడు' సినిమా నుండి కొంత కాలల పాటు దర్శకత్వ శాఖలో పనిచేసి అనుభవం గడించి, దర్శకుడైన మల్లికార్జునరావు ఆ మాటే అంటారు.

''నేను అప్పటికీ చక్రపాణిగారిని చూడకుండా వుంటే అలాగే వుండేవాణ్ణేమో. ఆయనకి నేను గుర్తు లేకపోవడం పెద్దజోక్. దర్శకత్వ శాఖలో ఆయన చేరమనడంతో చేరి అనుభవం సంపాదించి దర్శకుడిని కావడం ఇంకా పెద్ద జోక్'' అని చెప్పేవారు మల్లికార్జునరావు.

❖ ❖ ❖

## నిద్ర షూటింగెరగదు!

ప్రతిభావారు "స్వప్నసుందరి" (అక్కినేని, అంజలీదేవీ) తీశారు. ఘంటసాల బలరామయ్య దర్శక నిర్మాత. తర్వాత తర్వాత సహనిర్మాత, నిర్మాతా అయిన - టి.వి.ఎస్. శాస్త్రి అపుడు ప్రొడక్షన్ మేనేజరు. చాలా కాలం ఆ కంపెనీలో పనిచెయ్యడం వల్ల - ఆయన "ప్రతిభా శాస్త్రి' గా ప్రసిద్ధుడు. 'స్వప్నసుందరి' షూటింగ్ రేయింబవళ్లు జరిగేది. ప్రతిదానికీ ప్రొడక్షన్ మేనేజరుని పిలుస్తారు. పిలిచి అదీ ఇదీ అడుగుతారు. దాంతో ఓపికలేక, రాత్రివేళ షూటింగ్ (వాహినిలో, ఫ్లోర్‌లో) జరుగుతూ వుంటే ఎవరికీ తెలియకుండా వుండాలని సెట్లో ఓమూల వున్న 'గోడ' (స్టూల్ లాంటిదే, పెద్దది- లైట్లు పైకి ఎక్కించడానికి ఉపయోగపడుతుంది) ఎక్కి, దానిమీద పడుకుని నిద్రపోయారు శాస్త్రి. నిదానంగా లేవవచ్చుగదా అనుకుంటే కుంభకర్ణుడు ఆవేశించినట్టున్నాడు -ఆయన అదేనిద్ర! తెల్లవారు జామున షూటింగ్ 'పేకప్' అయిపోయి, అందరూ వెళ్లిపోయారు. ఫ్లోర్‌కి కూడా తాళం పెట్టేశారు! నిద్ర ఇంకా చాలలేదన్నట్టు బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ లేచిన శాస్త్రి గారికి అంతా చీకటి, నిశ్శబ్దం..! కంగారు పడిపోతూ, గోడ దిగి గోడు పెట్టారు. లాభం ఏముంది? రాజుగారి కోటకి తలుపులు మూసి, తాళాలు బిగించినట్టే -ఫ్లోర్‌కి తాళం వెయ్యడం! .. వాళ్లంతటవాళ్లు ఎవరైనా వచ్చి తియ్యవలసిందే గాని, లోపల్నుంచి ఎంత



స్వప్నసుందరి చిత్రంలో అంజలీదేవి, అక్కినేని

మొత్తుకున్నా అరిచి గీపెట్టినా, గజేంద్రుడిని రక్షించడానికి వచ్చిన విష్ణుమూర్తి రావలసిందేగాని, నరుడు రాలేడు! మొత్తానికి యూనిట్ వాళ్లకే గుర్తొచ్చి 'ఎందుకేనా మంచిది ఫ్లోర్ లో చూద్దాం ' అనుకుని, తాళం తీయించి చూసేసరికి, అపరాహ్ణం దాటిపోయింది! తిండి తిప్పా లేక చీకటి బోనులో చిక్కుకున్న పులిలా కనిపించిన శాస్త్రిగారిని చూసి కొందరు పారిపోయారు, కొందరు ఆశ్చర్యపోయారు, కొందరు 'అయ్యయ్యో' అని జాలిపడి పోయారు, ఆయన విరుచుకు పడేలోపల శాస్త్రిగారు ఈ సంఘటన చెప్పి అందర్నీ నవ్విస్తూ వుంటారు, తన నిర్వాకానికి తానూ నవ్వుతూ.

❖ ❖ ❖

## పుల్లయ్యగారి విగ్గు !

పి. పుల్లయ్య గారు 1972లో రష్యా విజయం చేశారు. చేశాను గదా అని, సినిమా స్టూడియోలు తిరిగారు. అక్కడ అద్భుతమైన విగ్గులు, ఫేస్ మోల్డులూ చూసి అబ్బుర పడిపోయారు.



పి. పుల్లయ్య

ముఖానికి తగిలించే మోల్డ్‌లు చాలా సహజంగా వున్నాయట. "మీరు డ్యుయల్ రోల్ సినిమా చెయ్యాలనుకుంటే, మీ హీరో ముఖం రెండోవాడికి తగిలించి, ట్రిక్స్ బాధలేకుండా డైరెక్టుగా తీసుకోవచ్చు " అని వాళ్లు చెప్పారుట. సునిల్‌దత్ అలాంటి సినిమా ప్లాన్ చేస్తున్నాడని అతని ముఖంలాంటి మోల్డ్‌లు చూపించారుట. "నేనూ అలాంటి సినిమా తియ్యొచ్చునే - అనుకున్నారు గాని, మన వూరు వెళ్లాక ఈ ముఖం మోల్డ్ చిరిగినా, విరిగినా నా వల్ల కాదురో అని, నాడా దొరికిందని గుర్రం కొనడం ఎందుకని, వూరుకున్నాను" అని చెప్పారు పుల్లయ్యగారు అప్పుడు. ఆయనది పూర్తి "క్లాత్ హెడ్" అంటే బట్టతల. ఒక్క వెంట్రుక వుండేది కాదు తలమీద. అక్కడున్న విగ్గు మేకర్లు పుల్లయ్యగారి తల చూసి, "మీ కెందుకూ ? అద్భుతమైన విగ్గు- మీ ముఖానికి తగిన క్రాపు విగ్గు వేసి ఇస్తాం. అలా తగిలించుకుంటే చాలు. అతి సహజంగా వుంటుంది. విగ్గు పెట్టినట్టు అస్సలు తెలీదు" అని ఆశపెట్టారుట.ఆయన ఆర్డరిచ్చినట్టే ఇచ్చి వెనక్కి తీసుకున్నారుట. "ఓర్నాయినో -ఇన్నాళ్లు ఈ బాల్డ్ హెడ్డుతో తిరిగి, ఇప్పుడు బాలుడి హెడ్డుతో కనిపిస్తే - ఉన్న వెంట్రుకలు లాగేస్తారు. నా కెందుకీ విగ్గు సిగ్గులేక? అని నోరు మూసుకుని ఆ స్టూడియోల ప్రతిభకి ఓ నమస్కారం పెట్టి తిరగు ముఖం పట్టాను" అని చెప్పారు పుల్లయ్యగారు.

❖ ❖ ❖

## "ఫస్ట్ గెటవుట్"!

ఈ పుల్లయ్య గారు "ప్రేమించిచూడు" తీశారు. (అందులో నేను వేసిన వేషం గురించి,' 'సైలెన్స్' అని-ఇప్పటికీ చెబుతూ వుంటారూ -శ్రేయోభిలాషులు) అందులో నాగేశ్వరరావుగారు హీరో, నేను ఆ హీరోకి తండ్రిని. ముళ్లపూడి రమణగారు స్క్రిప్టు రాశారు. రాస్తూ, హీరో తండ్రి బడిపంతులు గనక, దాన్ని అలా రూపొందించి చెప్తే - పుల్లయ్య గారు సంతోషించారుట. "ఈ వేషం రావికొండలరావు చేత వేయిస్తే- బాగా పండిస్తారు" అని రమణగారు చెప్పి ఆ మాట నాతో చెప్పి "మీరొకసారి పుల్లయ్యగారిని చూడండి" అంటే, నేను - ఇక్కడ మాయమై అక్కడ ప్రత్యక్షమైనంత స్పీడుగా వెళ్లాను. అప్పుడు నాకు 32,33 ఏళ్లు. కుర్రాడిని. ఒత్తుగా జుట్టు, నల్లగా వుండేది. నాకు పుల్లయ్యగారు తెలుసుగాని, ఆయనకి నేను తెలియదు. "ఎవరయ్యా?" అంటూ వచ్చారాయన. "నేను ఫలానా. ఫలానా రమణగారు పంపిస్తే వచ్చాను. ఫలానా హీరో గారికి... ఫలానా తండ్రి వేషానికి.." అన్నానేను. తత్తరపాటుతో తత్తత్తడబడుతూ. ఆయన ముఖంలో రంగు మారింది. తెల్లటి



'ప్రేమించిచూడు' చిత్రంలో రావికొండలరావు

ముఖారవిందం అరవిందం రంగులోకి దిగింది. నన్ను ఎగాదిగా చూశారు. నా పాంటు, నా షర్టు, నా క్రాపు చూసి- రెండో మాట లేదు, "ఫస్ట్ గెటవుట్" అన్నారు. నా నల్లజుట్టు తల గిర్రున తిరిగింది- మూర్ఛవచ్చిన వాడిలా కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ వుండగా" నీకు బుద్ధిలేదా? ఆ రమణకి బుద్ధిలేదా? నాకు బుద్ధి లేదా? నువ్వు నాగేశ్వర్రావుకి తండ్రివా ?.... ఐయామ్ నాట్ ఎ ఫూల్ - ప్లీజ్ గో !..." అన్నారు మళ్లీ. నేనేదో అనబోయానుగాని , లోపలుంటుందిట- అంతరాత్మ కాబోలు అది నా నోరు నొక్కేసింది!.. ఓ నమస్కారం పెట్టి దిగులు, బాధ, నిరాశల్లాంటి వన్నింటినీ తోడు చేసుకుని -ఈసారి మాయమైనట్టు కాకుండా - తాబేలు స్పీడులో రమణగారి దగ్గర కెళ్లి జరిగింది వివరించాను . ఆయన నవ్వేసి "ఆపాత్ర చేసి చూపించండి" అన్నారు. మళ్లీ వెళ్లడం ఎలా? ..ఈ లోపల పుల్లయ్య గారికి సన్నిహితులైన కొడవటిగంటి కుటుంబరావుగారు, ప్రతిభా శాస్త్రిగారా " అలా వుంటాడుగాని, పెద్దవాడిలాగానే చేస్తాడు" అని కొంత బోధ పరిస్తే ఎందుకైనా మంచిదని ఈ సారి రమణగారి చెయ్యిపట్టుకుని, తప్పుచేసిన విద్యార్థి తండ్రి చెయ్యి పట్టుకుని మాస్టారి దగ్గరికి వెళ్ళినట్టు వెళ్లాను. తెలుగు మాస్టారి పాత్ర- తీరు చెప్పి - నటించి పుల్లయ్యగారికి చూపించాను. 'వూ' అని పుల్లయ్య గారు తలవూపారేగాని, నమ్మకం చాల్లేదు. నన్ను బరబరా లాక్కెళ్ళి కారెక్కమన్నారు. ముందు సీట్లో ఆయన కూచున్నారు. ఎక్కడికో తెలీదు, ఎందుకో తెలీదు నాకు ! వెర్రివెధవలా చూస్తున్నాను. జార్జి టవున్‌లో ఓ విగ్గుల షాపు వుంటే అక్కడికి తీసుకెళ్లి ఓ నాలుగైదు ముసలి విగ్గులు తీయించి, నాకు తగిలించి, చూసుకుని "ఈ విగ్గు ఖాయం చెయ్యవయ్యా" అని షాపు యజమానికి చెప్పి "పద" అని ఆఫీసుకి తీసుకెళ్లి కూచోబెట్టు నిదానంగా కూల్‌గా, " యస్.... యూ అర్ డూయింగ్ దట్ కారెక్టర్"... అన్నారు పుల్లయ్యగారు. "అమ్మయ్య!" అనుకుంది తడబుడుతున్న మనసు. "ఆయనని పుల్లయ్య అనకూడదు -'వులయ్య' బాబోయ్ పెద్దపులయ్య!" అనుకున్నవాడిని- కూల్‌గా ఆయన చెప్పేసరికి, "గోవులాంటి మనసు. పులయ్యకాదు, గోవయ్య" అనుకున్నాను ఆనందంగా. అలా వచ్చిందా వేషం నాకు 'ప్రేమించిచూడు' లో.

❖ ❖ ❖

## విశ్వామిత్రుడి కథ

విజయావాళ్లు "సత్య హరిశ్చంద్ర" (1965) తీసినప్పుడు విశ్వామిత్రుడి పాత్రకి ఆస్థాన



ముక్కామల

నటుడనిపించుకున్న యస్వీరంగారావుని అడిగారు. "ఏం బావుంటుది బ్రదర్! నేను హరిశ్చంద్రుడు వేసిన వాణ్ణి. అది బాగా నడిచింది. ఇప్పుడు నేను విశ్వామిత్రుడు వేస్తే అదేదోగా వుంటుంది. నన్ను ఒదిలేయండి" అన్నారు రంగారావుగారు. కె.వి.రెడ్డిగారు, నిర్మాతలూ మళ్లీ చెప్పిచూశారు-" "నువ్వు వేస్తే ఆ తీరు వేరు. రామారావు హరిశ్చంద్రుడు, నువ్వు విశ్వామిత్రుడూ కాంబినేషన్ బావుంటుంది. కాదనకు" అన్నారు. కాని కాదన్నారు రంగారావుగారు. "మీరు విశ్వామిత్రుడికథ తీశారనుకోండి. మేనక, రామాయణ ఘట్టాలు, హరిశ్చంద్రుడూ అందరూ వస్తారు. అప్పుడు నేను హీరోని. అది తీస్తే, తప్పకుండా విశ్వామిత్రుడు వేస్తాను" అన్నారు యస్వీ . "వొద్దులే - నువ్వా వేషం వేస్తానన్నావని నీకోసం ఆ కథ ఎక్కడ తీస్తాం ? అప్పుడు 'పాతాళభైరవి' లో ముందు ముక్కామల అనుకున్నాం, నువ్వు వేశావు. ఇవ్వాడు నిన్ను అనుకున్నాం ముక్కామల వేస్తాడు. దానిదేంవుంది?" అని సర్దుబాటు చేశారు చక్రపాణి.

**రఫీ గాన వైదుష్యాన్ని వివిధ కోణాలలో ప్రతిబింబింప చేసే వ్యాస పరంపర**

# రఫీ ప్రేమగీతాలు-2



ప్రేమను ప్రకటించడంలో మమహ్మద్ రఫీ అద్వితీయుడు. ఆ అపూర్వత్వం కేవలం అతని గొప్ప కాకపోవచ్చు; గీత రచయిత, సంగీత రచయిత, నటుడు అందరూ ఇందులో భాగస్వాములే కావచ్చు. కానీ, రఫీ కంఠం నుంచి వెలువడడం వల్ల ఆ భావాలకు, ఆ అభివ్యక్తికి ఎలాంటి పరిమళం అబ్బిందో విన్నవారికి తెలుసు. నటుడినీ, తక్కిన సాంకేతిక గణాన్నీ మరిచి, రఫీయే శ్రోతలకు అందించిన అనుభవంగా అనిపిస్తుందంటే అది శ్రోతల తప్పుకాదు. రఫీ గానంలోని సృజనాత్మకత అలాంటిది. ఒక్కొక్కరకమైన అభివ్యక్తిలోనూ ఎన్ని పోకడలు పోయాడో ఓసారి గుర్తు చేసుకుందాం.

నేరుగా ప్రియురాలికి తన హృదయగత భావాలను చెప్పేస్తే గొప్ప నిశ్చింత. అందుకే

**‘ తుమ్ పే ఇజహా రే హాల్ కర్ బైఠే**
**బేఖుదీ మే కమాల్ కర్ బైఠే’ (మేరే మెహబూబ్)**

(నీతో నా మనస్థితిని చెప్పేసుకున్నాను; వివశత్వంలో భలే పని చేసేశాను). సగం నవ్వుతూ, తనని తాను వెక్కిరించేసుకుంటూ పలికే భావం ఎంత ముద్దుగా ఆ కంఠంలో ఒలికిందో.

**‘ముఝె తుమ్ సే మొహబ్బత్ హై- మగర్ మై కెహ నహీ సక్ తా, మగర్ మై క్యా కరూ బోలో బినా భీ రహ నహీ సక్ తా (బచ్ పన్)**

(నాకు నువ్వంటే ప్రేమ, కానీ ఆ మాట చెప్పలేకుండా ఉన్నాను, కానీ ఏం చెయ్యమంటావో చెప్పు - చెప్పకుండా కూడ ఉండలేకపోతున్నాను) అంటూ



చిత్రం : సంగమ్ రచన : హస్రత్ జైపురి
సంగీతం: శంకర్-జైకిషన్ గానం : రఫీ
అభినయం : రాజేంద్రకుమార్, వైజయంతీమాల

**మెహరుబా లిఖూ - హసీనా లిఖూ - యా దిల్ రుబా లిఖూ**
**హైరాన్ హూ కీ ఆప్ కో ఇస్ ఖత్ మే క్యా లిఖూ..!**
**యే మేరా ప్రేమ్ పత్ర్ పఢ్‌కర్**
**కి తుమ్ నారాజ్ న హోనా**
**కి తుమ్ మేరీ జిందగీ హో**
**కి తుమ్ మేరీ బందగీ హో! ॥యే మేరా॥**
**తుఝే మై చాంద్ కెహతా తా**
**మగర్ ఉస్‌మేఁ భీ దాగ్ హై ॥తు॥**
**తుఝే సూరజ్ మే కెహతా తా**
**మగర్ ఉస్‌మే భీ ఆగ్ హై**
**తుఝే ఇత్‌నా హి కెహతా హూ**
**కి ముఝ్‌కో తుమ్‌సే ప్యార్ హై...**
**తుమ్ సే ప్యార్ హై... తుమ్ సే ప్యార్ హై ॥యే మేరా॥**
**తుఝే గంగా మైఁ సమ్ఝూంగా**
**తుఝే జమునా మైఁ సమ్ఝూంగా ॥తుఝే॥**
**తు దిల్ కే పాస్ హై ఇత్‌ని**
**తుఝే అప్‌నా మైఁ సమ్ఝూంగా**
**అగర్ మర్‌జావూఁ రూహ్ భట్‌కేగీ**
**తేరీ ఇంత్‌జార్ మైఁ... ఇంత్‌జార్ మైఁ...**
**ఇంత్‌జార్ మై... ఇంత్‌జార్ మై.... ॥యే మేరా॥**



ఓ పక్క చెబుతూనే ఉన్నాడు. కానీ చెప్పలేనని అంటున్నాడు. చెప్పలేకుండా ఉండలేననీ అంటున్నాడు. అమాయకంగా, ముగ్ధ మనోహరంగా, తికమకగా తన ప్రేమను చెప్పే పాట ఇది.

మరో భావం.... నిస్సహాయత! ఆమె తన మీద ఎలాంటి ప్రభావం వేయగలదో ఎలా చెప్పగలను? అని ప్రశ్నిస్తున్నాడు.

**'తుఝే క్యా సునావూ మై దిల్ రుబా- తేరే సామ్ నే మేరా హాల్ హై**
**తెరీ ఎక్ నిగాహ్ కీ బాత్ హై - మేరి జిందగీ కా సవాల్ హై '**
**(ఆఖ్రీదావ్)**

'నీకు ఇంకా ఏం చెప్పమంటావు నా స్థితి నీ ఎదటే ఉంది
ఒక్కచూపు ప్రసాదించు - ఇది నా జీవన్మరణ సమస్య'

అని చాలా హుందాగా తన ప్రేమను వ్యక్తం చేయాలనుకున్నాడు. కానీ ఆమెను ఎలా సంబోంధించాలో తెలియలేదు.

**మెహరుబా లిఖూ - హసీనా లిఖూ - యా దిల్ రుబా లిఖూ**
**హైరాన్ హూ కీ ఆప్ కో ఇస్ ఖత్ మే క్యా లిఖూ**
**యే మేరా ప్రేమ్ పత్ర్ పడ్ కర్ - కి తుమ్ నారాజ్ నహోనా**
**కీ తుమ్ మేరీ జిందగీ హో - కీ తుమ్ మేరీ బందగీ హో(సంగమ్)**

(ప్రేయసీ లేదా సుందరీ లేదా మనసుదోచిన దానా - ఏమని నిన్ను పిలవను, ఈలేఖలో ఏం రాయాలో తెలీక చికాకు పడిపోతున్నాను -ఈ ప్రేమలేఖ చదివి కోపం తెచ్చుకోకు-ఎందుకంటే, నువ్వు నా జీవితానివి, నా బంధానివి) సందిగ్ధం, తడబాటు, సందేహం, హైరాన్ అన్న పదం పలకడంలో విసిగిపోయిన , అలసిపోయిన భావం-'నారాజ్ నా హోనా' అన్నప్పుడు ధ్వనించే విన్నపం- ఇవి విన్న ఏ ఆడపిల్లయినా కోపం తెచ్చుకోగలదా? అదీ రఫీ మేజిక్.

ప్రేమ ప్రకటించడం తనకు ఎప్పుడూ ఆనందాన్నే కలిగిస్తుందేమో గానీ, చూసే వాళ్ళకు తనో పిచ్చి వాడిలా కనిపిస్తాడు. ప్రేమకు, పిచ్చికీ మధ్య ఉన్న పొర బహుశా చాలా సన్నటిదని అనిపిస్తుందంటాడు.

**మైతో తేరే హసీన్ ఖయా లోమే ఖోగయా**
**దునియా యే కెహరహీ హై కే దీవానా హోగయా**

(నేను నీ అందమైన స్మృతుల్లో లీనమై ఉంటే, ఈ ప్రపంచం నేను పిచ్చి వాడినయిపోయానని అంటోంది-)

తన ప్రేమను వ్యక్తం చేసుకుంటుంటే వినే దయ కూడా ప్రేయసికి లేకపోతే, దుఃఖం రాదూ. అందుకే అంటాడు.

**ఎహ్ సాన్ తేరా హో గా ముఝే పర్ - దిల్ చాహతా హై జో కెహనేదో**
**ముఝే తుమ్ సే మొహబ్బత్ హోగయీ హై ముఝే పల్ కోంకీ చావ్ మే రెహనేదో' (జంగ్లీ)** (దయ చేసి నా మనసులో మాట చెప్పనివ్వు, నేను నిన్ను ప్రేమిస్తున్నాను, నీ కనురెప్పల నీడలో నిలవనివ్వు)

ఆ తర్వాత చరణంలో **-తుమ్ నే ముఝ్ కో హస్ నా సిఖాయా -రోనే కహోగే రోలేంగే అబ్** - నాకు నవ్వడం నేర్పింది నువ్వు, ఇక ఇప్పుడు ఏడవమంటే ...? సరే అలాగేలే...

ఈ పాటలో ఏకకాలంలో వల్లమాలిన ప్రేమ, బాధ, విన్నపం, ఆనందం కలగలిసిన అనుభూతి రఫీ కంఠం పలికిన విధం అపూర్వం, అనితర సాధ్యం.

ప్రేమను ప్రకటించడంలో అల్లరి కూడా ఉంటుంది. **'లే గయీ ఎక్ హసీనా దిల్ మేరా హాయే దిల్ హాయే దిల్'(బేనజీర్)** (నా మనసు తీసుకు పారిపోయింది. ఓ అందాల రాణి) **దీవానా ముఝ్ సా నహీ, ఇస్ అంబర్ కే నీచే- ఆగే హై కాతిల్ మేరా ఔర్ మై పీచే -పీచే' (తీస్రీమంజిల్)** (నాలాంటి పిచ్చివాడు లేడు ఈ ఆకాశం కింద - నా ముందు నా హంతకి వెళ్తుంటే వెనకే నేనూ), **'బోలో బోలో ...ప్యార్ హైతో కెహదో యెస్, ప్యార్ నహీ తో కెహదో నో - ఫిర్ జో హో హో తోహో' (దిల్ దేకే దేఖో)** (చెప్పు చెప్పు - ఏదో ఒకటి చెప్పు -ప్రేమ ఉంటే ఔనను, లేకపోతే లేదను ఆ తర్వాత ఏం జరిగితే అదే జరుగుతుంది), **యకీన్ కర్‌లో ముఝే మొహబ్బత్ హై తుమ్ సే తుమ్ సే(యకీన్)** (నన్ను నమ్ము - నాకు నిజంగా నీ మీద ప్రేమ ఉంది) ఇలా చలోక్తిగా, సరదాగా ప్రేమను ప్రకటిస్తున్న రఫీ బహు ముచ్చటగా ఉంటాడు.

మరో వైపు గంభీరంగా, హుందాగా కూడా ప్రకటించి, మన మనసులను దోచుకుంటాడు.

**చిత్రం : తీన్ దేవియాఁ** | **రచన : మజ్రూహూ సుల్తాన్‌పురి**
**సంగీతం: యస్.డి. బర్మన్** | **గానం : రఫీ**
**అభినయం : దేవ్ ఆనంద్, నందా**

**ఐసే తో న దేఖో కే హమ్ కో నషా హోజాయే**
**ఐ సే తో న దేఖో**
**ఖూబ్ సూరత్ సి కోయీ హమ్ సే ఖతా హోజాయే ॥2॥**
**ఐసే తో న దేఖో**
**తుమ్ హమే రోకో ఫిర్ బి హమ్ న రుకే**
**తుమ్ కహో కాఫిర్ బి ఐసే ఝుకే**
**కద్ మే నాజుక్ ఐసే సజ్దా హోజాయే**
**ఐసే తో న దేఖో కే హమ్ కో నషా హోజాయే**
**ఖూబ్ సూరత్ సి కోయీ హమ్ సే ఖతా హోజాయే**
**ఐసే తో న దేఖో**
**యూ న హో ఆంఖే రహే కాజల్ భూలే**
**బర్‌కే బేఖుదీ హసీ జైసీ ఖోలే**
**గున్‌కే ఫిర్ దిల్ పే సియా ఖాలీ భలా హోజాయే**
**ఐసే తో న దేఖో కే హమ్ కో నషా హోజాయే**
**ఖూబ్ సూరత్ సి కోయీ హమ్ సే ఖతా హోజాయే**
**ఐసే తో న దేఖో**
**హమ్‌తో మస్తీ మే జానే క్యా క్యా కహేఁ**
**లబే నాజూక్ సే ఐసా న హో తుమే**
**బేకరారీ కా దిలా హమ్ సే సివా హోజాయే**
**ఐసే తో న దేఖో కే హమ్ కో నషా హోజాయే**
**ఖూబ్ సూరత్ సి కోయీ హమ్ సే ఖతా హోజాయే**
**ఐసే తో న దేఖో**



'జిందగి కే సఫర్ మే అకేలే థే హమ్
మిల్ గయే తుమ్ తో దిల్ కా సహారా మిలా (నర్తకి)

(జీవన యాత్రలో ఒంటరిగా ఉండేవాడిని- నువ్వు లభించడంతో తోడు దొరికింది) అలాగే 'దిల్ జో న కెహసకా - వహీ రాజె దిల్ కెహనేకీ రాత్ ఆయీ' (భీగీరాత్)

(నా మనసు ఇంతకాలం ఏ రహస్యం చెప్పలేకపోయిందో - అది చెప్పాల్సిన రాత్రి ఆసన్నమైంది), యహీ హై తమన్నా తేరే దర్ కే సామ్ నే మేరీ జాన్ జాయే (ఆప్ కీ పర్ ఛాయియా) (నా కోరిక ఒకటే - నీ సమక్షంలో నా ప్రాణం పోవాలని) వంటివి ఎన్నో.

ప్రేమను ప్రకటించడంలో అనేక శైలులు. అవన్నీ రఫీ గొంతులో ఒదిగిపోయాయి. ఒక చిన్న సంభాషణ వంటి పాట ద్వారా ఆమె పట్ల తనకు కలిగిన మోహాన్ని అతి సున్నితంగా, వినే వాళ్ళ గుండెలు ఝల్లుమనేలా వ్యక్తీకరించడం రఫీకే తగు.

'ఐసే తో న దేఖో -కీ హమ్ కో నషా హోజాయే
ఖూబ్ సూరత్ సీ కొయి - హమ్ సే ఖతా హో జాయే'(తీన్ దేవియాఁ)

(నా కేసి అలా చూడకు మత్తెక్కిపోతుంది ఒక అందమైన తప్పు నా వల్ల జరిగిపోతుంది.)

ఆ సుందరి పట్ల తనకు కలిగిన ప్రేమను ఇన్ని రకాలుగా ప్రకటించుకున్నాక, తనే మాత్రం ఆవిడకు తీసిపోడని చెప్పాలి. ఆమెకు కూడా తన పట్ల ప్రేమ కలిగే ప్రమాదం ఉందని కూడా హెచ్చరిస్తాడు.

'ఆప్ యూఁహీ అగర్ హమ్ సే మిల్ తే రహే - దేఖియే ఏక్ దిన్ ప్యార్ హో జాయేగా' (ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా)

(నన్నిలా తరచూ కలుస్తూ ఉంటే, జాగ్రత్త, నీకూ ఓ రోజున ప్రేమ పుట్టేస్తుంది)

'మేరి మొహబ్బత్ - పాక్ మొహబ్బత్
ఔర్ జహాఁ కీ ఖాక్ మొహబ్బత్
కహీ తుమ్హే ప్యార్ న హోజాయే - బచ్ బచ్ కే చల్ నా హుజూర్'
(ఏప్రిల్ ఫూల్)

(నా ప్రేమ పవిత్రమైంది. దానిముందు ప్రపంచంలోని ప్రేమంతా తక్కువే. కొంపదీసి నీక్కూడా ప్రేమ కలిగేస్తుందేమో - కాస్త జాగ్రత్తగా మసలుకో')

అసలు ఆమెకు ఒప్పుకోవడం ఇష్టమున్నా లేకున్నా తన మీద ఆమెకు ప్రేమ ఉందనే ధీమాను ఎంత సగర్వంగా వ్యక్తం చేస్తాడో....

'ఆ.....ముఝే దేఖ్ కర్ ఆప్ కా ముస్కరానా
మొహబ్బత్ నహీ హైతో ఫిర్ ఔర్ క్యాహై' (ఏక్ ముసాఫిర్ ఏక్ హసీనా)

(నన్ను అలా చూసి మందస్మితం చేయడం, ప్రేమ కాక మరేమిటి) ఫిర్ ఔర్ క్యా హై అనడంలో ఆ గొంతులో పలికే సవాలు గిలిగింతలు పెడుతుంది.)

ఇన్నీ అని చిట్ట చివరికి అంటాడు - నువ్వు నాతో వచ్చేయ్ అని.

'యహా కోయి నహీ తేరా మేరే సివా
కెహతీ హై ఝూమ్ తీ గాతీ హవా
తుమ్ సబ్ కో ఛోడ్ కర్ ఆజావో -3' (దిల్ ఏక్ మందిర్)

(ఇక్కడ నువ్వూ నేనూ తప్ప ఎవ్వరూ లేరు అందుకే ఈ చల్లని వీచే గాలి అంటోంది -అందర్నీ వదిలి నువ్వు వచ్చెయ్యి)

ఆమె అలా వచ్చేసినపుడు అతనికి శాంతి. కానీ అతని ప్రేమ కథంతా విని వచ్చినప్పటికీ ఆమె మళ్ళీ వెళ్ళిపోతే?

'తుమ్ చలీ జావోగీ - పర్ ఛాయియా రహజా యేగీ' (శగూన్) (నువ్వు వెళ్ళిపోతావు, ఇక నీడలే మిగులుతాయి)లేదా

'వో చల్ ఝటక్ కే దామన్ - మేరీ ఆర్జూ మిటాకే మిటాకే' (హమ్ రాహీ)

(ఆమె కొంగు దులుపుకుని వెళ్ళిపోయింది - నా విన్నపాన్ని ముక్కలు చేసి) అని మళ్ళీ నిర్వేదంలో పడిపోతాడు.

ఇదంతా కూడా ప్రేమ ప్రకటించడంలోని వైవిధ్యమే, ఆమె కూడా ఒప్పుకున్నాక, తన ప్రేమ ఫలించాక నిశ్చింతగా, ఆత్మ విశ్వాసంతో ఇలా పాడుకున్నాడు.

మై ఏక్ రాజా హూ - తూ ఏక్ రానీ హై
ప్రేమ్ నగర్ కీ యే ఏక్ సుందర్ ప్రేమ్ కహనీ హై (ఉపహార్)

(నేనొక రాజును, నువ్వు ఒక రాణివి. మనది ప్రేమ నగరంలో జరిగిన ప్రేమాయణం)

ఆమె స్పందిస్తే అది ప్రేమాయణం, స్పందించకపోతే? స్పందించినా తర్వాత విడిపోతే? అతన్ని నిర్లక్ష్యం చేస్తే? విస్మరిస్తే ? ఆ విషాదం, ఆ దుర్భర వేదన రఫీ గొంతులో ఎలా పలికాయో... తర్వాతి సంచికల్లో ముచ్చటించుకుందాం.

**- మృణాళిని**

చిత్రం : ఏక్ ముసాఫిర్ ఏక్ హసినా | రచన : ఎస్.హెచ్.బిహారి
సంగీతం: ఓ.పి. నయ్యర్ | గానం : రఫీ
అభినయం : జాయ్ ముఖర్జీ, సాధనా

ఆ ముఝే దేఖ్‌కర్ ఆప్ కా ముస్కరానా
మొహబ్బత్ నహీ హై తో... ఫిర్ ఔర్ క్యా హై.. ॥ఆ ముఝే॥
ముఝే తుమ్ బేగానా కెహదో యా ఫిర్ దివానా
మగర్ యే దివానా జానూ దిల్ కా ఫసానా
బనావట్ మే దిల్ కీ హకీకత్ చుపానా
మొహబ్బత్ నహీ హైతో... ఫిర్ ఔర్ క్యా హై..
ఆ ముఝే దేఖ్‌కర్ ఆప్ కా ముస్కరానా
ఖయాలోఁమే ఖోయీ ఖోయీ రెహతీ హో ఐసీ
ముసాఫిర్ కీ చలీ ఫిర్‌తీ తస్‌వీర్ జైసే
యే అదా ఆప్ కీ యే నజర్ షాయిరానా
మొహబ్బత్ నహీ హైతో... ఫిర్ ఔర్ క్యా హై..
ఆ ముఝే దేఖ్‌కర్ ఆప్ కా ముస్కరానా








# మోహన్‌బాబు గారు నా రోల్ మోడల్...

**- 'ఇమిటేషన్ డ్యాన్స్' హరికృష్ణ**

**★ మీ గురించి చెప్పండి...**

మెదక్ జిల్లా రామాయం పేటలో సెప్టెంబరు 24, 1979న పుట్టాను. మా నాన్నగారు నాగేందర్, అమ్మ పద్మలత. నాన్న బిజినెస్ చేస్తారు.

**★ డ్యాన్స్‌మీద మీకు ఇంట్రెస్ట్ ఎలా కలిగింది?**

చిన్నప్పటి నుండీ డ్యాన్స్ అంటే బాగా ఇంట్రెస్ట్ ఉంది. చిరంజీవి గారి డ్యాన్స్ అంటే బాగా ఇష్టం. ఆయన్ని ఇన్‌స్పిరేషన్‌గా తీసుకునే నేను బాగా డ్యాన్స్ చేయాలని అనుకున్నాను. కూచిపూడి నృత్యాన్ని వంశీప్రతాప్ గారి వద్ద కామారెడ్డిలో నేర్చుకున్నాను. వెస్ట్రన్ డ్యాన్స్ మాత్రం స్వంతంగా నేర్చుకున్నాను.6వ తరగతిలో ఉండగా మా స్కూలు వార్షికోత్సవంలో తొలిసారిగా స్టేజ్‌పై ప్రోగ్రాం ఇచ్చాను. అప్పటి నుండి అడపాదడపా స్టేజ్‌షోలు ఇస్తూనే ఉన్నాను.

**★ 6 వ తరగతి నుండి స్టేజ్‌షోలు ఇస్తూ ఉంటే అది మీ చదువుకు ఇబ్బందిని కలిగించలేదా?**

నిజం చెప్పాలంటే నాకు చదువు మీద శ్రద్ధ అంతగా లేదు. అందుకే 6వ తరగతిలో స్టేజ్‌షో ఇచ్చిన తర్వాత సినిమాల్లో చేయాలనే ఉబలాటం కొద్దీ ఇంటి నుండి పారిపోయి హైదరాబాద్ వచ్చేశాను. తర్వాత అమ్మానాన్న గుర్తుకువచ్చి వెనక్కి వెళ్లిపోయాను. నా జీవితంలో అదే మొదటి సారి మా నాన్నగారి కళ్లలో నీళ్లు చూడటం. ఇక ఎప్పుడూ

ఏ తప్పు చేయకూడదని నిర్ణయించుకుని మా నాన్నగారు చెప్పినట్టే శ్రద్ధగా చదువుకున్నాను. అలాగని నాకు ఇష్టమైన డ్యాన్స్‌ని మాత్రం నిర్లక్ష్యం చేయలేదు. స్టేజ్‌షోలు ఇస్తూనే ఎం.ఎస్.సి. ఎలక్ట్రానిక్స్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను.

**★ మీ స్టేజ్‌షోల గురించి మీ నాన్నగారికి తెలిసినా ఏమీ అనేవారు కాదా?**

అసలు మా నాన్నగారికి తెలిస్తే కదా, ఏమయినా అనటానికి...! నేను ఏ ప్రోగ్రాం ఇచ్చినా మా నాన్నగారికి తెలీకుండానే చేశాను. అసలు ఇంత వరకూ మా నాన్నగారు నా ప్రోగ్రాం ఏదీ చూడలేదంటే మీరు నమ్ముతారా? ఇప్పటికీ మా నాన్నగారికి నేను ఏదైనా గవర్నమెంట్ ఉద్యోగం చేయాలని, జీవితంలో బాగా స్థిర పడాలని కోరిక. అయితే ఆయన తన అభిప్రాయాలను ఎప్పుడూ నా మీద రుద్దలేదు. ఆయనను సంతృప్తి పరచటానికే నేను ఎం.ఎస్.సి. కంప్లీట్ చేశాను.

**★ అంటే మీ ఇంట్లో వారి ప్రోత్సాహం ఏమీ లేకుండానే మీరు నెగ్గుకొచ్చానంటారు....?**

అలా అని కాదు. మా నాన్నగారి ప్రోత్సాహం అసలు ఏమీ లేదు. మా అమ్మ ఎటూ చెప్పేది కాదు. అయితే ఎవరైనా మీ అబ్బాయి బాగా డ్యాన్స్ చేస్తాడంటే మాత్రం ఆనందించేది. నన్ను బాగా ప్రోత్సహించింది మా అమ్మమ్మ రాజమణి గారే. నేను సెలవులకు వెళ్లినపుడల్లా అక్కడ ఆమే డబ్బుకట్టి డ్యాన్స్ క్లాసులకు పంపించటం చేసేది. నేను ఈ రోజు కొద్దిగానైనా పేరు తెచ్చుకున్నానంటే అది ఆవిడ చలవే. అలాగే మా పిన్ని కవిత, బాబాయ్ సురేందర్‌ల ప్రోత్సాహం కూడా ఎంతో ఉంది. నన్ను వారి పెద్ద కొడుకులా చూసుకుంటూ, మంచి సలహాలనిస్తూ నా కెరీర్ బాగుండటానికి కృషి చేస్తున్నారు.

**★ మిమిక్రీ చేస్తూ డ్యాన్స్ చేయాలని ఎందుకు అనిపించింది?**

ఇది నాకు వచ్చిన ఆలోచనే. ఎందుకంటే ఇదివరకు సినిమాలో ఓ డైలాగ్ తీసుకుని ఏ ఆర్టిస్ట్ ఎలా మాట్లాడతాడో చూపించటమో జరిగేది. దాన్నే కొద్దిగా మార్చి ఓ పాటకు ఏ ఆర్టిస్ట్ ఎలా పెర్ఫార్మ్ చేస్తారో చూపిస్తే ఎలా ఉంటుందోనన్న ఐడియా వచ్చి దాన్నే నేను ప్రాక్టీస్ చేశాను. అలా 1996లో హరిహర కళాభవన్‌లో నా మొదటి ఇమిటేషన్ డ్యాన్స్ ప్రోగ్రాం ఇచ్చాను. దానికి విపరీతమైన రెస్పాన్స్ వచ్చి, నా మీద నాకు నమ్మకం కలిగేటట్లు చేసింది.

**★ ఇప్పటి వరకూ ఎన్ని ప్రోగ్రాంలు ఇచ్చి ఉంటారు?**

దాదాపు 1000కు పైగానే. అన్నీ కూడా చాలా చక్కటి గుర్తింపును తీసుకువచ్చాయి.

**★ సినిమాల్లో అవకాశం ఎలా వచ్చింది?**

నాకు సినిమాల్లో చేయాలని ఉండేది కానీ, ఎప్పుడూ ప్రయత్నించలేదు. 2002లో ఎం.ఎస్.సి. ఫస్ట్ ఇయర్ చదువుతున్నప్పుడు రవీంద్రభారతిలో ఇమిటేషన్ డ్యాన్స్ చేశాను. అప్పుడు ప్రముఖ రచయిత జలదంకి సుధాకర్ గారు నన్ను దర్శకులు జయంత్.సి.పరాన్జీ గారికి పరిచయం చేశారు. తరువాత జయంత్ గారిని కలవటం, ఆయన నాకు స్క్రీన్ టెస్ట్ చేసి 'ఈశ్వర్'లో తొలి అవకాశం ఇవ్వటం జరిగాయి.



'ఈశ్వర్' చిత్రంలో ప్రభాస్‌తో...

**★ అంతకుముందు ఎప్పుడూ కెమెరా మొహమే చూడని మీరు తొలిసారి కెమెరా ముందున్నప్పుడు భయం వేయలేదా?**

నేను కెమెరా ముందు యాక్ట్ చేయకపోవచ్చు కానీ స్టేజ్‌షోల ద్వారా వేలాది జనం ముందు యాక్ట్ చేసిన అనుభవం ఉంది. అది ఇక్కడ బాగా ఉపయోగపడింది. దానికి తోడు ఈ సినిమాలో నాతో పాటు చేసిన వారందరూ ఇంచుమించుగా సినిమా రంగానికి కొత్తే. అది కూడా ఓ ప్లస్ పాయింట్ అయింది. జయంత్ గారు కూడా చాలా ఓపిగ్గా చేయించుకునే వారు. దానికి తోడు జయంత్ గారు ఓ ప్రెస్‌మీట్‌లో 'ఈశ్వర్'లో చేస్తున్న కుర్రాళ్లు మరో 20 సంవత్సరాల పాటు ఈ పరిశ్రమను రూల్ చేయగలరని చెప్పటం మా పై మాకు నమ్మకాన్ని కలగజేసి మరింత ఉత్సాహంగా చేయటానికి ఆస్కారం కలిగించింది.

**★ మీ మొదటి సినిమాకు, రెండో సినిమాకు చాలా గ్యాప్ వచ్చినట్టుంది....**

అవును. నిజానికి ఈశ్వర్‌లో హీరో ఫ్రెండ్స్‌లో ఒకనిగా చేసిన క్యారెక్టర్‌కు మంచి పేరే వచ్చింది. అయితే ఆ సక్సెస్‌ను నేను సరిగా ఉపయోగించుకోలేకపోయాను. ఈ ఇండస్ట్రీతో నాకు పరిచయం చాలా తక్కువ కావటం కూడా దానికి ఓ కారణం. తరువాత 'విష్ణు'లో హీరో ఫ్రెండ్‌గా ఓ క్యారెక్టర్ చేశాను.

**★ ఇప్పుడు చేస్తున్న సినిమాలు..?**

సూపర్‌గుడ్ ఫిలింస్ నిర్మిస్తున్న 'విద్యార్థి' లో ఓ చక్కటి రోల్ చేస్తున్నాను.

**★ సినిమాల్లో చేయటం మొదలుపెట్టిన తరువాత స్టేజ్‌షోలు చేయటం ఆపేశారా?**

లేదు. నాకు గుర్తింపు వచ్చిందే అక్కడ. కాబట్టి వాటిని ఆపే ఉద్దేశ్యం అయితే ఇప్పట్లో లేదు.

**★ మీకు డ్రీమ్ రోల్ అంటూ ఏదైనా ఉందా?**

'సాగరసంగమం'లో కమల్‌హాసన్ చేసినటువంటి పాత్రను చేయాలని వుంది. ఎందుకంటే అది కూడా డ్యాన్స్ రిలేటెడ్, టిపికల్ క్యారెక్టర్. అటువంటి క్యారెక్టర్స్ పడితే నన్ను నేను ప్రూవ్ చేసుకోవటానికి విపరీతంగా కృషిచేస్తాను.

**★ ఇప్పటి వరకు మీరు చేసిన ఏసినిమాలోనూ మీ ఇమిటేషన్ డాన్స్ టాలెంట్‌ను ఉపయోగించుకోకపోవటం మీకు బాధనిపించలేదా?**

లేదు. ఎందుకంటే ఏదైనా సినిమాలో నా ఈ ఇమిటేషన్ డాన్స్ టాలెంట్‌ని ఉపయోగించుకుంటే అది ఆ ఒక్క సినిమాకు మాత్రమే పరిమితమైపోతుంది. తరువాత సినిమాలో మళ్లా అదే చేస్తే ప్రేక్షకులు బోర్ ఫీలవుతారు. 'ఈశ్వర్' సినిమాలో జయంత్ గారు క్యారెక్టర్ ఉందంటే నేను డ్యాన్స్‌కు సంబంధించినదే అయి ఉంటుందనుకుంటున్నాను. అయితే ఆయన నా క్యారెక్టర్‌ను చాలా డిఫరెంట్‌గా ప్రజెంట్ చేసి నాకు మంచి పేరు వచ్చేలా చేశారు.

**★ ఇండస్ట్రీలో మిమ్మల్ని బాగా ప్రోత్సహించిన వాళ్లు ఎవరు?**

మోహన్‌బాబు గారు, జయంత్ గారు, ఆదిత్య ఓం, ప్రభాస్... ఇలా చాలామంది ఉన్నారు. అయితే మోహన్‌బాబు గారి గురించి ఇక్కడ ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఆయనకు చదువుకునే వాళ్లంటే ఎంతో ఇష్టం. అందుకే 'విష్ణు' షూటింగ్ టైంలో నా

ఎగ్జామ్స్ వస్తే బాగా రాయమని నన్ను ప్రోత్సహించారు. ఆయన ఆశీర్వాదంతోనే నేను ఎం.ఎన్.సి. ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాననుకుంటాను. నేను పాసయ్యానని తెలిసి ఆయన ఎంతో సంతోషించారు.

**★ మీకు డ్యాన్స్ బాగా వచ్చి కూడా డ్యాన్స్ డైరెక్షన్‌లో కాకుండా, ఆర్టిస్ట్ గా ట్రై చేయటం వెనక కారణం ఏమైనా ఉందా?**

నాకు డ్యాన్స్ అంటే ఇంట్రెస్ట్ ఉన్నా నాకు సరైన అవకాశం మాత్రం రాలేదు. అయినా డ్యాన్స్ డైరెక్టర్ కావటానికి చాలా ఇబ్బందులున్నాయి. అవన్నీ క్లియర్ చేసుకున్నా ఆర్టిస్ట్‌గా వచ్చిన అవకాశాలు అక్కడ లభిస్తాయా అన్నది సందేహమే. అందుకే నేను ఆ సైడ్ వెళ్లలేదు. అయినా నా శాటిస్‌ఫాక్షన్ కోసం చిక్కడపల్లిలో నృతికా డ్యాన్స్ అకాడమీ స్థాపించాను. ఇటీవల అనామిక, కలోనియల్ కజిన్స్ హైదరాబాద్‌లో వాళ్ళ ప్రోగ్రామ్స్ ఫెర్ఫార్మ్ చేసినప్పుడు మా ట్రూప్‌తో మేం కూడా అక్కడ ఫెర్ఫార్మ్ చేశాం. అదీకాక నా స్నేహితుడు ఆదిత్య ఓం నిర్మించిన 'మిస్టర్ లోన్లీ మిస్ లవ్లీ' సినిమాలో ఓ చిన్న థీమ్‌సాంగ్‌ను కంపోజ్ చేశాను.



కృష్ణలా..



వెంకటేశ్‌లా...



నాగార్జునలా...



రాజశేఖర్‌లా..



ఆర్.నారాయణమూర్తిలా...

**★ ఇంతకీ మీ ఫస్ట్ ప్రిఫరెన్స్ దేనికి?**

ఆర్టిస్ట్‌గానే ఉండాలనుకుంటున్నాను. దానికోసం తీవ్రంగా ప్రయత్నిస్తున్నాను.

**★ మీ రోల్ మోడల్ ఎవరు?**

మోహన్‌బాబు గారు. ఆయనలాగా ఉండాలని కోరుకుంటున్నాను. ఆయనలా డిసిప్లిన్డ్‌గా ఉండేవాళ్లు చాలా తక్కువ. ఆయనను చూసి నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది. నాకు ఆయన ఎన్నో మంచి సూచనలు చేస్తుంటారు. నేను మంచి పేరు తెచ్చుకుంటే సంతోషించే వాళ్లలో ముందుండే వ్యక్తి ఆయన అని నా నమ్మకం.

**★ ఇప్పుడు మీరు చేస్తున్న సినిమాలు...?**

నేను చేసిన 'విద్యార్థి' సినిమా విడుదల కావలసి ఉంది. ఇటీవల ఈటీవి 2 కోసం 'మాయాబజార్' అని ఓ సింగిల్ ఎపిసోడ్ చేశాను.

**★ మీ యాంబిషన్ ?**

నేను యాక్టర్‌గా మంచి స్థితికి చేరుకుంటే స్వాతంత్ర్య సమరయోధులు, యుద్ధ వీరుల కుటుంబాలకు నాకు చేతనైన సాయం ఏదైనా చేయాలన్నది నా కోరిక. ఖచ్చితంగా వారికోసం ఏదో ఒకటి చేస్తాను.

రచన: చంద్రబోస్ (1) గానం: కళ్యాణిమాలిక్,గంగ,వసుంధరాదాస్

ఆ: గంగా ఏ.సి మ్యాట్నీషోతో డైలీ త్రీ షోస్ ప్రేమ
అ: దోమలగూడ, చింతలకుంట ఏ.కె. 7812
ఆ: అయ్యప్ప కట్ పీసెస్ డిస్కౌంట్10%
చలో జింఖానా గ్రౌండ్స్, గగనా ట్రావెల్స్ & టూర్స్
ఆచంట, కాకినాడ, పుంగనూరు,
ఏ.సి. వీడియో కోచ్ బస్సులు కలవు ప్రతిరోజూ
ఊరూర ఉరురుర ఊరరూరురూ....
ఊరూర ఉరురుర ఊరరూరురూ...
అ: తొందరపడకు సుందరవదనా, ఆగి నెమ్మదిగా వెళ్ళు
ఇంటికో చెట్టు ఆరోగ్యానికి తొలిమెట్టు, రాశి సిమెంటు
మీఠాలాల్ భూర్మల్ జైన్ మనీ లెండర్స్ పాన్ బ్రోకర్స్
యస్.టి.డి., ఐ.యస్.డి., లోకల్ కాల్ టూ రూపీస్
వేరెవర్ యూగో అవర్ నెట్‌వర్క్ ఫాలోస్,
బాటా బాటా బాటా బాటా టా...
ఊరూర ఉరురుర ఊరరూరురూ....
ఊరూర ఉరురుర ఊరరూరురూ...
ఆ: మా పార్టీ నాయకుణ్ణే గెలిపించండి-
మడతమంచాలు అద్దెకు ఇవ్వబడును....
అ: జనశక్తి ప్లాట్లు సొంతం చేసుకోండి-
విరిగిన ఎముకలకు కట్లు కట్టబడును....
ఆ: బరువు తగ్గాలనుకుంటున్నారా-నెల్లూరు మెస్ మీల్స్ రెడీ...
అ: వాణీ నవశక్తి- బీడీ తాగండి - ఆంధ్రాబ్యాంక్ వారి సౌజన్యంతో
ఆ: పులిరాజాకి ఎయిడ్సొస్తుందా - జ్యోతిష్యం చెప్పబడును
చెయ్యి చూసి రంగురాళ్ళు ఉంగరాలు ఇవ్వబడును
ఊరూర ఉరురుర ఊరరూరురూ....
ఊరూర ఉరురుర ఊరరూరురూ...
ఆ: కుక్కలు వున్నాయి జాగ్రత్త - సుమన కొచ్చర్లకోట
అ: కొబ్బరిబొండాం రూ ॥ ఆరు, సింహాద్రి, నీరు మీరు...
ఆ: మీ చర్మ సంరక్షణకి సౌందర్యానికి ప్రిన్స్ ఫినాయిల్నే వాడండి
అ: మీ పిల్లల బంగారు భవితవ్యానికి
అమ్మోనియా ఫ్యాంక్టంఫాస్ నే వెయ్యండి
ఆ: ఎన్‌కౌంటర్లన్నీ బూటకాలు
అ: సువార్త ఉజ్జీవ కూటములు
ఆ: నాలా ఇంకొకరూ ఆలోచిస్తున్నారు.....
అ: నేననాలనుకున్నదంటోందెవరు...
ఆ: నన్నే కాపీ చేస్తున్నారు
అ: నా వెనకే ఫాలో అవుతూ నడిచేదెవరూ
ఆ: వచ్చేదెవరు
అ: తిరిగేదెవరు
ఆ: ఎవరూ వారెవరు..
ఊరూర ఉరురుర ఊరరూరురూ....
ఊరూర ఉరురుర ఊరరూరురూ...

రచన: చంద్రబోస్ (2) గానం: ఎమ్.ఎమ్. కీరవాణి, దేవిశ్రీప్రసాద్, టిప్పు, చంద్రబోస్, కళ్యాణిమాలిక్, స్మిత

ప: పంతం పంతం పంతం పంతం నీదా నాదా హేయ్
సొంతం సొంతం సొంతం సొంతం నీకా నాకా హేయ్ నీ...
భగ భగ భగ తెగమరిగిన రక్తం మాదే మాదే హెయ్
తెగ తెగ తెగ పైకెగిరిన పందెం మాదే మాదే హెయ్...
వేద్దాం సై..... చూద్దాం సై....
కత్తెర కొనలకు కత్తుల మొనలకు యుద్ధం
సై.... సిద్ధం సై....సై... సై....సై...
చ: కోసేస్తాం గడ్డి, కొట్టేస్తాం బండ, ఎత్తేస్తాం చెత్తన్నాకొ...- చెత్త
నరికేస్తాం కొమ్మ, ఏరేస్తాం ముళ్ళు,
తవ్వేస్తాం మట్టిన్నాకొ...-మట్టిరా
నలిపేస్తాం పాత డబ్బా, డబ్బాన్నాకొ....
నింపేస్తాం నీటి తొట్టి - తొట్టన్నాకొ....
మధ్య మధ్యలో తింటాం మిర్చి మసాలా - సాలా...
హోల్డ్ యువర్ టంగ్ హే హే
మైండ్ యువర్ వర్డ్స్ హే హే
క్యారేజిలో తెచ్చాం లేరా క్యాబేజీ
క్యాబే -జీ
నీదా నాదా నీదా నాదా పంతం నీదా నాదా హేయ్
చ: హేయ్ గుప్పిస్తాం రంగు
గీసేస్తాం హద్దు
గీతను దాటి వచ్చిన వాడి పాదం కట్.. కట్. కట్.....
ఒరేయ్ లేపేస్తాం బంతి... చూపిస్తాం సత్తా
పోటా పోటీ నిలిచావంటే బాడీ ఫట్ ఫట్ ఫట్....
పెకలిస్తాం చేతి గోళ్ళు జాగ్రత్త
విరిచేస్తాం రెక్కలు రెండు బెట్టింత....
దింపేస్తాం పొగరును కాస్త.....
దికాతాహూఀ తేరి ఘర్‌కా రాస్తా
తోక ముడుచుకుని జా...జా...
ఎక్కడికో జా... కొజ్జా
ముయ్ రా ముయ్
హే హే..
డూ ఆర్ డై
హే హే...
నచ్చేదెవడో చచ్చేదెవడో వెయిట్ అండ్ సీ....
యాఀ.... వెయిట్ అండ్ సీ....

రచన: చంద్రబోస్ (3) గానం: కళ్యాణిమాలిక్, స్మిత, వసుంధరాదాస్

సాకీ: మనకు తగు మనిషొకడుండి
వాడిలోన వేడివుంటే య్యా... య్యా..య్యా....
ఎదురుపడి ఎగబడిపోతూ
వాడితోటి ఆడుకుంటే యా..య్యా...య్యా...
ప: చంటైనా -బుజ్జైనా -ముసుగేసుకొచ్చింది మూర్తైనా
జానైనా - శీనైనా- బోయ్ ఫ్రెండ్ కాబోయేదెవడైనా ..సై
స....స.... స్స.... సై...... నువు సై అన్న అనకున్న సై.... ॥చంటైనా॥
ఆ: ఫేసుకి మాస్కున్న చల్‌తా హై - మనసుకి వేస్కోకురా
పరిచయమవకున్న పరవానై - ఫిగరుని మిస్ కాకురా
వున్నది మాలో వేకెన్సీ -టేక్ ఏ ఛాన్స్ బేబీ
కలిసెను మీతో ఫ్రీక్వెన్సీ -మేక్ ఏ మూవ్ బేబీ

కిస్సిస్తూ కిలోల్లెక్కన -అప్ అప్ ఆపైనా
కొలిచేస్తూ గజాలెక్కన ఒన్ మోర్ ఇంచ్
నచ్చినవన్నీ చేసిన వాడికి వెచ్చని కరెన్సీ ఇచ్చేందుకు సై
స....స....స్స..సై......
నీ కుడి నాకు ఎడమైన సై...
ప: ఆర్టయినా - సైన్స్ నా - ఆమాటకొస్తే ఏ గ్రూపైనా....
హస్కైనా -రిస్కైనా - ఎదురొస్తే ఏ కౌన్ కిస్కైనా.... సై..
స....స....స్స..సై.....ఈ సమయాన ఎవడైనా ససస్స సై....
అ: ఫిఫ్టీ పర్సెంటు డ్రస్సుల్లో - పిలుపే తెలిసిందిలే....
హండ్రెడ్ పర్సెంట్ అందంలో - ఆటకు తయ్యారేలే...
మొదలెట్టాలొక వన్ డే మ్యాచ్ - కమాన్ బేబీ కమాన్....
మనకింకెందుకు నెట్ ప్రాక్టీస్ - గెటాన్ బేబీ గెటాన్...
నీబాడీ ప్లే గ్రౌండ్‌గా ....నో బడీ అంపైరింగ్
ముచ్చెమటే స్కోరు బోర్డుగా...య్యా.... య్యా... య్యా...
ఆడించేందుకు ఓడించేందుకు
మీ చేతుల్లో అవుటయ్యేందుకు సై....
మీరేమన్న అనుకున్న సై.....
స....స.....స్స...సై.....

### 4

రచన: ఎమ్.ఎమ్. కీరవాణి | గానం: లక్కీ ఆలీ, సుమంగళి

ప: అప్పుడప్పుడు అప్పుడప్పుడు ఇలాగా
ఇలాగ ఇలాగఇలాగ ఇలాగ ఇలాగ
అప్పుడప్పుడు అప్పుడప్పుడు ఇలాగా
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
అప్పుడప్పుడు అప్పుడప్పుడు ఇంకోలాగా
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
అప్పుడప్పుడు గుండెచప్పుడు ఎలాగోలా
ఇదేనేమో ఇదేనేమో అదంటే అనలేని ఓ భావమో..
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
అప్పుడప్పుడు అప్పుడప్పుడు అప్పుడప్పుడు అప్పుడప్పుడు
అప్పుడప్పుడు అప్పుడప్పుడు అప్పుడప్పుడు అప్పుడప్పుడు

అ: కాసేపు కోపం
లలలలలల లైల లైల లాయ్
కాసేపు నవ్వు
లలలలలల లైల లైల లాయ్
కాసేపు తాపం - కాసేపు విరహం
కాస్తంత బెట్టు -ఏమెరుగనట్టు -
తెగ తిట్టుకుంటూ -కూడానే వుంటూ
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
అప్పుడప్పుడూ....అప్పు.... డప్పు..... డప్పు.....డూ

ఆ: ఐహేట్ యూ సోమచ్ -న న న న న
నయ్ నయ్ నయ్ నయ్ నయ్
ఐహేట్ యూ టూ మచ్ -
య య య య య య్యా య్యా య్యా య్యా....

అ: ఐలవ్ యూ సోమచ్
అని ఎవరు అన్నారే.....
నీ దారి నీదే - నా తీరు నాదే....

ఆ: నా మాటకేమో అర్థాలు వేరే...
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ
ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ ఇలాగ

### 5

రచన: శివశక్తిదత్తా | గానం: యం.యం. కీరవాణి,చిత్ర

అ: నల్లా నల్లాని కళ్ళ పిల్లా
నీ మొగుడయ్యేవాడెల్లా
వుండాలి కొంచెం చెప్పమ్మా....!
తెల్లారే సరికల్లా నే జిల్లాలన్నీ వెతికి
వాణ్ణెల్లాగోలాగ తెచ్చి పెళ్ళి చేసేస్తానమ్మా ....!

అ: ఎర్రంగా బొద్దుగా వుంటే చాలా
ఒళ్ళో పెట్టుకు లాలిపాడి జో కొట్టాలా
అడుగులకే మడుగులు ఒత్తేవాడే మేలా
మీసం మీద నిమ్మకాయలు నిలబెట్టాలా
ఒప్పులకుప్ప వయారిభామా
ముద్దులగుమ్మ చెప్పవెబొమ్మ....

ఆ: ఒప్పులకుప్పకి వయారిభామకి -
నచ్చిన మొగుడివి నువ్వేనమ్మా

అ: ఆఁ...... నేనా.... నీతో... సరిపోతానా ?

ఆ: నల్లా నల్లాని కళ్ళ పిల్లాడా నువు పెళ్ళాడేదెల్లా
వుండాలి కొంచెం చెప్పమ్మా....!
తెల్లారే సరికల్లా నే జిల్లాలన్నీ వెతికి
దాన్నెల్లాగోలాగ తెచ్చి పెళ్ళి చేసేస్తానమ్మా ....!

ఆ: మొత్తంగా పువ్వులా ఉంటే చాలా....
మొత్తంగా తానే చేసుకు పోతుండాలా......
కులుకుల్లో స్వర్గం చేతికి అందించాలా
సై అంటే సై అని బరిలో దూకెయ్యాలా...
కాళ్ళా గజ్జా కంకాళమ్మా ఎవరో యమ్మా ఖజరహో బొమ్మ..!

అ: ఇంకెందుకులే దాపరికమ్మా ఆ నచ్చిన పిల్లవు నువ్వేనమ్మా

ఆ: ఛీ... నేనా..... ? నీతో.... సరిపోతానా...

అ: సిగ్గుల మొగ్గల బూరెల బుగ్గల
నల్లా నల్లాని కళ్ళ పిల్లా నిను పెళ్ళాడేవాణ్ణిల్లా
ఊరించి ఉడికించొద్దమ్మా
తెల్లారే సరికల్లా మనమెల్లాగోలాగ
మొగుడూ పెళ్ళాలైపోయే దారి
కాస్త చూపించెయ్యమ్మా........

### 6

రచన: భువనచంద్ర | గానం: టిప్పు, మాలతి

ఆ: గూట్లో వుంది బెల్లం ముక్క గుట్టుగుట్టుగా .....
నోట్లో పెడితే నానుతుంది మెత్తమెత్తగా ॥గూట్లో॥
అమ్మనడిగితే ఊహూఁ... అంది....
అల్లుండింటికే పో పో అంది
బెల్లం పెడతావో ఎక్కడ సున్నం పెడతావో
నీకు దండం పెడతా... దయ చూడమంటా...

అ: రోట్లో వుంది కొబ్బరి చెక్క బెట్టు బెట్టుగా
రోకలి పడితే లొంగుతుంది బిట్టు బిట్టుగా..
అత్తనడిగితే నవ్వేసింది...
మరదలింటికే పో పొమ్మంది...
కొబ్బరి పెడతావో అరిచి బొబ్బలు పెడతావో....
నీకు సాయంగుంటా... లొజెట్టమంటా....

అ: చెంపకు చారెడు కన్నుల దానా చేలోకొస్తావా...
వెచ్చని వెచ్చని వెన్నెల కూనా వాటేస్కుంటావా
నీ అందం కాశ్మీరీ పూలగంధం
వేసిందే ప్రేమబంధం
ఓ... నెఱజాణా.....!

ఆ: కత్తెర చూపుల తిత్తిరిగాడా వలలో పడతానా...
తిక్కని రేపితే టక్కరి వాడా ఒళ్ళో పడతానా...
అరె పందెం.... నీ బుర్ర కాస్త మందం -
కవి తిక్కన రాసిన కందం...... జాజా రే జానా !

అ: నే నొప్పను అంటే...

ఆ: మౌనంగుంటా.....

అ: నే రానంటే...

ఆ: నేనే వస్తా.....

అ: కాదని అంటావో ముద్దుగ ఔనని అంటావో...
నిన్ను వేడుకుంటా....
దయ చూడమంటా.... హోఁ... హోఁ...హోఁ ॥గూట్లో॥

ఆ: అలకలు వస్తే చిలకని పట్టే సీక్రెట్ చెబుతాలే...
బుగ్గన పూసిన బూరెలు రెండూ కానుక ఇస్తాలే
ఓరయ్యో కొరికేలా చూడకయ్యో -
కొవ్వూరి హనుమంతయ్యో సయ్యరే సయ్యో

అ: రెమ్మల చాటున చుమ్మలు పెడితే గమ్మున వుంటావా..
చిమ్మిలి మెక్కిన తిమ్మిరి బొమ్మని చేతికి ఇస్తావా..
సిరికొండా -పూనా దానిమ్మపండా -
పుత్తూరి కలకండా.. ఉంటాలే అండా ....!

ఆ: నే తిప్పలు పెడితే...

అ: కల్లో కొస్తా....

ఆ: ఓయస్సంటే ..

అ: ఒళ్ళో కొస్తా....

ఆ: ఎత్తుకు పోతావో మత్తుగ హత్తుకు పోతావో
నేను నీ వెంటుంటా.. నీ బాంచనంటా... ॥గూట్లో॥

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.



శ్రీ భారతి ఎంటర్‌ప్రైజెస్

A CHALLENGE

**ఎస్.ఎస్.రాజమౌళి - శ్రీమతి భారతి**

విజయేంద్రప్రసాద్ - ఎమ్.ఎమ్.కీరవాణి - కె.కె.సెంథిల్‌కుమార్

## తారాగణం

నితిన్, జెనీలియా, శశాంక్, ప్రదీప్‌సింగ్ రావత్, తనికెళ్ళ భరణి, నాజర్, వేణుమాధవ్, రాజీవ్ కనకాల, సమీర్, కాంచి, శేఖర్, అజయ్, రాఘువ, విశ్వేందర్ రెడ్డి, సారిక రామచంద్రారావు, శివన్నారాయణ, ప్రీతినిగమ్, ఆలపాటి లక్ష్మి

## సాంకేతిక నిపుణులు

కథ
వి.విజయేంద్ర ప్రసాద్

మాటలు
ఎం. రత్నం

కొరియోగ్రఫీ
రాజు సుందరం
రాజశేఖర్, నిక్సన్
శ్రీధర్ రెడ్డి

కాస్ట్యూమ్స్
లోకేష్

మేకప్
సుద్దాల రాజు

స్టిల్స్
లూర్ధ్

పి.ఆర్.ఓ
గోగినేని శ్రీనివాస్

పబ్లిసిటీ డిజైనర్
సురేష్ బుజ్జి

ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్
డి.యోగానంద్
బి. సూర్యనారాయణ

చీఫ్ కో-డైరెక్టర్
జె.వి.వి. సత్యనారాయణ

కో - డైరెక్టర్
జి. రామక్రిష్ణా రెడ్డి
మహదేవన్ సోమయాజి

అసోసియేట్ డైరెక్టర్
శ్రీనివాసరావు మామిళ్ళపళ్ళి

అసిస్టెంట్ డైరెక్టర్స్
జె. కరుణకుమార్
వి.వి.ఎన్.శివశంకర్

సౌండ్ సూపర్‌విజన్
కళ్యాణి మాలిక్

డ్రస్ డిజైనర్
రమా రాజమౌళి

నిర్మాత
శ్రీమతి భారతి

స్క్రీన్ ప్లే-దర్శకత్వం
ఎస్.ఎస్.రాజమౌళి

ఫైట్స్
విజయ్
రామ్-లక్ష్మణ్

ఆర్ట్
బి.ఆనందసాయి

ఎడిటింగ్
కోటగిరి వెంకటేశ్వర్రావు

డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ
కె. కె. సెంథిల్ కుమార్

ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్
ఎ. రఘునాధరెడ్డి

సంగీతం
ఎం.ఎం. కీరవాణి


గిరి


భారతి


ఎస్.ఎస్.రాజమౌళి


కీరవాణి


భువనచంద్ర


చంద్రబోస్

కూర్పు: టి.నవీన్, హైదరాబాద్

# సరిగపదమని 27

## ఎ.ఎన్.ఆర్. స్పెషల్



| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | 3 | | 4 | |
| | ● | | ● | 5 | | ● | | ● |
| ● | 6 | | ● | | ● | 7 | ● | 8 |
| 9 | ● | ● | 10 | ● | 11 | | | ● |
| 12 | | | ● | 13 | ● | | ● | 14 |
| | ● | ● | 15 | | 16 | ● | 17 | |
| 18 | | 19 | ● | ● | | ● | ● | |
| ● | ● | | ● | 20 | ● | 21 | ● | |
| 22 | | ● | 23 | | | | | ● |

**అడ్డం:**

1. '.......... వాలు కనులదానా వయ్యారి హంస నడకదానా' (4)
3. '............. కోనేటి పడుచుపిల్లోయ్ నీపైట కొంగు జారిందే గడుసుపిల్లా' (4)
5. 'నిన్న...... అందమేదో నిదుర లేచెనెందుకో' (2)
6. 'నేడు శ్రీ.......కి మేమంటే పరాకా' (2)
8. '...... హృదయంలో నిదురించే చెలీ' (1)
10. 'గౌరమ్మా ..... మొగుడెవరమ్మా? ఎవరమ్మా, వాడెవరమ్మా?(1)
11. '.........షికారుకెళ్ళే పాలబుగ్గల పసిడిచానా'(3)
12. 'ఖుషీ ఖుషీగా ......... చలాకిమాటలు రువ్వుతూ'(3)
15. '......... ఏముంది దేవుడి గుడిలోనే వుంది'(3)
17. 'కడవెత్తుకొచ్చింది కన్నె..... అది కనబడితే చాలు నా గుండెగుల్ల' (2)
18. 'ఈ....... రాళ్ళలో ఏ కన్నులు దాగెనో'(3)
22. '........ ......... తెలుగులా తెల్లవారి వెలుగులా' (2)
23 'కనులు కనులతో ......... ఆ తగువుకు ఫలమేమి'(5)

**నిలువు:**

1. 'నా కళ్ళు చెపుతున్నాయి ....... ప్రేమించానని'(2)
2. 'ఒసే ....... రంగీ వగలమారి బుంగీ'(3)
3. 'ఆడుతు పాడుతు ......చేస్తుంటే అలుపు సొలుపేమున్నది' (2)
4. 'గంపానెత్తిన బెట్టి......మీద పోతుంటే గుండె జల్లుమన్నాదే రంగమ్మా'(2)
5. 'చెలియ ...... చెలిమి...... వెలుతురే.......' (2)
7. '........ హుషారుగా షికారు పోదమా'(3)
9. '.......... మనసై బ్రతుకున బ్రతుకై తోడొకరుండిన అదే భాగ్యము' (4)
13. '.....ఎడమైతే పొరపాటు లేదోయి ఓడిపోలేదోయ్' (2)
14. '.......... కట్టుకున్న దెవరికోసము మల్లెపూలు పెట్టుకున్న దెవరికోసము'(4)
16. 'నేను పుట్టాను ...... మెచ్చింది' (2)
19. 'ఆకలుండదు దాహముండదు ...... చూస్తుంటే' (2)
20. 'కాదుసుమా ...... కాదు సుమా'(2)
21. 'ఏమనుకున్నావు నన్నేమనుకున్నావు పిచ్చి.... ననుకున్నావా'(2)

పంపినవారి పేరు :......................................................................

వయసు:............ వృత్తి:....................................................................

చిరునామా :..............................................................................

.............................................................................................

.......................................................ఫోన్:..................................

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



పజిల్, కూపన్ 30-09-2004 లోగా చేరాలి

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



రెండవ బహుమతి (ఒక తప్పుతో)



మూడవ బహుమతి (రెండు తప్పులతో)



కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



| | తెలుగు | తమిళం |
|---|---|---|
| చిత్రం | ప్రేమ్‌నగర్ | వసంత మాళిగై |
| రచన | ఆత్రేయ | కణ్ణదాసన్ |
| సంగీతం | కె.వి.మహదేవన్ | కె.వి.మహదేవన్ |
| గానం | ఘంటసాల | టి.ఎం.సౌందర్‌రాజన్ |

ఒక భాషలో విజయం సాధించిన చిత్రం మరొక భాషలో నిర్మించినపుడు విజయం సాధిస్తుందని నిశ్చయంగా ఎవరూ చెప్పలేరు. పాతరోజుల్లో ఒకే కథతో రెండేసి భాషల్లో చిత్ర నిర్మాణం చేసి విజయం సాధించిన సందర్భాలున్నాయి. ఒక కథతో మూడు భాషలలో ఒకేసారి చిత్రాలు తీసి ఆ మూడూ సరిగ్గా ఆడక దెబ్బతిన్న సందర్భమూ ఉంది. అరుదుగా కొన్ని చిత్రాలు ఎన్ని భాషలలో నిర్మించినా విజయం సాధిస్తాయి. అటువంటి చిత్రాలలో తెలుగులో ముందు నిర్మించిన 'ప్రేమనగర్' ఒకటి. 'ప్రేమనగర్' కథను 'వసంతమాళిగై' (వసంత భవనం) పేరిట తమిళంలో నిర్మించారని 16-31 జులై 2003 'హాసం'లో ఇదివరకు ఒకసారి ప్రస్తావించుకొన్నాము. తెలుగు చిత్రంలో పాటల లాగానే తమిళ చిత్రంలోని పాటలు కూడా విశేషమైన ఆదరణ పొందాయి.

'ప్రేమనగర్ ' చిత్రంలోని పాటలలో 'ఎవరికోసం' పాట ఎంతో ప్రత్యేకమైనది. చిత్రంలో ఆ సన్నివేశం నేటికీ కొత్తగా అనిపించడానికి - ఆత్రేయ రాసిన ఆ పాట, కె.వి. మహదేవన్ స్వరకల్పన, ఘంటసాల గానం, అక్కినేని నాగేశ్వరరావు నటన అన్నీ కారణాలే.

ఘంటసాల, నాగేశ్వరరావు కోసం పాడిన అజరామర గీతాలలో ఈ పాటకు ఓ ప్రత్యేకమైన స్థానం ఉంది.

ఇటీవల హైద్రాబాదులో ప్రముఖ సంగీత దర్శకులు ఎం.ఎస్.విశ్వనాథన్ గారికి ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం గారు గురుపూజ నిర్వహించారు. ఆ ఉత్సవంలో పాల్గొన్న అక్కినేని నాగేశ్వరరావుగారు తమ చిత్ర జీవిత విజయంలో తమ కృషి నూటికి యాభై శాతమైతే తక్కిన యాభై శాతంలో ఇరవై ఐదు శాతం ఘంటసాలదనీ తక్కిన ఇరవై ఐదుశాతం సంగీత దర్శకులదనీ పేర్కొన్నారు.

నాగేశ్వరరావుగారి చలన చిత్ర జైత్రయాత్రలో 'ఎవరికోసం' పాటది ప్రత్యేకమైన స్థానం. తేలిక మాటలతో ఆత్రేయ రాసిన బరువైన ఆపాట చాలా మందికి తెలిసిందే.

ఎవరికోసం ఎవరికోసం
ఈ ప్రేమ మందిరం
ఈ శూన్య నందనం
ఈ భగ్న హృదయం
యీ అగ్ని గుండం
ఎవరికోసం ఎవరికోసం ఎవరికోసం ॥ఎవరికోసం॥
ప్రేమభిక్ష నువ్వే పెట్టి...
ఈ పేద హృదయం - పగుల కొట్టి
పిచ్చివాణ్ణి పాత్ర లేని బిచ్చగాణ్ణి చేశావు
నువ్వివ్వనిది దాచలేదు
ఇంకెవ్వరినీ అడుగ లేను
బ్రతుకు నీకు ఇచ్చాను
చితిని నాకు పేర్చావు ॥ఎవరికోసం॥
ఓర్వలేని ఈ ప్రకృతి
ప్రళయంగా మారనీ
నా దేవిలేని ఈ కోవెల
తునా తునకలై పోనీ
కూలిపోయి ధూళిలో కలిసిపోనీ
కాలిపోయి బూడిదై మిగలనీ... ॥ఎవరికోసం ॥
మమత నింపమన్నావు

మనసు చంపుకొన్నావు
మధువు తాగనన్నాను
విషం తాగమన్నావు
నీకు ప్రేమంటే నిజం కాదు
నాకు చావంటే భయం లేదు
నీ విరహంలో బ్రతికాను
ఈ విషంతో మరణిస్తాను ॥ఎవరికోసం॥

నాయకుడు నాయిక పట్ల తనకున్న ప్రేమకు గుర్తుగా ఒక ప్రేమ మందిరాన్ని నిర్మించాడు. కొన్ని విపరీత పరిస్థితులకు తల ఒగ్గి నాయిక నాయకుడిని కాదన్నది. ఆమె తన స్థితిని నాయకుడికి చెప్పే స్థితిలో లేదు. ఆమె ప్రేమ కోసం తన తీరును మార్చుకొని ఆమే తన సర్వస్వం అనుకొన్న నాయకుడికి తీవ్రమైన సంతాపం కలిగింది.

ఆమె కోసం తాను నిర్మించింది ఆ ప్రేమ మందిరం. ఆ కోవెలలో ఆమె దేవి. ఆమె రానన్న తరువాత ఆ మందిరానికి విలువలేదు. ఆ మందిరం శూన్యనందనమై అతని భగ్నహృదయం అగ్నిగుండమైంది. అతనికి ఆమె ప్రేమభిక్ష పెట్టింది. కానీ అకస్మాత్తుగా మారిపోయింది. నాయిక తనను కాదనడంతో నాయకుడి పేద గుండె పగిలిపోయింది. దాంతో అతడు పిచ్చివాడూ, భిక్షా పాత్రలేని బిచ్చగాడు అయ్యాడు.

ఆమె ఒక్కతే అతణ్ణి ఆకర్షించింది. అందువల్ల అతను తన బతుకునే ఆమెకు అర్పించాడు. అందుకు ప్రతిగా ఆమె అతనికి చింతల చితిని మిగిల్చింది.

బహుశా వాళ్ల ప్రణయాన్ని చూసి ప్రకృతి ఓర్వలేక పోయిందేమో! బహుశా అతని బాధను చూసి ఓర్వలేక ప్రకృతి కూడా ప్రళయంగా మారుతున్నట్టుంది. ఆ ప్రళయంలో ఏమయినా గ్రహించే స్థితిలో లేడు ఆ నాయకుడు. తన దేవి లేని కోవెల ఉన్నా లేకున్నా అతనికి ఒకటే.

తనకు మమత పంచిన ప్రేయసి మనసు చంపుకున్నదనీ ఆమెకు ప్రేమంటే నిజం కాదనీ అనుకొంటున్న నాయకుడు మరణాన్ని నిర్భయంగా ఆహ్వానించే స్థాయికి చేరుకున్నాడు.

తన ప్రేయసి లేకపోయిన తర్వాత తన ప్రేమ మందిరం ఎవరికోసం అనుకున్నాడు.

'ప్రేమనగర్' కథతో రూపొందించిన తమిళ చిత్రం 'వసంతమాళిగై' లోనూ ఈ సన్నివేశంలో పాట ఉంది. తెలుగు గీతం ఒరవడిలోనే తమిళ గీతం సాగింది. అయితే తమిళగీతం సంగీత రచన తెలుగుపాట బాణీ నుంచి కొంత భిన్నంగా సాగింది. పాటలోని సాహిత్యం కూడా కొంత భిన్నంగానే కనిపిస్తుంది.

కణ్ణదాసన్ రాసిన పాటను కె.వి. మహదేవన్ సంగీత దర్శకత్వంలో టి.ఎం.సౌందరరాజన్ పాడారు. తమిళ చిత్ర కథానాయకులు శివాజీగణేశన్.

కణ్ణదాసన్ రాసిన ఆపాట ఇది.

యారుక్కాగ - ఇదు
యారుక్కాగ
ఇంద మాళిగై వసంద మాళిగై
కాదల్ ఓవియం కలైంద మాళిగై
వ: కాదలే...పో పో..శాదలే... వా..వా.
1. మరణంమెన్నుం తూదు వందదు - అదు
మంగై యెన్నుం వదివిల్ వందదు
సొర్గమాగ నాన్ నినైత్తదు ఇంద్రు
నరగమాగ మాఱి విట్టదు ॥యారు॥
2. మలరైత్తానే నాన్ పఱిత్తదు -కై
ముళ్ళిన్ మీదు ఏన్ విళుందదు
ఉఱవైత్తానే నాన్ నినైత్తదు - ఎన్నైప్పిరివు
వందు ఏన్ అళైత్తదు?
వ: ఎళుదుంగళ్ ఎన్ కల్లఱైయిల్
అవళ్ - ఇరక్క మిల్లాదవళ్ ఎంద్రు
పాడుంగళ్ ఎన్ కల్లఱైయిల్
ఇవన్ - పైత్తియక్కారన్ ఎంద్రు
3. కణ్‌గళ్ తీట్టుం కాదల్ ఎన్బదు - అదు
కణ్ణిల్ నీరై వరవళైప్పదు
పెణ్‌గళ్ కాట్టుం అన్బు ఎన్బదు -నమ్మై
ప్పిత్తనాక్కి అలైయ వైప్పదు ॥యారు॥
4. ఎంగిరుందు సొందం వందదు- ఇంద్రు
ఎంగిరుందు నంజు వందదు
అంగిరుందు ఆట్టుగింద్రవన్ - దినం
ఆడుగింద్ర నాడగం ఇదు ॥యారు॥



**ఈ పాట చెప్పే భావాలు ఇవి :**
ఎవరికోసం - ఇది ఎవరికోసం
ఈ భవనం (ఈ) వసంత భవనం
ప్రేమ చిత్రం చెరిగిన భవనం
వ ప్రేమా పో పో మరణమా రారా
మరణమే సందేశం వచ్చింది- అది
మగువ అనే రూపంలో వచ్చింది
స్వర్గమని నేను అనుకొన్నది నేడు
నరకంగా మారింది ॥ఎవరికోసం॥
పువ్వునే కదా నేను అందుకొన్నది (కనుగొన్నది)
చేయి -ముల్లుమీద ఎందుకు పడింది ?
బంధాన్నే కదా నేను కోరుకున్నది
ఎడబాటు వచ్చి ఎందుకు పిలిచింది?
వ రాయండి నా సమాధి మీద
ఆమె కరుణలేనిదని
పాతండి నా సమాధి చెంత
నేను పిచ్చివాడినని...
కన్నులు దిద్దే ప్రేమ
కన్నుల్లో నీళ్లు నింపుతుంది
స్త్రీలు చూపించే అనురాగం
మనల్ని పిచ్చివాళ్లను చేస్తుంది ॥ఎవరికోసం॥
ఎక్కడనుంచి సొంతం (బంధం) వచ్చింది
నేడు ఎక్కడినుంచి విషం వచ్చింది ?
అక్కడి నుంచి ఆడించేవాడు - నిత్యమూ
ఆడే నాటకం ఇది ॥ఎవరికోసం॥

తెలుగు పాటలో ఆవేదన సూటిగా ఉంది. తమిళగీతంలో ఆవేదన కొంత పరోక్షంగా ఉన్నట్టు అనిపిస్తుంది. తెలుగు పాట మధ్య వచన భాగాలు లేవు. తమిళ గీతంలో నాటకీయత కోసం తెలుగు పాటలో లేని వచనాలు ఉన్నాయి. ఈ వచనాలు లేకుండానే తెలుగు పాట తన ప్రయోజనాన్ని సాధించ గలిగింది. తమిళ గీతం తెలుగు పాట పల్లవితో మొదలైనా తనదైన భావాలతో సాగిపోయింది.




తెలుగు పాటలో నాయకుడు నాయిక గురించి మాత్రం తన అభిప్రాయాలు చెబుతుండగా తమిళ గీతంలో నాయకుడు స్త్రీ లందరి గురించీ అభిప్రాయాలు చెబుతున్నట్టు కనిపిస్తుంది.

స్త్రీలు కళ్లకు కాటుక దిద్దుకోవడం పరిపాటి. ఆ కాటుక కళ్ల ప్రేమను దిద్దినపుడు కన్నీళ్ల వస్తాయంటారు కణ్ణదాసన్. కాటుక పెట్టుకొంటూ ఉండగా కళ్లలో నీళ్ల తిరుగుతాయి. కళ్లతో మొదలయిన ప్రేమ కన్నీళ్లకు దారి తీసిందన్న అభిప్రాయాన్ని కణ్ణదాసన్ చెప్పిన పద్ధతి ఇది !

'కల్లఱై' అంటే సమాధి. మనసూ, ప్రేమ మందిరమూ రెండు భగ్నమైన ఆ ప్రేమికుడు తన సమాధి మీద ఏం రాయాలో అక్కడ ఏం పాడాలో చెబుతున్నట్టున్న వచనాన్ని సౌందరరాజన్ తమకే ప్రత్యేకమైన ధోరణిలో వినిపించారు. తెలుగు పాటలో ఈ సమాధి ప్రస్తావనలేదు.

సహజంగానే పాత తమిళ చిత్రాలలో నటనలో 'అతి ' ధోరణి కనిపిస్తుంది. 'యారుక్కాగ'పాటను పాడిన తీరులోను ఆ పాటను అభినయించిన తీరులోను 'అతినాటకీయత' కనిపిస్తుంది. తెలుగు పాటలోని అవధులు మీరని నాటకీయత పాటకు అందాలు దిద్దింది.

'యారుక్కాగ' పాట తమిళ సంగీత ప్రియులకు ఇష్టమైన పాటలలో ఒకటి కావడానికి దాని నాటకీయత కలిసివచ్చింది. ఆ పాట ప్రాచుర్యానికి మరొక గుర్తు ఏమిటంటే- ఆ తర్వాత వచ్చిన ఒక తమిళ చిత్రంలో మనోరమ 'యారుక్కాగ' అంటూ ఓ హాస్యగీతం పాడడం!

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

జస్ట్ ఫర్ ఫన్

# బాధ్యతలు - పంపకాలు

"మేం . 'అందరి టీ.వీ' వాళ్లం, భార్యా- భర్తలు... బాధ్యతలు -పంపకాలు అన్న అంశం మీద ఇంటర్వ్యూ చేయడానికి వచ్చాం. మీరు ఇంటియజమానిగా భాధ్యతలనెలా పంచుకుంటారో చెప్పగలరా?" అడిగారు ఆనందరావుని.

"బాధ్యతలు-పంచుకోవటం-అంటే"

"ఏముంది ! ఇంటిపనులు - బయటిపనులు"

"ఇంటి బయటి పనులు -నేనే చేస్తాను".

"అంటే అడిగింది బృందంలో 'యాంకరిణి'

"నా బట్టలు ఉతుక్కోవడం, ఇస్త్రీ చేసుకోవడం'

"వెరీ నైస్... మీరే చేస్తారా ఆ పనులు!"

" ఇంకా వంట గిన్నెలు తోమడం....."

"ఆ పనీ మీరే చేస్తారా?"

"అవును మరి వంట నేనే చేస్తాను కదా"



"అయితే మీకు పెళ్లయిందన్నమాట! ఇంతకీ మీ ఆవిడ మీతో కాపురం చేస్తోందా?"

"ఇద్దరం కలిసే ఉంటాం"

"మరైతే ఆమె చేసే పనులు?"

" ఎప్పుడెప్పుడేమేమి పనులు ఎలా చెయ్యాలో అన్నీ చెప్పి చేయిస్తుంది"

"ఏ పనీ చేయకుండా ఉంటే ఆమెకేమైనా తోచాలి కదా!"

"తోచడానికేముంది? టీవీ ఉంది, ఇంకా ఆమె పనులామెకున్నాయి"

"ఆమె పనులంటే?"

"బట్టల షాపులకు, ఒబేసిటీ సెంటర్‌కు వెళ్లిరావడం. ఫోన్లు ఎటెండ్ అవడం."

"షాపింగ్‌కి మీరు వెళ్లరా?"

"నాకెలా అవుతుందండి? నే ఆఫీసుకి వెళ్లాలిగా... లేకపోతే స్టాఫ్ సరిగా పనిచేయరు"

"థ్యాంక్సండి. చాలా విషయాలు చెప్పారు వస్తాం."

**- జయంతి వెంకటరమణ, పెందుర్తి.**

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం





హస్రత్ జయపురీ అనగానే శంకర్ -జైకిషన్ పేరు కూడా వెను వెంటనే గుర్తొస్తుంది. అంత మాత్రాన హస్రత్ ఇతరులకు రాయలేదని కాదు. సి.రామచంద్ర సంగీత దర్శకత్వంలో 'అనార్కలి' చిత్రంలో అందించిన 'యే జిందగీ ఉసీకీ హై' వంటి అమర గీతాలు, ఎస్.డి.బర్మన్ సంగీతంలో 'తేరే ఘర్ కే సామ్ నే' చిత్రంలో అన్ని పాటలనూ, వసంత్ దేశాయ్ సంగీతంలో 'ఝనక్ ఝనక్ పాయల్ బాజే' లో 'నైన్ సే నైన్ నాహీ మిలావో' వంటి అద్భుతమైన పాటలు మరిచిపోగలమా? అయినా, అతని సంపూర్ణ సాహిత్య వ్యక్తిత్వం వికసించింది మాత్రం శంకర్ -జైకిషన్‌ల సాంగత్యంలోనే. దిల్ ఏక్ మందిర్ (దిల్ ఏక్ మందిర్ హై) సూరజ్ (బహారో ఫూల్ బర్సావో) జబ్ ప్యార్ కిసీ సే హోతాహై , (తేరీ జుల్ఫోం సే జుదాయి తో నహీ మాంగీ థీ) ససురాల్ (తేరీ ప్యారీ ప్యారీ) మేరే హుజూర్ '(గమ్ ఉఠానే కేలియే మై తో జియే జావుంగా) బ్రహ్మచారి (మై గావూ తుమ్ సోజావో) వంటి సినిమాల్లో అతని గీత రచన అపూర్వం. బహారో ఫూల్ బర్సావో పాటకు ఫిల్మ్ ఫేర్ పురస్కారం కూడ లభించిందతనికి. సరళమైన శైలిలో, సన్నివేశానికి అనుగుణంగా, నాటకీయతను పోషిస్తూ గీతం రచించడం హస్రత్ శైలిలోని ప్రత్యేకత. హస్రత్ అజరామర గీతాల్లో ఒకటైన పగ్లా కహీకా లోని 'తుమ్ ముఝే యూ భులాన పావోగే'ని గురించి ఈ సంచికలో...

**తుమ్ ముఝే యూ- భులాన పావోగే**
**తుమ్ ముఝే యూ- భులాన పావోగే**
**జబ్ కభీ భీ సునోగే గీత్ మేరే -**
**సంగ్ సంగ్ తుమ్ భీ గున్ గునావోగే, హో ॥తుమ్॥**
**వో బహారే వో చాంద్‌నీ రాతే**
**హమ్‌నే కీథీ జో ప్యార్ కీ బాతే**
**వో బహారే వో చాంద్‌నీ రాతే**
**హమ్ నే కీథీ జో ప్యార్ కీ బాతే**
**ఉన్ నజారోంకీ యాద్ ఆయేగీ**
**జబ్ ఖయాలోం మే ముఝుకో లావోగే హో ॥ తుమ్॥**
**మేరే హాథోంమే తేరా చెహ రా థా**
**జైసే కోయి గులాబ్ హోతా హై**
**మేరే హాథోం మే తేరా చెహరా థా**
**జైసే కోయి గులాబ్ హోతా హై**
**ఔర్ సహారా లియాథా బాహోంకా**
**వో సమా కిస్ తర్హా భులావోగే హో ॥ తుమ్॥**
**ముఝ్ కో దేఖే బినా కరార్ న థా**
**ఏక్ ఐసా భీ దౌర్ గుజరా హై**
**ముఝ్ కో దేఖే బినా కరార్ న థా**
**ఏక్ ఐసా భీ దౌర్ గుజరా హై**
**ఝూట్ మానోతొ పూచ్ లో దిల్ సే**
**మై కహూంగా తో రూఠ్ జావోగే హో ॥తుమ్॥**

షమ్మీకపూర్, ఆశా పరేఖ్ నాయికా నాయకులుగా, హెలెన్ ఒక విశిష్ట నాయికగా కనిపించే ఈ చిత్రంలో ఈ పాట కనీసం 5సార్లు వినిపిస్తుంది. ఇది రఫీ, లతా ఇద్దరూ వేర్వేరుగా పాడిన పాట. కథా ప్రారంభంలో రఫీ పల్లవి మాత్రమే వస్తుంది. తర్వాత పూర్తి పాట, మరోసారి లతా పూర్తిపాట, ఇంకోసారి లతాపాట సగం రాగా, రఫీ అందుకున్నట్టు వస్తుంది. చిట్టచివర నాయికా నాయకులు కలుసుకున్నప్పుడు నేపథ్యంలోనూ ఈ పాటను వినగలుగుతాం. అంటే, ఇది సంపూర్ణమైన థీమ్ సాంగ్. లతా, రఫీ ఇద్దరి సైడ్‌ల లోనూ మూడేసి చరణాలుండి, రెండు సన్నివేశాలకూ కథలో

చిత్రం

గీత రచయిత

సంగీతం

గానం

అభినయం

తగినంత ప్రాముఖ్యం ఉన్నప్పటికీ, రఫీ పాడిన పాటే సూపర్ హిట్టయింది. చాలా మంది శ్రోతలకు ఇది లతా సైడ్ ఉన్నట్టు కూడా తెలీదంటే అతిశయోక్తి కాదు. ఆ రోజుల్లో బినాకా గీత్ మాలా లో ఈపాట టాప్‌లో ఉన్నప్పుడు కూడా ఎప్పుడూ రఫీ పాడిందే వినిపించేవారు. రఫీ చనిపోయినపుడు రాసిన ప్రతి వ్యాసమూ ఈ పాటను విధిగా ప్రస్తావించింది. దానికి ముఖ్యకారణం ఈ పాట రెండో పాదం. 'జబ్ కభీ భీ సునోగే గీత్ మేరే, సంగ్ సంగ్ తుమ్ భీ గున్ గునావోగే'. హస్రత్ ఈ రకంగా రఫీ నిశానీ లా పనికి వచ్చిన ఒక అపురూపమైన గీతాన్ని ఈ పాట ద్వారా అందించాడు.

సన్నివేశంలో కనిపించేది షమ్మీ కపూర్, ఆశాపరేఖ్, కానీ షమ్మీ పాడుతున్నది ఆశాను ఉద్దేశించి కాదు. తను ప్రేమించిన హెలెన్ తో తను అన్న మాటలు గుర్తు తెచ్చుకుంటూ, ఆ విషయాన్ని తనకు చికిత్స చేస్తున్న మానసిక నిపుణురాలు ఆశాతో చెబుతున్న సన్నివేశమిది.

పల్లవి : భులానా అంటే మరిచిపోవడం; భులానో పావోగే మరిచిపోలేవు, గున్ గునా అంటే శ్రుతి కలపడం. పాడడం. సంగ్ సంగ్- అంటే (నాతో ) కూడా నీవు నన్ను అంత సులువుగా మరిచిపోలేవు.

నా పాట విన్నప్పుడల్లా -నాతో పాటు పాడితీరుతావు

1. బహార్ అంటే వసంతం: చాంద్‌నీ అంటే వెన్నెల, నజారే అంటే పరిసరాలు, ఆ దృశ్యాలు, యాద్ ఆయేగీ అంటే గుర్తు రావడం, ఖయాల్ అంటే జ్ఞాపకం

**ఆనాటి వసంతం, ఆ వెన్నెల రాత్రులు**
**మనిద్దరి మధ్య ప్రియ సంభాషణలు (ప్యార్ కి బాతే)**
**ఆ దృశ్యాలు గుర్తుకు వస్తాయి.**
**నేను నీ జ్ఞాపకంలో అడుగిడినపుడల్లా ॥నీవు॥**

2. చెహరా అంటే ముఖం: సహారా అంటే ఆధారం, ఆసరా, బాహోంకా అంటే చేతుల, సమా అంటే ఋతువు లేదా రోజులు, కిస్ తర్హా అంటే ఎలా?

**నా చేతుల్లో నీ ముఖం; విచ్చిన గులాబీలా ఉండేది**
**నా చేతులే నీ ఆధారంగా అందుకున్నావు**
**అలాంటి రోజుల్ని ఎలా మరిచిపోగలవు? ॥నీవు॥**

3. దేఖే బినా అంటే చూడక పోతే, కరార్ అంటే శాంతి, దౌర్ అంటే కాలం, గుజర్ నా అంటే గడవడం, ఝూట్ మానో అంటే అబద్ధం అని భావిస్తే, రూఠ్ జావోగే అంటే అలుగుతావు.

**నన్ను చూడకపోతే అశాంతి పాలయ్యేదానివి;**
**అలాంటి కాలం కూడా ఒకటుండేది;**
**ఇది అబద్ధమనుకుంటే -నీ మనసునే అడుగు**
**నేను చెప్తే, మళ్ళీ అలిగి కూర్చుంటావు ॥నీవు॥**

చిత్రంలో ఈ పాట సాధించే ప్రయోజనం మరొకటుంది. ప్రేమ గురించి ఎప్పుడూ ఆలోచించని ఆశా పరేఖ్ ప్రేమికుల మధ్య అనుబంధం ఇలా వుంటుందని అర్థం చేసుకోడానికి ఈ పాట ఆధారమవుతుంది. పాటలోని సాహిత్యంలో ఒక చమత్కారం ఉంది. నిజానికి షమ్మీకపూర్‌కు హెలెన్ పదే పదే గుర్తుకు వస్తోంది. కానీ తనే ఆమెకు గుర్తు వస్తాడు అన్నట్లుగా పాడతాడు. 'నువ్వు నన్ను మరిచిపోలేవు' అని ఆమెను దబాయిస్తున్నాడు. ఈ పాట నిజానికి అతను ఇప్పుడు తొలిసారి పాడడం లేదు. ఇదివరకే హెలెన్‌తో ఇలా అన్నాను అని ఆశా పరేఖ్ కు చెబుతున్నాడు. (సినిమాలో మొదటిసారి అతను హెలెన్ ఎదుట ఈ పాట పాడినపుడు పల్లవి మాత్రమే వస్తుంది) అతని ప్రేమలోని స్వచ్ఛతకు, ఒక హోటల్‌లో గాయకుడిగా పనిచేసే అతనికి పాటతోనూ, ప్రేమతోనూ ఉన్న అనుబంధానికి కవి చక్కని రూపకల్పన ఈ పాట ద్వారా చేశాడు. అందుకే ఇది అతని థీమ్ సాంగ్ అయింది.

షమ్మీ కపూర్‌కు నిజంగానే మతి చలించి అతను గతాన్ని, ఆశా పరేఖ్‌ను పూర్తిగా మర్చిపోయినపుడు, అతనికి తన అస్తిత్వాన్ని గుర్తుచేయడానికి 'ఆ రోజు నువ్వు ఈ పాట నాకు పాడి వినిపించావు' అని చెబుతూ ఆశా పాడే సన్నివేశంలో లతా పాట వస్తుంది. అయితే, అతను పాడిన సాహిత్యాన్ని ఆమె వినిపించదు. అదే రాగంలో తన మనోభావాలను ప్రకటిస్తుంది. ఎందుకంటే, అతను పాడే సమయానికి ఆమెకు అతని పట్ల ఏ భావమూ లేదు. కానీ అతనికి గతాన్ని గుర్తుకు తెచ్చే సమయానికి అతన్ని తను ప్రేమించడం ప్రారంభించింది. అందుకే లతా పాడే పాటలో సాహిత్యంలో మరింత వేదన ఉంటుంది. రెండింటికీ పల్లవి ఒకటే. చరణాలు వేరు.

మొదటి చరణం :

**బీతీ బాతోంకా కుచ్ ఖయాల్ కరో - కుచ్ తో బోలో కుచ్ హమ్ సే బాత్ కరో**
**బీతీ బాతోంకా కుచ్ ఖయాల్ కరో - కుచ్ తో బోలో కుచ్ హమ్ సే బాత్ కరో**
**రాజె దిల్‌మే తుమ్హే బసాదూంగీ - మై తుమ్హారీ హూ మాన్ జావోగే ॥హో తుమ్॥**

బీతీ బాతే అంటే గడిచిపోయిన మాటలు -ఖయాల్ జ్ఞాపకం

రాజ్ అంటే రహస్యం- ఇక్కడ రాజె దిల్ అంటే మనసు లోపల్లోపల అనుకోవచ్చు. బసానా అంటే నిలుపుకోవడం -మాన్ జావోగే అంటే ఒప్పుకుంటావా

**గడిచిపోయిన విషయాలు గుర్తు తెచ్చుకో**
**ఏదైనా మాట్లాడు -నాతో కొంచైనా మాట్లాడు**
**నా మనసు లోగిలిలో నిన్ను నిలుపుకుంటాను**
**నేను నీ దాన్ని -అంటే అంగీకరిస్తావా? (స్వీకరిస్తావా?) ॥నీవు॥**

**2. మేరీ ఖామోషియోంకో సమ్‌ఝో -జిందగీ యాద్ మే గుజారీ హై**
**మై మిటాహూ తుమ్హారీ చాహత్ మే -ఔర్ కిత్ నా ముఝే మిటావోగే ॥నీవు॥**

ఖామోషీ అంటే నిశ్శబ్దం, మౌనం. యాద్ మే గుజర్ నా అంటే జ్ఞాపకాల్లో జీవించడం, మిటాహూ అంటే నాశనమైపోవడం-చాహత్ అంటే ప్రేమ

**నా మౌనాన్ని అర్థం చేసుకో - జీవితం నీ జ్ఞాపకాల్లో గడిచిపోతోంది**
**నీ ప్రేమలో నేను సర్వ నాశనమయ్యాను**
**ఇంకా ఎంత బాధ పెడ్తావు నన్ను ? ॥నీవు॥**

**3. దిల్ హీ దిల్ మే తుమ్హీసే ప్యార్ కియా - అప్ నీ జీవన్ కో భీ నిసార్ కియా**
**దిల్ హీ దిల్ మే తుమ్హీసే ప్యార్ కియా - అప్ నీ జీవన్ కో భీ నిసార్ కియా**
**కౌన్ తడపా తుమ్హారీ రాహో మే - జబ్ యే సోచోగీ జాన్ జావోగే ॥హో తుమ్॥**

దిల్ హీ దిల్ మే అంటే మనసు లోలోపలే, నిసార్ అంటే అంకితం చేయడం, ధారపోయడం. తడప్ నా అంటే తపించిపోవడం. జాన్ జావోగే అంటే తెలుసుకుంటావు.

**మనసు లోలోపలే నిన్ను ప్రేమించాను**
**నా జీవితాన్ని సైతం ధారపోశాను**
**నీ మార్గంలో తపిస్తున్నదెవరు అని**
**ఎప్పుడైనా ఆలోచిస్తే నీకే తెలుస్తుంది ॥నీవు॥**

కథానాయికలో అతని పట్ల ప్రేమ ఉదయించింది. కానీ అతను మరొకర్ని ప్రేమిస్తున్నాడని తెలుసు. మరో వైపు అతనికి గతం గుర్తు రావడంలో చేయూతనివ్వడం అతని డాక్టర్‌గా తన బాధ్యత. ఈ పాట రాగం వినగానే అతనికి తన అస్తిత్వం, గతం గుర్తు రావాలని ఆమె ఆశ. అదే సమయంలో తన ప్రేమను ప్రకటించడానికి కూడా ఇదే అవకాశం. అందుకే ప్రేమను ప్రకటిస్తోంది. కానీ తనది ఫలించని ప్రేమ. ఆ సంఘర్షణ అంతా అతి తక్కువ మాటల్లో 'ఖామోషీ', 'దిల్ హీ దిల్ మే', 'తడప్ నా', 'రాజె దిల్ 'వంటి ప్రయోగాలతో అద్భుతంగా ఆవిష్కరించాడు హస్రత్ జైపురీ.

ఒకే రాగంలో రెండు వేర్వేరు సన్నివేశాలకు తగిన సాహిత్యాన్ని కల్పించి, రెండు రకాల మూడ్స్‌ని సృష్టించడంలో హస్రత్ పూర్తిగా కృతకృత్యులయ్యారు. ఈ పాట ప్రాచుర్యం ఎంతటిదంటే, పగ్లా కహీకా చిత్రం పేరు చెప్పగానే ఎవరికీ షమ్మీ కపూర్ గానీ, శక్తి సామంత్ గానీ, ఆశా పరేఖ్ గానీ గుర్తురారు. 'తుమ్ ముఝే యూ' పాటే గుర్తొస్తుంది. మాధుర్యానికి మారుపేరుగా ఉండే రఫీ స్వరంలో, లతా కంఠంలో ఈ సాహిత్యం ఎలా ప్రాణం పోసుకుందో తెలియాలంటే, ఈ పాటను పదే పదే వినాలి.

**- మృణాళిని**



"రాబోయే దీపాళి పండుగకి మా ఆవిడ మూడువేల రూపాయల వట్టుచీరకి టెండర్ పెట్టింది. కోపమొచ్చి చెడామెడా తిట్టిపారేశాను!" అన్నాడు కుమార్.
"ఏంటి?...మీ ఆవిడనే ?........".ఆశ్చర్యపోతూ అడిగాడు స్నేహితుడు.
"అబ్బే కాదు నరకాసురుడిని..." కూల్‌గా చెప్పాడు కుమార్.



"మీ ఆఫీసులో గడియారమే లేదు కదా..... ఎలా అడ్జస్టవుతున్నారు"
"అదా.. చాలా సింపుల్.. మా మేనేజర్ గారు ఆఫీసులోకి అడుగు పెడితే సమయం పది. క్యాషియర్ కౌంటర్లో కూర్చుంటే సమయం పదిన్నర. టైపిస్టు వారపత్రిక మూసి డ్రాయర్ సొరుగులో పెట్టిందంటే 'లంచ్'టైమ్. అకౌంటెంట్ సిగరెటు వెలిగించాడంటే 'టీ' టైము. హెడ్‌క్లర్క్ నిద్ర మొహాన్ని కడుక్కోడానికి లేచెళ్ళారంటే కరెక్టుగా ఆఫీసు ముగిసే టైము- సమయం అయిదుగంటలు !ఫినిష్!!"



"మీ ఆఫీసులో పనిచేసే చలపతి ఎక్కడున్నాడండి?" అడిగాడు వేణు సీరియస్‌గా పనిచేసుకుంటున్న వ్యక్తిని.
"అలాంటి వారెవరూ లేరే ఇక్కడ !" అన్నాడా వ్యక్తి.
"లేరంటారేం.... అదిగో ఆ సీట్లో కూర్చుని కునికిపాట్లు పడుతున్నవాడే మా చలపతి!"
"అలా చెప్పండి! 'పనిచేసే చలపతి' అంటే అందుకే కనుక్కోలేకపోయాను సారీ! " నొచ్చుకుంటూ సమాధానమిచ్చాడా వ్యక్తి.



"నన్ను కష్టపెడతానని ప్రతిజ్ఞ చేసి పుట్టింటికెళ్ళావుగా. మళ్ళీ ఎందుకొచ్చావు?" భర్త అడిగాడు భార్యని.
"నేనక్కడ వుంటే నీవిక్కడ ప్రశాంతంగా వుంటావు. అందుకే వెంటనే తిరిగి వచ్చేశా" చెప్పింది భార్య.

**ఈ జోకులను పంపించిన వారు: మామిడి రాధ,చెన్నై.**



రోడ్డుపై ఒక పెద్దమనిషి దర్జాగా వెళ్తుంటే ఒక బిచ్చగాడు ధర్మం చేయమని అడగగానే అతడు ఓ అర్ధరూపాయి తీసివేశాడు.
ముష్టివాడు : ఏంటి బాబు నీ కంటికి ఎలా కనపడుతున్నాను? నేను ముష్టి సంఘం అధ్యక్షుణ్ణి. పది రూపాయాలకు తక్కువ తీసుకోను.
పెద్దమనిషి : నేను పినాసి సంఘం అధ్యక్షుణ్ణి అర్ధరూపాయి కంటే ఎక్కువ వేయను.



లెక్కల మాష్టారు :-
ఒరే వేణూ నా దగ్గర పది గేదెలు ఉన్నాయనుకో అందులో ఓ అయిదు గేదెల్ని నీకిస్తే ఏమవుతుంది?
వేణు : నేను స్కూల్ మానేసి వాటిని మేపాల్సొస్తుంది సార్.



రాధా, సుజాత, మాధవి ఇరుగు పొరుగున ఉంటారు. ఓరోజు రాధ సుజాతతో ఏదో మాట్లాడి వెళ్లగానే వెంటనే మాధవి వచ్చి "ఏవిటి విషయం?" అని అడిగింది.
"ఈ రాధకు ఎప్పుడూ గొప్పలు చెప్పుకోవడం తప్ప వేరే పనేముంటుంది?" అంది సుజాత.
"ఇవాళేం చెప్పిందేంటి?"
"వాళ్ల కోడి ఓ గుడ్డును పెట్టిందట. దాన్ని ఈవిడ స్కానింగ్ తీయించిందట..... డాక్టర్ పుంజు అని చెప్పాడట."

**ఈ జోకులను పంపించిన వారు: ఎ.భాస్కర్ బాబు, హనుమకొండ.**



"ఒరేయ్ రఘు... ఈరోజు.. పది మంది అమ్మాయిలకు కన్ను కొట్టాను" గర్వంగా చెప్పాడు మదన్.
"నిజమా ! ఎవరూ ఏమీ అనలేదా?" ఆశ్చర్యంగా అడిగాడు రఘు.
"అస్సలేం అన్లేదు"
"ఆశ్చర్యంగా ఉందే....! ఎంతైనా నీవు చాలా ధైర్యవంతుడివిరా......!"
"ఇందులో ఆశ్చర్యపోవడానికి ఏముంది? నల్లకళ్ళజోడు పెట్టుకుని కన్ను కొట్టడానికి కూడా ధైర్యం కావాలేంటి" అంటూ అసలు విషయం చెప్పాడు మదన్.



"మనబ్బాయి ప్రేమలో పడ్డాడేమోనని.... అనుమానంగా ఉందండి"...భర్తతో చెప్పింది... అలివేలు.
"నీ కెందుకొచ్చిందా అనుమానం" అడిగాడు భర్త.
" ఈ మధ్య కాలేజీకి రెగ్యులర్‌గా వెళ్తుంటేను..."

షూటింగ్ గ్యాప్‌లో కుర్చీలో కూర్చుని ఉన్న హీరోయిన్‌తో ఓ అభిమాని కలిసి....... "మేడమ్...నేను మీ అభిమానిని. నిన్నరాత్రి మీతో డ్యూయెట్ పాడినట్లు కలవచ్చింది" అంటూ చెప్పాడు ఎంతో ఆనందంగా.



"సంతోషం.. .సాధారణంగా ఐటెమ్‌సాంగ్‌కి లక్ష రూపాయిలు తీసుకుంటాను. మీరు నా అభిమాని గాబట్టి.... మీతో డ్యూయెట్ సాంగ్ చేసినందుకు...ఏభై వేలు ఇవ్వండి చాలు" అందా హీరోయిన్ గారాలు పోతూ.

తొలిరేయి ...
"మనం భార్య భర్తలమైనా... ఈ రోజునుండి ఫ్రెండ్స్‌లా ఉండాలి ... సరేనా" అన్నాడు వరుడు ఎంతో మురిపెంగా.
"అలాగే రా...!" అంది వధువు విత్ ఇమ్మీడియట్ ఎఫెక్ట్.



**ఈ జోకులను పంపించిన వారు: వేంద్ర స్వాతి తేజస్వి, హైద్రాబాద్.**



ఓ ప్రియుడు తన ప్రేయసితో అర్థరాత్రి వేళ రహస్యంగా రైల్వేస్టేషన్‌కి పారిపోయి వచ్చేశాడు.. ఆటోవాలాకి డబ్బులివ్వబోయాడు.
"మీరెందుకు సార్ మళ్ళీ కిరాయి ఇస్తున్నారు? ఇందాకా ఈ అమ్మాయి నాన్నగారు నాకు ఇంటిదగ్గరే ఇచ్చేసారు మీ కంటపడకుండా" అన్నాడు ఆ ఆటోవాలా నిజాయితీగా!

"ఏరా నిన్న సినిమాకి వెళ్ళావంట కదా ! ఎలా వుందేమిటి?"
"చెప్పలేను"
"ఏంట్రా అంత బోరుగా ఉందా ? ఏ సినిమా అది?"
"సినిమా పేరే అదిరా"



**ఈ జోకును పంపించిన వారు: రవి,రాజ్యలక్ష్మి, సీతారామపురం (ప.గో.జిల్లా)**

"ఒరేయ్ చిన్నా! నువ్వు పెద్దయ్యాక కళ్ళడాక్టర్ అవుతావా? పళ్ళ డాక్టర్‌వి అవుతావా?" ప్రేమ కురిపిస్తూ మురిపెంగా అడిగాడు తండ్రి.
"పళ్ళడాక్టర్‌నే అవుతా నాన్నా...కళ్ళు రెండే కదా? అదే పళ్ళయితే ముప్పై రెండు. ఎంచక్కా బోలెడంత డబ్బు సంపాదించొచ్చు? చెప్పాడు పుత్రరత్నం తెలివిగా.



**ఈ జోకులను పంపించిన వారు: ఎస్.వి.మహేష్‌బాబు, చిత్తూరు.**

ఈ సంచికలోని హ్యూమర్‌బాక్స్‌కి జోకులను పంపిన రవి, రాజ్యలక్ష్మి -సీతారామపురం, వేంద్ర స్వాతి తేజస్వి-హైద్రాబాద్, ఎ. భాస్కర్‌బాబు-హనుమకొండ, మామిడి రాధ-చెన్నై, ఎస్.వి. మహేష్‌బాబు-చిత్తూరు గార్లకు సోహన్ మ్యూజిక్ వారు 'గౌరి' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్‌ద్వారా పంపించడం జరుగుతుంది.



# తొలి తెలుగు వాగ్గేయకారుడు సింహగిరి వచనాల కృష్ణమయ్య

క్రీ.శ. 1290లో తెలంగాణ ప్రాంతమైన మహబూబ్‌నగర్ జిల్లాలోని 'నంతూరు' అనే గ్రామంలో పుట్టాడు కృష్ణమాచార్యులు .

తండ్రి... గోవిందాచార్యులు తల్లి...లక్ష్మీదేవమ్మ సదాచార వరులు... శిష్టవైష్ణవాచారం పాటించేవారూనూ....సరే పెళ్ళైన కొన్నాళ్ళకి లక్ష్మీదేవమ్మ కడుపు పండింది, కమ్మటి కలలు కనడం ప్రారంభించింది. తను ఎటుకదిలినా, శంఖుచక్రాలు రెండూ తన వెంబడి వొస్తున్నట్టూ, క్షీరసాగరం ఒడ్డున తను పరవశయై విహరిస్తున్నట్టు, దొడ్డి నిండా మందలు మందలుగా కామధేనువున్నట్లు, తననెత్తి మీద గోవర్ధన పర్వతం తేలి ఆడుతున్నట్లు, చిత్ర విచిత్రాలైన స్వప్నాలు... ఇవన్నీ భర్తతో చెబితే గోవిందాచార్యులు పరమానందపడిపోయి 'నిత్యం వేణుగోపాల స్వామివారి కైంకర్యం చేసుకుంటున్నాం కదా! హరి అంశతో బిడ్డ పుడతాడేమో, మనదీ హరి వంశం అయిపోతుందేమో' అంటూ కళ్ళనిండా అనందబాష్పాలని జలజలా రాల్చారు.

నెలలు నిండాయి. నొప్పులు పడుతోంది లక్ష్మీదేవమ్మ ... ఇష్ట కష్టాలంటే ఇదే... కష్టం లేకుండా సుఖాల శుభోదయం కాదుగా.

పురుడు పోయడానికి వచ్చింది లక్ష్మీదేవమ్మ తల్లి నాంచారమ్మ.. అదేం కర్మమో "వికృతి నామ సంవత్సరం" దుష్ట గ్రహాలన్నీ కూడుకున్న వేళ... ఓ పాపిష్టి నక్షత్రంలో శిశోదయం అయింది...

మగపిల్లాడు....!

పచ్చటి దబ్బపండు ఛాయ ..!!

కానీ కళ్ళు లేవు.....!!!

నవమాసాలూ మోసి ఆఖరికి కన్నది..గుడ్డి పిల్లాణ్ణా !? అనుకుంది తల్లి నాంచారమ్మ... తల్లికి బాలింత జ్వరం వొచ్చింది. మూసిన కన్ను తెరవట్లేదు. గుడ్డివాడు పుట్టాడు అన్నవార్త ఊరంతా పాక్కింది.... ఊరంతా తిరణాళ్ళకి వొచ్చినట్లు వొచ్చి చూస్తూన్నారు విచిత్రంగా...

తండ్రి గోవిందాచార్యులు బెంగటిల్లిపోయాడు...

"వేణుగోపాలా ఇన్నాళ్లు నీ సేవ చేసుకున్నందుకు కళ్ళులేని కబోదిని ప్రసాదిస్తావా! మా దంపతుల మీద ఇంత శీతకన్నా... "అని విలపించాడు.

ఈ లోగా బంధువు ఒకాయన వొచ్చి. ఆ కుర్రాడి జాతకచక్రం అదీవేసి...

ఏవో గుణించి... ఇంకేవో భాగించి...

తెలియనివి తీసేసి..... లేనివి కూడి...

"వీడిది పరమనికృష్టమైన జాతకం....

వీడు కొంపలో ఉంటే అడుక్కుతిని పోతావు..

అరిష్టం పిల్లాడి రూపంలో పుట్టింది.. వొదిలించుకో..."

అని ఒక ఉచిత సలహా పారేసాడు..

ఈ ముక్క నాంచారమ్మ చెవిలోంచి మనసుదాకా పాకి కలుషితం అయింది...

బాలింతరాలు లేస్తే బతకదు.... కనక ఈ గుడ్డాడ్ని పారేస్తేనే మంచిది.. అని ఓనిర్ణయానికి వొచ్చి...

ఆ పసికందుని ఊరు అవతల ఉన్న పాడుబడ్డ బావిలో మూడోకంటి వాడికి తెలియకుండా పడేసింది.

కానీ.. మూడోకంటివాడికి తెలిసింది... !

నాలుగు మొహాలవాడు చెప్పినట్లున్నాడు...

ఆ పాడుపడ్డ బావిలో అల్లిబిల్లిగా అల్లుకున్న తామరతీగల ఉయ్యాల్లో వెళ్ళి పడ్డాడు పిల్లాడు...

యాడవాల్సింది నవ్వుతున్నాడు.. నవ్వాల్సినవాళ్లని ఏడిపిస్తూ...

సరిగ్గా బావి పైన ఉన్న చెట్టుకి ఉన్న తేనెతుట్టలోంచి బొట్టు బొట్టుగా తేనె కారి పసివాడి నోట్లో పడుతోంది.

మందార మకరంద మాధుర్యాల మధ్య తేలిపోతున్నాడు వటపత్ర శాయిలాగా ..

ఇదంతా వేణగోపాలుడి లీల...

మూడురోజులు గడిచాయి.... తీవ్రమైన ఎండ కాస్తోంది... పసిపిల్లాడి మొహం మీద ఎండ పొడ.

వెంటనే కృష్ణ సర్పం నీడ...

పడగవిప్పి గొడుగు పట్టింది,

కొంతసేపటికి కృష్ణకుమారస్వామి అనే మఠాధిపతి, అటువైపుగా వెళ్తూ ఈ దృశ్యం చూసి గబగబా.. పిల్లాడ్ని ఎత్తుకున్నాడు....

'వీడు సామాన్యుడు కాదు.. ఆగ్రహానుగ్రహ సమర్థుడు...

ఏదో మహత్తర కార్యం కోసం భూమ్మీదికి దిగిన దేవదేవుడు... భూలోకంలోని పాపుల కళ్ళు తెరిపించడానికి వొచ్చిన అరవింద దళాక్షుడు' అన్నాడు..

తీసుకెళ్ళి మఠంలో పెంచడం ప్రారంభించాడు.

మెల్లిగా .....చదువూ.... సంస్కారం...సంగీతం..సాహిత్యం

ఉగ్గుపాలతో పట్టించాడు ..స్వామి!

పద్నాలుగేళ్ళాయె...

ఒకసారి - స్వామివారు..... సింహాచలం ప్రయాణం అయ్యారు.. వరాహ నృసింహుణ్ణి సేవించుకుందామని... తనతో పాటు అంధుడైన కృష్ణమాచార్యుల్ని కూడా తీసికెళ్ళాడు..

కాకపోతే అప్పట్లో కొండెక్కడానికి సౌకర్యాలు లేవు గనక..

అంధుడైన శిష్యుణ్ణి కిందనే ఉండమని..

తను పైకెళ్ళి స్వామిని దర్శించి తీవ్రమైన తపస్సు ప్రారంభించాడు.

కొండపైన కళ్లుమూసుకుని ధ్యానంలో గురువు...

కొండకింద ...కళ్ళ నిండా చీకట్లతో శిష్యుడు..

ఒకటి, రెండు... మూడు... రోజులైంది.!

గురువు ....మర్చిపోయాడు!..

తిండీ తిప్పలూ లేవు శిష్యుడికి...!

మూడోరోజు !...పైనించి పాల చెంబు పంపాడు గురువు

కళ్ళకద్దుకునీ... సేవించి ...మిగిలిన పాలతో కళ్ళు తుడుచుకున్నాడు కృష్ణమయ్య!

ఆశ్చర్యం... తామర పువ్వు విచ్చుకున్నట్టు కన్నులు తెరుచుకున్నాయి...!!

కళ్ళొచ్చాయ్ .. చూపొచ్చింది..!...

వెలుగును దర్శించాడు....

గురువుని స్మరించి .. కరువుతీర.. కళ్ళనిండా నీళ్ళు కుక్కుకునీ ఎలుగెత్తి ఏడ్చాడు... కృష్ణమాచార్యులు !

"సింహాచలం అప్పన్నని.. కళ్ళు అడిగావా గురువా..
ఇంత శిష్యవాత్సల్యమా.." అంటూ
గెంతులేస్తూ కీర్తనలు మొదలెట్టాడు !...
అవే....' సింహగిరి వచనాలు '
ఇంక వచనరచనాప్రవాహం పరవళ్ళు తొక్కడం ప్రారంభించింది.
కొన్ని పురాణగాథలు... కొన్ని వైరాగ్య గాథలు..
మరికొన్ని నీతి బోధలు.. ఇంకొన్ని పశ్చాత్తప్త ప్రార్థనలు....
వీణదండె చిరుతాళాలు ధరించి..
గానం చేస్తూంటే..
బాలకృష్ణుడు ...తాండవం చేసేవాడట..

**కొన్ని సింహగిరి వచనాలు...**

దేవ... నేను చిన్ననాడు చేసిన ...... యఘాయిత్యములు జెప్పుచున్నాడను... దేవా... ఒక కోమటి పిన్నవాడును నేనును కోడిపుంజుల జూదమాడగా.... ఆ కోమటి పిన్నవాడు నా కోడిని తన్నెను... నా కోడి మృతమాయెను...

వెను వెంటనే నేను కామక్రోధలోభ మోహమద మాత్సర్యంబుల తోటి మదోన్మత్తుండనై యా కోమటి చిన్నవాని తిరుకుచ్చు పట్టి మారితిని... ఆ కోమటి చిన్నవాడు మృతుండాయెను.

కానీ నేను దేవా(... అతని ప్రాణవాయువు లిచ్చెదవా.. యీయవా..యనిని మీకు విన్నపంబులు జేసిన ఆ కోమటి పిన్నవాడు దిగ్గున లేచి కూర్చుండి... తన గృహంబునకు పోయెను... దేవా.. నీవు ఆకార సుకృతివి...

* * *



దేవా వరమ వురుషా, దేవ దయాపరా... పరమ ధర్మ నికర...దుః ఖ విమోచనా... మంగళాకారా... నిరుద్యా...నిత్యరంజనా.. నిర్వికల్పా.. నిరంతరా.. నిరాశ్రయా..

సింహగిరి నరహరీ .. నమో నమో దయానిధీ...

* * *

దేవా, నిత్య పదంబైన మీ దివ్యనామ సంకీర్తన బఠియింపనేరక... భర్తను విడిచి వరవురుషంగోరు వ్యభిచారిణి విధంబున నున్నవాడను.. నన్ను కృతార్థుని చేయలేవా... అనాథపతీ స్వామీ..

సింహగిరి నరహరీ ..నమో నమో దయానిధీ..

* * *

పద్నాలుగో శతాబ్దంలో తెలుగు భక్తిసంకీర్తనలకు ఒరవడి అనదగిన 'సింహగిరి వచనాలు' వెలువడ్డాయ్ !

కనక వాటికర్త
తొలి తెలుగు వాగ్గేయకారుడూ
కృష్ణమాచార్యులే!!

- తనికెళ్ల భరణి

**పాఠకులకి.....నమస్కారం..**

ఎందరెందరో మహానుభావుల గురించి 'హాసం'లో రకరకాల వ్యాసాలు రాసే అవకాశం కలిగింది. వీటన్నిటినీ కలిపి 'ఎందరో మహానుభావులు' అనే మకుటంతో ఓ పుస్తకంగా వేస్తే... అనే ఆలోచన ఈ మధ్యనే వచ్చింది. లెక్క చూసుకుంటే 47.. మరొక మూడు వ్యాసాలు ఎలాగోలా వీలుచిక్కించుకుని రాయగలిగితే 50 అవుతాయి. చెప్పుకుందికి బావుంటుంది. అందుకే మళ్లీ మొదలుపెట్టాను.

సరే...ఈ ఆలోచనతో పాటే మరో ఆలోచన..

'హాసం'లో నా వ్యాసాలు వచ్చిన తర్వాత ఎందరెందరో ఉత్తరాలు రాసేవారు. ఫోన్లు చేసేవారు, వ్యక్తిగతంగా కలిసేవారు. "మేం మీరు రాసిన ఫలానా వారి బంధువులమండీ... మా దగ్గర వారికి సంబంధించినవీ ఎన్నో ఉన్నాయండీ" అంటూ చెప్పేవారు. ప్రాణం ఉసూరుమనేది. అవి కూడా ఉంటే ఇంకా బాగా రాసేవాణ్ణి కదా అనిపించేది.

అందుకే 'హాసం'లో ఇప్పటివరకూ నేను రాసిన మహానుభావుల పేర్లు ఈ దిగువున ఇస్తున్నాను. వీరికి సంబంధించిన వివరాలు, ఫోటోలు, వారు వాడిన వస్తువుల యొక్క ఫోటోలు ఏవి దొరికితే అవి పంపించండి. పుస్తకంలో కలుపుకుంటాను. పంపిన వారిని జీవితాంతం మరిచిపోలేను. పుస్తకంలో పేరుపేరునా కృతజ్ఞతలు తెలుపుకుంటాను. అలాగే నేను రాయబోయే మిగిలిన 3 మంది మహానుభావుల పేర్లు కూడా ఆయా వ్యాసాలు ప్రింట్ అయ్యాక చూసి పంపించండి.

నేను ఇప్పటి వరకూ రాసిన మహానుభావుల పేర్లివి.

తుమరాడ సంగమేశ్వర శాస్త్రి, పట్రాయని సీతారామశాస్త్రి, కోలంక వెంకటరాజు, గుమ్మలూరి వెంకట శాస్త్రి, దూర్వాసుల సోమయాజులు, మునిపల్లె సుబ్రహ్మణ్యకవి, ఆదిభట్ల నారాయణదాసు, విశ్వపతి శాస్త్రి హనుమద్దాసు, సారంగపాణి, వీణవెంకట రమణదాసు, గరికపర్తి కోటయ్యదేవర, బొబ్బిలి కేశవయ్య, మద్దిరాల వెంకట రాయకవి, దుడ్డు సీతారామయ్య, మనుసూరి వెంకట లక్ష్మమ్మ, వాసా అప్పయ్య, పిరాట్ల శంకరశాస్త్రి, దాసు శ్రీరాములు, విద్యల నారాయణ స్వామి నాయుడు, కాళహస్తి వీరయ్య, పాటల రామన్న, వెంకట సామయ్య, పప్పు వెంకన్న, ద్వారం వెంకట స్వామి నాయుడు, మహేంద్రవాడ బాపన్న శాస్త్రి పారుపల్లి రామక్రిష్ణయ్య పంతులు, కామసముద్రం అప్పలాచార్యులు, శ్రీశ్రీశ్రీ ఆనందగజపతి మహారాజా, త్యాగరాజు, పొడుగు రామమూర్తి, షేక్ చినమౌలా, యానం రామకృష్ణ, కొచ్చెర్లకోట రామరాజు, తూము నరసింహదాసు, వారణాసి రామసుబ్బయ్య, హరి నాగభూషణం, పలుకూరి వెంకట రమణ, నందిగానం వెంకన్న, వీణకుప్పయ్య, స్వాతి తిరుణాళ్,అల్లారఖా, భీమ్‌సేన్ జోషి, నారాయణ తీర్థులు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రి, కైరం భూమగౌడు.

వీర్ని గురించిన వివరాలను మీరు పంపవలసిన చిరునామా :

**తనికెళ్ల భరణి,**
**కేరాఫ్ 'హాసం,'**
**502, శ్రీ బాలాజీ నిలయం,**
**మోతీనగర్,**
**బాలాజీస్వర్ణపురికాలనీ,**
**హైదరాబాద్-500 018**

నన్నింతవరకూ ప్రోత్సహించినట్టే, లభించిన వివరాలను రాసి పంపి ఆశీర్వదిస్తారు కదూ..

మీ తనికెళ్ల భరణి

# తాతా థిత్తై తథిగిణతోం

సీరియల్ 20

- జీడిగుంట రామచంద్రమూర్తి

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | - కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | - నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | - తరుణ్ |
| అశ్విని | - శ్రియ |
| పార్వతమ్మ | - అన్నపూర్ణ |
| హనుమంతు | - గుండు హనుమంతరావు |
| అనంత్ | - గోపీచంద్ |

పైన ఉదహరించిన నటీనటులను మనసులో ఉంచుకుని ఈ సీరియల్‌ను మీ మనో నేత్రాలతో తిలకించండి.



## జరిగిన కథ

విష్ణుమూర్తి అనే బిజినెస్‌మెన్ కూతురు అశ్విని. తనతోపాటు కాలేజీలో చదువుతున్న పల్లెటూరి యువకుడు శ్రీరామ్‌ను ప్రేమించింది. తండ్రంటే భయపడే అతనికి ధైర్యం నూరిపోసింది. విష్ణుమూర్తి స్వయానా వెళ్లి అడిగినా అవమానించి పంపిన తండ్రితో పోట్లాడి శ్రీరామ్ తన పంతం సాధించుకుంటాడు. ఈ లోగా విష్ణుమూర్తి ఇంటికి బావమరిది హనుమంతు కొడుకు గోపాలంతో సహా వచ్చి అమెరికానుండి వచ్చామని కోతలు కోస్తాడు. అశ్వినిని గోపాలానికి ఇవ్వడానికి విష్ణుమూర్తి నిశ్చయిస్తాడు. కానీ అశ్విని ఆత్మహత్యకు ప్రయత్నించడంతో మనసు మార్చుకుని అశ్విని, శ్రీరామ్‌ల పెళ్లి జరిపిస్తాడు.

- ఇక చదవండి

అందుకే అక్కడున్న మేస్టర్లంతా.. ముందుగా ఆయనకు నమస్కారం చేసి- తర్వాత చెప్పారు..

"వీరభద్రం మేస్టారు లోపలున్నారు... పిలుస్తాం.. కూర్చోండి!"

రంగారావు మేస్టారు లేచి, తన కుర్చీని ఆయనకు వేశారు.

"నిష్టాగరిష్ఠుణ్ణి!... తపోసంపన్నుణ్ణి !... జింకచర్మంపై తప్ప ఇలాంటి కృత్రిమ ఆసనాలపై మేం కూర్చోం!" అన్నాడు సాధువు నాటక ఫక్కీలో.

ఈలోగా వీరభద్రం-ఇంట్లోంచి బయటకొచ్చి సాధువుని చూశాడు..

"ఎవరదీ?" అన్నాడు.

''వేం నర్వేన్వర నామధేయులం.. సర్వసంగపరిత్యాగులం... సాధువులం..!

కాశ్మీరంనించి కన్యాకుమారికి కాలిబాటన యాత్ర సాగిస్తున్నవారం!... మీ ఊరి మీదుగా సాగుతూ- వేం ఈ పూటకు ఆతిథ్యం పొందుటకు మీ- ఇల్లు తప్ప -మరేదీ లేదని తెలుసుకున్నాం... అందుకే వెతుక్కుంటూ వచ్చాం!" తన గడ్డాన్ని సవరించుకుంటూ చెప్పాడు సాధువు.

"మీ బోటి మహాన్భావులు మా గృహాన్ని పావనం చేయుట మా భాగ్యంబని భావిస్తాను! లోపలకు దయచేయండి...ఇంతకుముందే మా ఇంట 'వ్రతం' జరిగింది....తమరు తీర్థ ప్రసాదములు స్వీకరించి -భోజనం చేద్దురుగాని !" అంటూ సవినయంగా సాధువుని లోపలకు తీసుకెళ్లాడు వీరభద్రం.

"అయితే వీరభద్రుడంటే నువ్వేనన్నమాట!" అతని వెంట నడుస్తూ అన్నాడు సాధువు.

ప్రాణస్నేహితుడైనచిదంబరం తప్ప- వీరభద్రాన్ని అలా ఏకవచన ప్రయోగంతో సంభోదించేవారు ఆ చుట్టుపక్కల ఎవ్వరూ లేరనే చెప్పాలి. అయినా వీరభద్రం పట్టించుకోలేదు.. ఎందుకో....ఆ సాధువుని చూసిన మరుక్షణమే అతనిలో భక్తి భావం ఏర్పడి పోయింది. ఆయనకు సకల మర్యాదలూ చేశాడు.. సర్వోపచారాలూ చేశాడు.

తన భార్యనీ, నూతనవధూవరుల్నీ ఆయనకు పరిచయం చేశాడు...అశ్వినీ, శ్రీరామ్‌లు ఆయన పాదాలంటి ఆశీస్సులు తీసుకున్నారు..తన తాతల కాలంనాటి పులిచర్మం ఒకటి ఇంట్లో అటక మీద వుంటే, నారాయణతో దాన్ని క్రిందకు తీయించి, శుభ్రంగా దులిపించి-ఆయన భోజనం పూర్తయ్యేసరికి- వీదరుగుమీద వేయించాడు...

"నువ్వు అదృష్టవంతుడివి వీరభద్రుడూ!. ..మంచిపిల్లని ఇంటికోడలుగా తెచ్చుకున్నావ్..." పులిచర్మం మీద కూర్చున్నాక- పక్కన చేరిన వీరభద్రంతో అన్నాడు సాధువు..

"చిత్తం!... అంతాదైవనిర్ణయం!.. అసలు నా మేనకోడలు -ఈ ఇంటి కోడలుగా రావాల్సింది...కానీ పరిస్థితులు అనుకూలించక..."-

''పొరపాటు ! పరిస్థితులనుకూలించక పోవటం అనేది వుండదు. మనిషి తల్చుకుంటే సాధ్యంకానిది ఉండకూడదు... ఎలాంటి పరిస్థితినైనా మనకు అనుకూలంగా మనమే మార్చుకోవాలి!" హితబోధ చేస్తున్న ధోరణిలో చెప్పాడు సాధువు.

వీరభద్రానికి విషయమేమిటో అర్థం కాలేదు.

"మీరు శలవిస్తున్నదేమిటో నాకు అవగతం కావటం లేదు" అన్నాడు.

''ఈ వివాహం విషయంలో నువ్వు తొందరపడ్డావు వీరభద్రుడూ!?"

"అంటే ..?'' అనుమానంగా చూస్తూ అడిగాడు వెంటనే.

"ఇందాకా నీకోడల్ని చూశాను! బావుంది..! యోగ్యురాలే... సందేహంలేదు..., కానీ ఆమెముఖ కవళికలు మారకచిహ్నాల్ని ప్రస్ఫుటింపచేస్తున్నాయి.."

"మారకమా...? అంటే మ...మరణమా?" భయంతో చూశాడు వీరభద్రం.

"మరణం ఆమెకు కాదు.....నీకు!"

"న..నాకు..నాకుమరణమా?" వణుకుతున్న గొంతుతో అడిగేడు.

''భయపడకు భద్రుడూ!... సర్వస్వాన్నీ త్యజించి సన్యాసినై, ఇరవై ఏళ్లు హిమలయాల్లో ఘోరతపస్సు ఆచరించినవాణ్ణి... అణిమాది శక్తుల్ని సాధించినవాణ్ణి !..నీకు తరుణోపాయాన్ని తెలియచేస్తాను...! చేత్తో ఆశీర్వదిస్తూ చెప్పాడు సాధువు. అలాగే భయంతో చూస్తున్నాడు వీరభద్రం..

సాధవు కళ్లుమూసుకున్నాడు... రెండు నిమిషాలు అలాగే మౌనముద్రలో వున్నాకా- తర్వాత కళ్ళు తెరిచి చెప్పాడు.

''చూడు వీరభద్రుడూ! జరిగినదేదో జరిగిపోయింది...అసలు నేను పదిరోజులు ముందుగా ఇక్కడకు వచ్చి ఉంటే ఈ వివాహమే జరక్కుండా హెచ్చరిక చేసేవాణ్ణి.. ఇప్పుడిక ఒక్కటే మార్గం..!"

"శలవీయండి స్వామీ! శిరసావహిస్తాను!"

''నీకు శుభం జరగాలంటే- నేటినించి పన్నెండు నెలలు గడువు లోపల నీవు తాతవు కాకూడదు..."

"అనగా మా శ్రీరామ్ ఏడాదిలోపు- తండ్రి కాకూడదన్నమాట"

" మా ఉద్దేశ్యం అదికాదు - ఆ వ్యవధిలో నీ కోడలు గర్భవతి కూడా కాకుడదు...ఒకవేళ ఆ అరిష్టమే సంభవిస్తే.. 'ఆ మరుక్షణంలో' నీకు మారకం తప్పదు!" దృఢమైన స్వరంతో చెప్పాడు సాధువు.

ఆమాటలువిన్న వీరభద్రానికి కొంత మనిస్థిమితం చిక్కినా- ప్రాణభయం మాత్రం పూర్తిగా పోలేదు.

"ఈ రోజుల్లో గర్భం రావాల్సిన - వచ్చినా గర్భం పోవాల్సిన-అంతా పిల్లల నిర్ణయముల పైననే ఆధారపడి వున్నది కదాస్వామీ!... కనుక మీరు చెప్పిన విషయాన్ని మా సుపుత్రుడికీ,



కోడలుకీ చెప్తాను... వారిని తప్పక జాగ్రత్తపడమంటాను!"

"వారి కంటే ముందు నీవు జాగ్రత్తపడాలి సుమా! ..యవ్వనావేశంలోనో, కామోద్రేకంలోనో- వారు తొందరపడితే-ఫలితం దారుణంగా వుంటుంది. ఆమెకు నెల తప్పితే - నీ గుండెకు లయతప్పుతుంది.. అటుపై గర్భవిచ్ఛిత్తి గావించుకున్న ప్రయోజనం వుండదు. ...." వీరభద్రం వైపు సూటిగా చూస్తూ తీవ్రమైన స్వరంతో చెప్పాడు సాధువు.

ఆ సమయానికి-

ఆ ఇంటి పడగ్గదిలో - అశ్వినీ శ్రీరామ్‌ల 'శోభన వేడుక' కు ఏర్పాట్లు చేస్తోంది గీత.

వీరభద్రానికి అతని ముత్తాత నించి వారసత్వంగా వచ్చిన పందిరి మంచాన్ని మల్లెపూల మాలలతో అలంకరిస్తోంది. అంతకు పదిరోజుల క్రితమే...ఆ ఊరి మస్తాన్ సాహెబ్ తో పందిరి మంచం మీదకు ప్రత్యేకంగా బూరుగదూదితో పరుపు, తలగడలూ కుట్టించాడు వీరభద్రం.. ఆ పరుపుమీద, తన హైద్రాబాద్ నించి తెచ్చిన 'బాంబే డయింగ్' కంపెనీ వాళ్ల తెల్ల దుప్పటీని పరచింది. దాని మధ్యగా - 'ఆ కీన్' గుర్తులో గులాబీ పూలు పేర్చింది... తలగడా గలేబులు మీద రంగుదారాలతో కుట్టిన రామచిలుకలు చూడ ముచ్చటగా కనిపిస్తున్నాయి..మంచం పక్కనే - టేబుల్ మీద ఓ వెండి పళ్లెం నిండా మనసున్ని వుండలూ, మరోవెండి పళ్లెంలో రకరకాల పళ్లూ వుంచింది.. శోభనం గదిని అలంకరిచటం పూర్తయ్యాక -గడియారం లో 'టైం' చూసింది..నాలుగున్నర కావస్తోంది..

"అంటే ...ముహుర్తానికే ఇంక మూడు గంటలే వ్యవధుంది...!?..దంపత తాంబులాలు తీసుకునేందుకు, త్వరగా వెళ్లిముత్తయిదువల్ని పిల్చుకురావాలి!" అనుకుంటూ -ఆ గదిలోంచి బయటకు వెళ్లబోతోంటే రాజేంద్ర లోపలకు ప్రవేశించాడు.

"ఇక్కడున్నావా?... ఏం చేస్తున్నావ్?" అడిగేడు.

"కనిపించటం లేదా?" పందిరిమంచాన్ని చూపించి కొంటెగా ఓ గులాబీ పువ్వుని అతని మీదకు విసురుతూ అడిగింది గీత...

"శోభనం ఏర్పాట్లు చేయటమంటే మీ ఆడవాళ్ళకు మహాసరదా!" -

అలకరించివున్న పందిరి మంచాన్ని చూస్తూ అసహనంగా అన్నాడు రాజేంద్ర.

"మరి మీ మగాళ్ళ సరదాలేమిటో?" ఓరకంటగా చూస్తూ అడిగిందామె వెంటనే.

"మగాళ్ళందరి సంగతీ నాకనవసరం ..నాకు మాత్రం -నీ బాబు నా కట్నం బాకీ తీర్చినప్పుడే సరదా!"

"మీ కెప్పుడు కట్నం గొడవే !" మూతి ముడుచుకుంది.

"గొడవ కాదు..హక్కు!... బాకీ అన్నాక బాకీయే !.... ' కట్నం ఇచ్చుకోలేను అల్లుడా!' అని అనాడే నాతో ఖచ్చితంగా చెప్పివుంటే -నేను ఆశలు పెంచుకునేవాణ్ణే కాను!.. అయినా కట్నం కానుకలు తనకు అవసరం లేకపోతే లేకపోయే! ఇప్పుడు కోటిశ్వరుడి కూతుర్ని కోడలుగా తెచ్చుకున్నాడుగా! ఆడపడుచు లాంఛనపేరుతో ఓ యాభైవేలు తీసుకుని నీకిస్తే -నా అప్పు జమేసుకునేవాణ్ణి!"

"ఏమిటో...అల్లుడుంగారు' 'అప్పూ- జమా' అంటున్నారు ?"- సరిగ్గా అదేక్షణంలో ఆ గదిలోకి ప్రవేశించిన వీరభద్రం- అల్లుడు మాట విని అడిగాడు.

రాజేంద్ర ఉలిక్కిపడ్డాడు... మావగార్ని చూసేసరికి అతని 'మాట' పడిపోయింది...

"అల్లుడూ కడు స్వతంత్రుడూ అంటూంటారుగా.. అడిగెయ్యండి!" అంది గీత నెమ్మదిగా అతనికి మాత్రమే వినిపించేటట్టు.

అయినా వీరభద్రం ముఖంలోకి సూటిగా చూస్తూ - అసలు విషయాన్ని చెప్పే సాహసం చెయ్యలేకపోయాడు రాజేంద్ర....

"అడుగుతాను.. నాకేమిటి భయం?" అంటూనే రెండడుగులు మావగారి ముందుకు వేసి -ఆయన ముఖంలోకి చూస్తూ చెప్పాడు రాజేంద్ర..

"అబ్బే...అ...అ... అప్పుకాదండీ... ప.ప.. పప్పు !...పప్పు గురించి మీ అమ్మాయికి చెప్తున్నాను!" - అన్నాడు తడబడుతూ.

"పప్పా?... 'పప్పుజమేయుట' ఏమిటీ?

"జమేయటం కాదండీ....మేయటం...! ఇందాకా భోజనంలో మామిడి కాయపప్పు తిన్నాను కదా... చాలా రుచిగా వుంది... అందుకని...దాంతోనే అన్నమంతా మేశానని చెప్తున్నాను... అదన్నమాట!" చెప్పాడు..

తన తండ్రి మోహం లోకి సూటిగాచూస్తూ అసలు విషయాన్ని చెప్పలేకపోతున్న మొగుడి తిప్పల్ని చూసి - మరొకపక్కకు తిరిగి - తనలోతనే నువ్వుకుంది గీత.

రాజేంద్ర నెమ్మదిగా ఆ గదిలోంచి బయటకు జారుకున్నాడు.

వీరభద్రం వచ్చి పందిరిమంచం మీద ఓ పక్కగా కూర్చుని- మధ్యనున్న గులాబీ పూలను పక్కకు తోసేస్తూ -గీతను చూసి చెప్పాడు..

"ఇవాళ ఈ ముచ్చట జరపటంలేదు!.. ఇవన్నీ తీసెయ్!" టేబుల్ మీదనున్న మినపసున్నుండుల పళ్లెన్ని ఆమెకు అందించాడు.

"ఎందుకునాన్నగారూ.. ఏం జరిగిందీ?" పళ్లెం అందుకున్న గీతం దిగ్భ్రాతింగా చూస్తూ అడిగింది..

విషయమంతా కూతురికి వివరంగా చెప్పాడు వీరభద్రం. మరుక్షణంలో ఆ వార్త ఇంట్లో అందరికీ చేరిపోయింది...అశ్వినికి పూలజడ అల్లుతున్న పార్వతమ్మ నిర్ఘాంతపోయింది.. చేస్తున్న పని అలాగే వదిలేసి హాల్లోకి వచ్చింది.

"ఇదెక్కడి విడ్డూరమండీ?.. శుభమా అని పెళ్లిచేసి ఇప్పుడు -శోభనం చెయ్యటానికి వీల్లేదంటారా? పైగా పెళ్ళికి ముహుర్తం పెట్టిన పంతులుగారే పంచాంగం చూసి- ఈ ముచ్చటకుకూడా సమయాన్ని నిర్ణయించారు.. మళ్లీ, వచ్చేఏడు ఈనాటికి మీకు తాతగారయ్యే యోగం వుందని కూడా నిర్ధారించారు.." అంటూ ఇంకా ఏదో చెప్పబోయింది. కానీ మధ్యలోనే ఆమెను వారిస్తూ అన్నాడు వీరభద్రం...

"అదే.... ఆ యోగమే ఫలిస్తే..నాకు మారకం కూడా పట్టునని - ఇప్పుడొచ్చిన ఆ సాధువుగారు చెప్పారు!

"ఒంటి మీద కాషాయం గుడ్డ వేసుకుని నాలుగు రుద్రాక్ష దండలు వేలాడేసుకున్నంత మాత్రానా- ఆయనగారు ఓసాధువువైపోతాడా?.. ఆయనగారి వాక్కులు వేదవాక్కులైపోతాయా?" విస్కుకుంది పార్వతమ్మ.

"చాలించు ప్రేలాపన! లేకున్న నీ నాలిక తెగ్గోయగలను!.. ఆయన కాషాయం ధరించిన సాధువు కాదు... కారడవుల్లో కూర్చుని తపస్సాచరించిన మహాయోగి!.. భూత భవిష్యత్ వర్తమానాల్ని- కళ్లుమూసుకుని దర్శించుగల శక్తి



స్వరూపులు..'' -భార్యను కసురుకుంటూ చెప్పాడు వీరభద్రం.

అంతోలోనే -శ్రీరామ్, ఆ వెనుక అశ్వినీ అక్కడకొచ్చారు..

"శక్తిస్వరూపుడూకాదూ...ముక్తి ప్రదాతా కాదు!.. జాతకాల పట్ల మీకున్న పిచ్చినీ, మీలో వున్న మూఢనమ్మకాల్నీ కనిపెట్టి... ఎవడో ఇలా మాయవేషం వేసుకొచ్చుంటాడు. ఈ సమయంలో, నాలుగు అవాకూలూ, చెవాకులూ చెప్తే- మీరు భయపడిపోయి- వాటిపరిహారం కోసం, పూజలూ, పునస్కారాలు చేయించమనీ తన చేతిలో వేలకు వేలు పోస్తారనుకుని వుంటాడు"!-శ్రీరామ్ చెప్పాడు.

"అదీ నిజమే - ఇవాళా రేపూ ఇలాంటి దొంగ సాధువూలూ, స్వాములూ ఎంతోమంది తయారువుతూన్నారని -మొన్నామధ్య 'టీవీనైన్' వాళ్లు - న్యూస్‌లో చూపించారు !" అశ్విని కూడా శ్రీరామ్‌కి వంత పలికింది.

ఆ మాటలు వీరభద్రానికి రుచించలేదు... కోడలు మీద విపరీతమైన కోపం వచ్చింది...కానీ 'కొత్తకోడలు కదా' అని నిగ్రహించుకున్నాడు..

"ఆయన అలాంటి దొంగ సాధువేం కాదు...! గొప్ప మహిమాన్వితుడు....! ఆ కంఠస్వరం, ఆవర్చస్సు....చూడగానే పాధాభివందనం చేయాలనిపించింది...అయినా ఒకవేళ, మీరంటున్న విషయములే యదార్థమైనచో - ఆవిధమైన పూజలకూ, పునస్కారములకూ- నన్నూ డబ్బు అడిగివుండెడివాడు కదా? ....ఎక్కడో కాశ్మీరం దగ్గరున్న పర్వత శ్రేణుల్లో తపస్సాచరించి, అణిమాదిసిద్ధులు సాధించి- ఇప్పుడు కాలినడకన కన్యాకుమారి వెడుతూ -మార్గమధ్యంలో మనిల్లుపావనం చేశాడు... ! అభ్యాగతి శ్రేయస్సును వాంఛించే అతిథిగా -నాకు సలహా అందించాడు ... ఆచరించుట నాకర్తవ్యం!" అన్నాడు... శ్రీరామ్ - ఏం బదులు చెప్పాలో తెలీక -బుర్రగోక్కున్నాడు ... అదొక సున్నితమైన సమస్య, ఇబ్బందికరమైన సందర్భం కావటంతో అశ్విని కూడా- వెంటనే ఏమీ మాటాడలేక పోయింది.

అంతలో - వీరభద్రం, శ్రీరామ్ దగ్గర కొచ్చాడు.

"మాటకు కట్టుబడే వంశం మనది!.. నా తాత ముత్తాతలకు తలవంపులు తెచ్చేవిధంగా -ఇవాళ నీకోసం చెల్లిలికిచ్చిన మాట తప్పి, నువ్వు 'లవ్వు' చేసిన పిల్లతో నీ పెళ్లి జరిపించాను.. ఇప్పుడు నామాటను గౌరవించలేవా?... నా కోరిక మేరకు నడుచుకోలేవా?" అడిగేడు.

శ్రీరామ్ నిస్సహాయంగా -తండ్రివైపు చూశాడు... ఈలోగా అశ్విని ఓ అడుగు ముందుకొచ్చింది...

''అది కాదు మావయ్యగారూ !.. ఆసాధువెవడో, ఈ ఏడాదిలో మీరు 'తాత' కాకూడదని చెప్పాడే తప్ప.... ఇప్పుడి వేడుకలు జరవద్దని చెప్పలేదుగా?....'' కొంచెం మొహమాటపడుతూనే అడిగింది..

వీరభద్రంలో కోపం తారాస్థాయికి చేరుకుంది.

"చాలించు !..మా గృహమున ప్రవేశించి ఇరువైనాల్గుగంటలు కాలేదు... అప్పుడే నాముందు నిలబడి... సలహాలు ఇచ్చేటంతటిదానివైనావా?"

ఆ కోపంలో ఊగిపోతూ అడిగేడు..

"చాదస్తం మనుషులకు సలహాలు ఎవరైనా ఇవ్వచ్చు !... ఎప్పుడైనా ఇవ్వచ్చు !" మొండిగా బదులిచ్చిందామె...

"వ్వాట్ ?.... నేను.... నేను చాదస్తం మనిషినా?" -అంటూ గుడ్లెర్ర చేసి - ఆమె వైపు ఉరిమిచూశాడు వీరభద్రం.. తర్వాత శ్రీరామ్ వైపు వెళ్లి -అతని చొక్కా పట్టుకుని ముందుకు లాగుతూ అన్నాడు-

"చూశావురా నీ భార్య ప్రతాపం?.. పెద్దలంటే నీభార్యకు ఎంతటి గౌరవం వున్నదో చూశావా?.. అసలు నువ్వే పుట్టేవరకూ .. మీ అమ్మ ... ఏనాడూ మా నాన్న వైపు తలఎత్తి చూడలేదురా !... కానీ నీముద్దుల భార్య మాత్రం ఇలా బరితెగించి -నాకే బిరుదులిస్తోంది!.. నేను చాదస్తం మనిషినట!..."

"అవును !... ఆ మాట మళ్లీ అంటున్నాను... మీకు చాదస్తం ఎక్కువే!" - అశ్వనిలో కూడా కోపం ఎక్కువైంది.... అంతలో పార్వతమ్మ ఆమె చెయిపట్టుకుని నచ్చచెప్పింది.

''ఊరుకో తల్లీ..! ఆయనసలే గుండె జబ్బుమనిషి !... నేను నెమ్మదిగా నచ్చచెప్పి ఒప్పిస్తాను.. ఇవాళ కాకపోతే -రేపెప్పుడో మా పంతులుగారి చేత మరో మంచి ముహూర్తం పెట్టించి- ఈ ముచ్చట నేను జరిపిస్తాను...."

"జరిపించు !... తమరికి కొడుకూ, కోడలూ సుఖముగా వున్నచాలు!... ఇక కట్టుకున్న భర్త -వుంటే ఎంత? లేకుంటే ఎంత?... వారికి ఆ ముచ్చట జరిపించి.. తదుపరి మమ్మల్ని కాటికి పంపించి, అటుపై- ఏడాదికో మనుమణ్ణో మనుమరాల్నో ఎత్తి -వారితో కాలక్షేపం చేయండి...." తన కోపావేశాన్ని పళ్లబిగువున అణచిపెట్టి అక్కణ్ణించి విసవిసా - వీధిలోకి వెళ్లిపోయాడు వీరభద్రం.... అశ్విని వస్తున్న ఏడుపు ఆపుకునే ప్రయత్నం చేస్తూ తన గదిలోకి వెళ్లిపోయింది..

"అశ్విని"! అంటూ ఆమెను ఓదార్చేందుకు శ్రీరామ్ కూడా - అనుసరించాడు.

"అంతా నాఖర్మ!.... 'చాదస్తం మొగుడు చెబితే వినడు... అరిస్తే కరుస్తాడూ' అన్నట్టుంది ఈయన గారితో !" నుదుటి కొట్టుకుంటూ వంటగది వైపు నడిచింది పార్వతమ్మ.

ఇక ఆ హాల్లో ఒకవైపు గీత- మరోవైపు రాజేంద్రా మిగిలిపోయారు.....

"మొత్తానికి -ఛాదస్తం మావకి ఛలాకీ కోడలే వచ్చింది!" - అని కామెంట్ చేశాడు రాజేంద్ర భుజాలెగరేస్తూ....

"ఇక ఇక్కడ మనకేం పనీ...? మనం కూడా ప్రయాణమవుదాం!.. రాత్రి బస్సుకి టిక్కెట్లు దొరుకుతాయేమో, వెళ్లి తీసుకురండి!" చెప్పింది గీత.

"అంటే... నా కట్నం బాకీ గురించి మీ నాన్నని ఇప్పుడు అడగటంలేదా?"

"ఆయనగారు మాములు 'మూడ్'లో వున్నప్పుడే - అడగటానికి మీ నోట మాటపడిపోయింది... 'అప్ప' న బోయి 'పప్ప'న్నారు!.. ఇప్పుడింకేం అడుగుతారూ?"

"నేను కాదు ...నువ్వడుగు!" చెప్పాడు రాజేంద్ర.

"చాల్లెండి!... అసలే తిక్కలోవున్నాడు... ఇప్పుడా ప్రస్తావన తీసుకువస్తే.. నా రెక్క పట్టుకుని బయటకు తోసేసినా -తోసేస్తాడు... ఎలాగా వచ్చే సంక్రాంతికి ఇప్పిస్తానని అమ్మ చెప్పిందిగా !...ఇంకెంత ?.... ఆర్నెల్లు!.. ఓపిక పట్టండి"- అంటూ లోపలకు వెళ్లిపోయింది గీత....

రాజేంద్ర బస్సు టిక్కెట్లు తీసుకురావటానికి బయటకు నడిచాడు...

-(ఇంకావుంది)





## వివిధ వాయిద్యాలు... విభిన్న భాషలు... వెరసి

# సుఖ్‌బీర్



పంజాబ్‌లోని జలంధర్ జిల్లా దల్లీ కుగ్రామంలో 1969లో జన్మించిన సుఖ్‌బీర్ - భారతదేశంలోని భిన్నత్వాన్నే కాదు ప్రపంచంలోని భిన్నత్వాన్నీ ఔపోసన పట్టాడు. పుట్టింది భారత్‌లోనే అయినా పెరిగి పెద్దయ్యింది ఆఫ్రికా లోని కెన్యాలో. ఆ తర్వాత లండన్, దుబాయ్‌లలో గడిపాడు. ఈ విస్తృత పర్యటనల కారణం కెన్యన్ భాషలు స్వాహలి, కరియమాలనేకాదు, పోర్చుగీస్, స్పానిష్‌లను, మాతృభాష పంజాబీతో పాటుగా ఇతర భారతీయ భాషలు హిందీ, గుజరాతీలను -ఇంగ్లీష్‌ను నేర్చుకున్నాడు. సంగీతం మీద వున్న మక్కువతో హార్మోనియం, వయొలిన్, గిటార్, ఢోల్, కీబోర్డుల పై పట్టు సంపాదించాడు. విభిన్న భాషలతో పాడుతూ, వివిధ వాయిద్యాలను సమర్ధవంతంగా ఉపయోగిస్తూ ఇండీపాప్ రంగంలో తనదైన స్థానాన్ని పొందాడు.



**తండ్రి అడుగుజాడల్లో....**

సుఖ్‌బీర్ తండ్రి గురుద్వార్‌లో పురోహితుడుగా వుండేవారు. సుఖ్‌బీర్ బాల్యంలోనే ఆయన తన కుటుంబాన్ని కెన్యాకు తీసుకెళ్ళారు. అక్కడి గురుద్వార్‌లలో ఆయన భజన కార్యక్రమాలను నిర్వహిస్తుండేవారు. తండ్రితోపాటే పాటనూ నేర్చుకున్నాడు సుఖ్‌బీర్. అంతే కాదు కెన్యాలోని భారతీయ మిత్రులతో కలిసి -సంగీత కార్యక్రమాలలో పాల్గొనే వాడు. ఆరోజుల్ని సుఖ్‌బీర్ తలచుకుంటూ "మాది సంప్రదాయ కుటుంబం. నాన్నగారికి మతపరమైన విశ్వాసం ఎక్కువ. ఆయనతో పోల్చితే నాకు భక్తి కాస్త తక్కువే. అయితే నాకు సంగీతం నాన్నగారి నుండే వచ్చింది. నా రక్తంలోనే సంగీతం వుందనిపిస్తుంది. పైగా నా స్నేహితుల్లో ఒకడు కీ-బోర్డుప్లేయర్. అతని బ్యాచ్‌లో పంజాబీ గాయకుడు ఎవరూ లేకపోవటంతో ఆ లోటును నాతో భర్తీ చేశాడు. అప్పటి నుండే పంజాబీ గీతాలను పాడటం అలవాటైంది. వుండేది కెన్యాలో కావటంతో ఇంగ్లీష్‌తో పాటుగా స్థానిక భాషల్లోనూ పాటలు పాడమని మమ్మల్ని కోరేవారు. అలా అలా దాదాపు పదిభాషల్లో పాడేవాడిని. ఈ భాషలన్నీ నిజానికి నాకురావు. వాటి మీద పెద్ద పట్టు కూడా లేదు. కానీ పాడటం తెలుసు ... అంతే!" అని నవ్వేశాడు.

| | | |
|---|---|---|
| ✔ | పుట్టింది | : జలంధర్, పంజాబ్ |
| ✔ | పెరిగింది | : కెన్యా, ఆఫ్రికా |
| ✔ | విద్య | : తండ్రి దగ్గర శాస్త్రీయ సంగీతాభ్యాసం |
| ✔ | తొలి ఆల్బమ్ | : న్యూస్టైల్ (1995) |
| ✔ | అవార్డులు | : 1996 లో ఛానల్ 'వి' నుండి బెస్ట్ డెబు ఆల్బమ్, బెస్ట్ ఓకలిస్ట్, బెస్ట్ మ్యూజిక్ వీడియో (పంజాబీ ముండే) |
| ✔ | పోటీగా భావించేది | : దలెర్ మెహందీ, మల్కిత్ సింగ్ |
| ✔ | అనుసరించేది | : మైఖేల్ జాక్సన్, బాబ్ మార్లే, జగ్‌జీత్‌సింగ్, లతామంగేష్కర్, ఆశాభాంస్లే, డెఫ్‌లియోపార్ట్... |
| ✔ | ఇష్టపడే వంటకం | : భారతీయ వంకటం ఏదైనా. అలానే భార్య మినాల్ చేతి వంట ఏదైనా! |
| ✔ | ఖాళీ సమయాల్లో చేసేపని | : వంట చేయడం, చేపలుపట్టడం, ఈతకొట్టడం, ఖగోళ రహస్యాలను తెలుసుకోవడం, పుస్తకాలు చదవటం, ఏదో ఒకటి రాయటం.... వీటన్నింటినీ మించి నిద్రపోవటం.... |
| ✔ | గాయకుడు కాకపోతే | : పైలెట్ లేదా ఇన్ఫర్మేషన్ టెక్నాలజీని కెరీర్‌గా ఎంచుకోవడం. |

సంగీతాన్ని కెరీయర్‌గా ఎంచుకోవడానికి కారణం చెబుతూ" చిన్నతనం నుండే పాడే అలవాటు అబ్బినా - గాయకుడిగా మారాలని అనుకోలేదు. ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ మీద నాకు ఆసక్తి వుండేది. అలానే పైలెట్‌ని కావాలని ప్రగాఢ వాంఛ. దీనితోపాటుగా ఎం.బి.ఏ. చేయాలని వుండేది. చివరి రెండింటినీ సాధించబోతున్నాను కాస్త ఆలస్యంగానైనా సరే ! అయితే నాలోని గాయకుడిని గుర్తించిన కెన్యాకి చెందిన వ్యాపారవేత్త కేతన్ సోమయ్య నన్ను మ్యూజిషియన్ చేశారు. లండన్, దుబాయ్‌లలో రికార్డింగ్ స్టూడియోను ఏర్పాటు చేసి నన్ను దాని వ్యవహారాలు చూడమని చెప్పారు. అలానే నాలోని ప్రతిభను గుర్తించి నాతో మ్యూజిక్ ఆల్బమ్స్ చేయించారు! అలా ఊహించని విధంగా నేను సంగీత ప్రపంచంలోకి వచ్చేశాను" అని చెప్పాడు సుఖ్‌బీర్.

సుఖ్‌బీర్ తొలి ఆల్బమ్ 'న్యూస్టైల్' 1995లో విడుదలైంది. పంజాబీ, స్పానిష్, పోర్చ్‌గీస్, గుజరాతీ, స్వాహిలీ తదితర భాషల మిళితంతో రూపుదిద్దుకున్న ఆల్బమ్ నిజంగానే ఓ కొత్త స్టయిల్‌లో వుందని అందరూ భావించారు. తొలి ఆల్బమ్ సక్సెస్‌తో సుఖ్‌బీర్ ఇకవెనుదిరిగి చూసుకోలేదు. ఛానల్ 'వి' డెబు ఆల్బమ్ అవార్డ్‌ను ఇచ్చింది. అంతే కాదు. ఉత్తమ గాయకుడి అవార్డ్‌ను, ఉత్తమ వీడియో అవార్డ్‌ను కూడా సుఖ్‌బీర్ 'న్యూస్టయిల్' ద్వారా పొందాడు. ఆ తర్వాత హిందీ, స్పానిష్, పోర్చ్‌గీస్, స్వాహిలి పాటలలో 'ఓయిట్రెస్టో' ఆల్బమ్‌ను విడుదల చేశాడు. అంతర్జాతీయంగా ఈ ఆల్బమ్ మంచిపేరు తెచ్చిపెట్టింది. 1997 లో విడుదలైన 'గల్ బన్ గయీ' భారత్‌లో విడుదలైన మొదట నెలలోనే లక్షపైగా కాపీలు అమ్ముడుపోయి గోల్డెన్ డిస్క్‌ను పొందింది. అప్పట్లో సోనీటీవీ, హోమ్ టీవీలో టాప్‌టెన్ ఆల్బమ్స్‌లో నెంబర్ వన్ స్థానాన్ని, ఛానల్ 'వి'లో నాలుగవ స్థానాన్ని, ఎంటీవీలో ఐదవస్థానాన్ని పొందింది. ఆ తర్వాత 1999 లో 'హమ్ ఎనర్జీ', 2000 సం॥లో 'ప్రిన్స్ ఆఫ్ భాంగ్రా', 2001 లో 'గర్ల్స్ గర్ల్స్ గర్ల్స్' ఆల్బమ్స్ విడుదలైనాయి. గత యేడాది సుఖ్‌బీర్ 'దిల్‌కరే' ఆల్బమ్ విడుదల చేశారు.

## ప్రదర్శనల మజావేరు!

ఇప్పటి వరకూ దాదాపు ఏడు ఆల్బమ్స్ విడుదలైనా థియేటర్ పాటల రికార్డింగ్‌కి, ప్రజల సమక్షంలో ప్రదర్శన ఇవ్వడానికి ఎంతో వ్యత్యాసం వుందంటాడు సుఖ్‌బీర్. "ఇప్పటి వరకూ నాలుగు ఖండాలలోని 21 దేశాలలో 250కి పైగా ప్రదర్శనలిచ్చాను. ప్రజల సమక్షంలో పాడుతుంటే - ప్రత్యక్షంగా వారి స్పందన తెలుసుకోవటంలో మజావేరు. ఒకవేళ మనం పాడే పాటవాళ్ళని ఆకట్టుకోలేదనిపిస్తే -వెంటనే మరోపాటని అందుకోవచ్చు -అదీ నచ్చకుంటే ఇంకోటి.. ఇలా.. వాళ్ళకి నచ్చిన దేమిటో పసికట్టే అవకాశం 'లైవ్‌షో' లకు వుంది. పైగా ఆల్బమ్స్ కంటే మాలాంటి భాంగ్రా -పాప్ సింగర్లకు లైవ్ షోల వలనే భారీ ఆదాయం వస్తుంది. దలేర్‌మెహందీ, అద్నాన్ సామి వంటివారికి ఆల్బమ్ సేల్స్ ద్వారా ఆదాయం రావచ్చు కానీ, మాకు అలాకాదు. ఏదేమైనా ఈ పదేళ్ళలో నా కొచ్చిన గుర్తింపు మాత్రం ఊహించనిదే" అంటున్నాడు సుఖ్‌బీర్.

## కళ్ళద్దాలే గుర్తు

సుఖ్‌బీర్ ఎప్పుడూ నల్లకళ్ళద్దాలనే ధరిస్తాడు. కారణం ఏమిటీ అని అడిగితే -'నిజానికి పెద్ద కారణం ఏమీలేదు. నా తొలి ఆల్బమ్ విడుదలకి ముందు ఓ వీడియోని చిత్రీకరించారు. నాకు కెమెరా ఫియర్ ఎక్కువ. పైగా హై ఓల్టేజీ లైట్స్ ఎదురుగా వుంటే - ఇంకేం నటించను. అందుకే నల్ల కళ్ళద్దాలు పెట్టుకున్నాను. అవి వెరైటిగావున్నాయనీ అందరూ అనడంతో కొనసాగించాను. ఇవాళ -నాకు అది ఓ గుర్తింపుగా మిగిలిపోయింది" అని చెప్పాడు.

మొత్తం మీద వివిధ భాషలలో వున్న పరిచయం, వివిధ వాయిద్యాల పై వున్న పట్టు , వివిధ దేశాల సంగీతం గురించిన అవగాహన ....వీటన్నిటినీ మిళితం చేసి తనదైన శైలిలో వ్యక్తీకరించే నేర్పు సుఖ్‌బీర్‌ను 'ప్రిన్స్ ఆఫ్ భాంగ్రా'గా చేశాయి.

**- వి.అరుణ సత్యవతి**

# మార్కెట్లో ఉన్న ఆడియో క్యాసెట్లు




**విడుదల : ఆదిత్య**
**వెల : రూ.36/-**




**విడుదల : అశ్విని లైవ్ క్యాసెట్స్**
**వెల : రూ.32/-**




**విడుదల : సి (ఐ) టీవి ఆడియో**
**వెల : రూ.35/-**



జంతువులు మనగురించి మాట్లాడేది తెలిసిపోతే
ఎంత తమాషాగా ఉంటుందో వివరించే...



బాల్యపు
లేతదనం
మళ్ళీ కోరుకునే
పెద్దలకు
మరీ మరీ
ప్రత్యేకం

పిల్లల కోసం ప్రత్యేకం...

# డాక్టర్ డూలిటిల్



నవలీకరణ
ఎమ్బియస్ ప్రసాద్

2వ భాగం

చిత్ర పరిచయం 2

సమన్వయం
మంజీర

### జరిగినకథ

జంతు వైద్యుడిగా కూడా దేశదేశాలా ఖ్యాతి గడించిన డా॥ జాన్ డూలిటిల్ పారిస్ ట్రిప్‌నుండి అతని పెద్ద కూతురు 16వ పుట్టినరోజున తిరిగి వచ్చాడు. ఆమె ఆ రోజు బాయ్‌ఫ్రెండ్‌తో డేటింగుకి వెళుతుందని భార్యద్వారా విని మండిపడిన జాన్ కూతురితో మాట్లాడదామని బయలుదేరతాడు.

\- ఇక చదవండి

కూతురి గదిముందు నిలబడి జాన్ తలుపు గట్టిగా బాదాడు. లోపల షెరెజ్ చెవులు చిల్లులు పడే లెవల్లో మ్యూజిక్ బజాయిస్తోంది. ఏకాగ్రత ఎక్కడ చెడిపోతుందోనన్న భయం కాబోసు, చెవులకు ఇయర్‌ఫోన్లు తగిలించింది. తన లోకమే తనది తప్ప మనుష్యులెవరి మాటా చెవిన పడనివ్వ దలచుకోలేదు. ఒకవేళ మానవమాత్రులెవరైనా మాట్లాడదలచుకుంటే తనను మరో ఎలక్ట్రానిక్ యంత్రమైన సెల్‌ఫోన్ ద్వారానే చేరుకోవాలి తప్ప వేరేవిధంగా అందుబాటులోకి రానని ముందే తల్లికి చెప్పివుంచింది కాబట్టి సెల్‌ఫోన్ మాత్రం చేతికి అందేదూరంలో పెట్టుకుంది.

ఈ విషయం గురించి తెలిసినా జాన్ పట్టుదల జాన్‌ది. ఇంట్లో ఒకళ్లతో ఒకళ్లు సెల్‌లో మాట్లాడుకునే ఖర్మ ఏమిటని వాపోయే పాతతరం మనిషి అతను! 'ఛస్తే సెల్‌ఫోన్ ఉపయోగించను' అని తన నిర్ణయాన్ని పునరుద్ఘాటిస్తూ 'కీప్ అవుట్' అని హెచ్చరిస్తున్న తలుపును బాదాడు. "షెరెజ్, తలువు తియ్యి" అని అరిచాడు.



అబ్బే, సంగీతసాగరంలో మునకలేస్తున్న షెరెజ్‌కు తండ్రి ఆక్రందనలు చెవిన పడలేదు. నిస్సహాయంగా పళ్లు కొరుక్కుంటూ మళ్లీ ఓసారి తలుపుబాదాడు. "నేను డాడీని" అని గొంతు చించుకుని చూశాడు. అబ్బే! మన సంగీతపిపాసిని అదీ ఏమాత్రం కదలించలేకపోయింది.

పెంపుడు కుక్క లక్కీకి జాలివేసింది. "సెల్ కొట్టు డాక్టర్" అని సలహా పడేసింది.

"గాడిదగుడ్డు! తలుపు అవతల అది, ఇవతల నేను!! ఈ భాగ్యానికి సెల్లా!? ఇది ఇల్లా? సెల్స్‌గా విభజించిన జైలా? జైల్లో ఖైదీలు సైతం ఊచలద్వారా ఒకరితో ఒకరు మాట్లాడగలరేమో! మేం మాత్రం ఒకే చూరు కింద ఉండి ఫోన్లు చేసుకోవాలా? ఉండు బాల్కనీతలుపు వైపు నుండి వెళ్లి ముందా ఇయర్‌ఫోన్లు పీకి పారేసి దాన్ని తనలోకంలో నుండి మనలోకంలోకి తెచ్చిపడేస్తా!" అంటూ బాల్కనీవైపుకి పరిగెట్టాడు.



పితృహృదయాన్ని ఆల్‌రెడీ చదివేసివుందేమో, షెరెజ్ ఆ వైపు తలుపుకు కూడా గడియ వేసేసింది. కూతురు ముందుచూపుపై అవగాహన లేని జాన్ అటువైపు వెళ్లి ఆ తలుపూ మూసివుండడం చూసి తెల్లబోయాడు. పైగా దురదృష్టం ఏమిటంటే ఆ డోరు గ్లాసు డోర్. అందువల్ల లోపల షెరెజ్ మ్యూజిక్ వింటూ ఒళ్లుమరచి డాన్సు చేస్తూండడం తండ్రి కంటబడింది. దాంతో కోపం, తద్వారా బలం తెచ్చుకున్న జాన్ తలుపుబద్దలు కొట్టడానికి ఉపక్రమించాడు.

అంతలోనే అతనికి ఎక్కిళ్లు వినబడ్డాయి. తిరిగిచూస్తే తాగుబోతు కోతి దర్శనమిచ్చింది. "ఈ కుర్రకారున్నారే! వీళ్లు పెట్టే బాధలు భరించడానికి ఎంతటివాడైనా సరే, మందు కొట్టి తీరాల్సిందే!" అంటూ చేతిలో ఉన్న సీసా ఎత్తి కాస్త నోట్లో పోసుకుంది.

"నీకు తాగడానికి ఏదో ఒక కారణం కావాలి. ఆ సీసాలో ఉన్నదేమిటి, ముందు అది చెప్పు!" అన్నాడు జాన్ ఆతృతగా. మందులిచ్చి తాగుడు మాన్పించిన పేషెంటు మళ్లీ ఇలా తయారవ్వడం ఆందోళన కలిగించింది.

"అబ్బే, ఆరంజి జ్యూస్"

"ఏదీ, నన్ను రుచి చూడనీ" అంటూ రుచిచూసి "ఇది వైన్!!" అని అరిచాడు.



'కనిపెట్టావులే గొప్ప సత్యాన్ని!' అన్నట్టు కోతి జాన్‌ని చూసి వెక్కిరించింది.

ఇంతలో ఓ పందికొక్కులాటిది

ప్రాణి బాల్కనీలోకి ఎక్కి వచ్చింది. "డాక్టరు డూలిటిలంట, మీ ఇద్దరిలో ఎవురు!?" అని అడిగింది పొగరుగా.

జాన్‌కు ఒళ్లు మండింది. "మనిషికి, కోతికి తేడా తెలియకుండా పోతోందా? ఒళ్లూ పై తెలుస్తోందా?"

"మా బాస్‌కు అవేమీ తెలియదు. డాక్టరుని వెంటబెట్టుకుని ఇక్కడున్నట్టు వెంటనే రమ్మన్నాడు."

"మీ బాసా? వాడెవడు?"

"వాడా!? మా ఆంబోతు బాస్‌ను అలా అనడానికి ఎన్ని గుండెలు!"

"లెక్కెట్టి చెబుతాలే! అదలా వుంచు. ఇంతకీ మీ ఆంబోతు బాస్‌ది ఏ వూరు?"



"నీ కొచ్చన్లు కట్టిపెట్టి నాతో వెంటనే రా. లేపోతే మా బాస్ ఊరుకోడు. అనలే ఒంట్లో బాలేదు"

"అదా సంగతి, ఇదిగో ఓ విషయం తెలుసుకో. ఇక్కడ రూల్సంటే రూల్సే! మా ఇంటి బాల్కనీలో జొరబడి వెంట రమ్మంటే రావడానికి నేనంత బేవార్సుగా లేను. ఎపాయింట్‌మెంట్ తీసుకోవాలి. మీ దున్నపోతు బాస్‌కు చెప్పు.."

"..దున్నపోతు కాదు, ఆంబోతు"

"దున్నపోతయినా, ఆంబోతయినా ఒకటే రూలు. ఎపాయింటుమెంటు తీసుకోవాల్సిందే!"

"ఆ మాట నేను మా బాస్ దగ్గర చెప్పలేను. కుమ్మేస్తాడు. అంతకంటె నువ్వు వెంటనే వచ్చేసావనుకో.."

"మీ బాస్ కుమ్మడం తర్వాత.. ముందు నిన్నక్కడినుండి తోసేస్తాను."

"మాటలు జాగర్త గురూ.. ఏవైనా తేడా వచ్చిందంటే మా బాస్ ఊరుకోడు. రేపీపాటికి నీ పేరు పేపర్లో ఎక్కేస్తుంది, మా అనుబంధ సంస్థ నిన్ను ఏకేస్తుంది. రౌడీలా జంతువులను మేడమీదనుంచి తోసి చంపేస్తున్నావని కోర్టై కూస్తుంది. చూస్కో.."

ఈ బెదిరింపులు వినేందుకు ఏ పాటి ఉత్సాహం ప్రదర్శించకుండా జాన్ ఇటు తిరిగి తలుపులు బాదే కార్యక్రమాన్ని పునరుద్ధరించాడు. ఈ శబ్దాలేవీ చెవులకు సోకకుండా నృత్యకార్యక్రమాన్ని కొనసాగిస్తోంది అతని కూతురు.



చివరికి జాన్‌కు ఆయాసమొచ్చింది. కుక్క మాటను చెవినబెట్టి, తనను తాను తిట్టుకుంటూ సెల్ ఉపయోగించాడు.

సెల్‌ఫోన్ మోగగానే షెరెజ్ మ్యూజిక్ సిస్టమ్ ఆపి, ఇయర్‌ఫోన్లు పక్కనబెట్టి "హలో" అంది.

"నేను, నాన్నని"

"హాయ్ డాడీ, హౌవార్యూ? వేరార్యూ?"

"చెప్తాను కానీ, ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పు. బెడ్‌రూమ్‌లో ఉన్న నీతో మాట్లాడాలంటే నేను బాల్కనీ గోడ ఎక్కి, నీ రూము బయట నిలబడి సెల్‌ఫోన్ ఉపయోగించాలా?"

బలే వ్యంగ్యంగా తిట్టానని జాన్ తనను తాను అభినందించుకున్నాడు కానీ పాపం పాప్ మ్యూజిక్ చెవుల్లో ప్రతిధ్వనిస్తున్న షెరెజ్‌కు తండ్రిమాటలు చెవి కెక్కలేదు.

"ఉండు నాన్నా, నీ మాటలేమీ అర్థం కావటం లేదు. అసలెక్కణ్నుంచి మాట్లాడుతున్నావ్.. అది చెప్పు ముందు"

ఒంటె నడుం విరక్కొట్టే చివరి గడ్డిపోచ అదే కాబోలు, జాన్ దిక్కులు పిక్కటిల్లేలా ఒక్క అరుపు అరిచాడు. దెబ్బకి షెరెజ్ అటుతిరిగి చూసింది. తండ్రిని చూడగానే తెల్లబోయింది. గబగబా పరిగెట్టుకు వచ్చి తలుపు తీసింది.

"ఇదేమిటి నాన్నా? ఇక్కడేం చేస్తున్నావ్? అసలు ఇక్కడికి రావల్సిన పనేముంది నీకు?" అంది మందలించే ధోరణిలో!

"నేనా? నేనేం చేస్తున్నానా? నువ్వు చేస్తున్న దొమ్మరగోల చూసి ఆనందించడానికి వచ్చా! ఈ దిక్కుమాలిన బాల్కనీకి ఎందుకొచ్చానో తెలుసా? నిన్ను పలకరించడానికి వేరే ఏ మార్గం దొరక్క! అయినా ఈ గోలంతా ఏమిటి? నువ్వు చేస్తున్నదేమిటి?"



"ఇదా? దీన్ని డాన్సంటారులే!"

"డాన్సా!?" అని జాన్ కూతుర్ని ఇమిటేట్ చూసి చూపించాడు. "దీన్ని పబ్లిక్‌లో చేస్తే మొహాన్న ఉమ్మేస్తారు. అవునూ, నువ్వేమిటి, బర్త్‌డే పార్టీ ఇంట్లోవాళ్లతో కలిసి చేసుకోవట? నిజమేనా?"

"ఇంట్లో వాళ్లతో బర్త్‌డే పార్టీ చేసుకోవటమనేది ఏదో, చిన్నప్పుడు చేసే పని! 16 యేళ్లు వచ్చేశాక చేసుకునేది కాదు! పైగా ఇవాళ నాకో డేట్ (ఆ రోజుకి మాత్రం కలిసి తిరిగే బాయ్‌ఫ్రెండ్) ఉన్నాడు"

"నీకో డేట్ ఉంటే వాణ్ని కూడా డిన్నర్‌కు పిలు. ఎందుకంటే మనందరం కలిసి డిన్నర్ తీసుకోబోతున్నాం" ఈ విషయంలో చర్చకు తావు లేదన్నట్టూ, చెప్పాల్సింది ఇంకేమీ లేదన్నట్టూ జాన్ వెనక్కు తిరిగాడు.

డేట్ తో కలిసి స్వేచ్ఛగా హోటల్లో పార్టీ చేసుకుందామనుకుంటున్న షెరెజ్‌కు తండ్రి ప్రతిపాదన వినేసరికి మండిపోయింది. సామూహికంగా డేట్ చేసుకోవడం ఎంత అసమంజసమో చెబుతూ వెక్కిరించింది -

"అంటే అతను వచ్చినపుడు నేను చెప్పాలన్నమాట - హలో ఎరిక్, ఇదిగో మా నాన్న, ఇదిగో మా అమ్మ ఇదేమో.. ఇది మా చెల్లెలు. ఈ యావన్మందీ మన డేట్‌నాడు మనతో కలిసి డిన్నర్ చేస్తారు. ఓహో, ఆహాహా, ఎంత గొప్పగా ఉంది! డేట్ చేసుకునే విధానం ఇదన్నమాట అని అతనికీ తెలుస్తుంది!"

"నీ వెటకారాలు కట్టిపెట్టు. ఇంకోటి గుర్తుంచుకో! మేం యావన్మందీ

మీతో కలవటం లేదు. అతను 'మన' యావన్మందితో కలుస్తున్నాడు. మనందరం కలిసి డిన్నర్‌కు వెళుతున్నాం. నీ అతిథిగా అతను వచ్చి కలుస్తాడు. దట్సాల్! అయినా నీ కింత చిన్న విషయం కూడా విపులంగా చెప్పవలసిరావడం..." అంటూ గదిలోనుండి వెళిపోతున్న జాన్ కంట షెరెజ్ ప్రోగెస్‌రిపోర్ట్ పడింది. "ఇదేమిటి?" అన్నాడు దాన్ని చేతిలోకి తీసుకోబోతూ.

"నాన్నా, అది ముట్టుకోవద్దు. దట్స్ ప్రైవేట్!" అని అరిచింది షెరెజ్.

కానీ అప్పటికే తండ్రి దాన్ని చూడడం కూడా జరిగిపోయింది. మార్కులు చూడగానే ఆమె చదువు సంగతి అర్థమయిపోయింది. "దీన్ని ఎవరికీ చూపించకుండా ప్రైవేట్ ప్రాపర్టీగా ఉంచాలని ఎందుకనుకుంటున్నావో తెలిసింది. రెండు సబ్జక్ట్‌లలో 'సి' గ్రేడ్, ఓ దాంట్లో 'డి'! నిన్ను చూస్తే సిగ్గేస్తోంది."



షెరెజ్ నవ్వింది. "సిగ్గుమాలిన పనులు చేస్తున్నది నువ్వా? నేనా?"

"మతి ఉండే మాట్లాడుతున్నావా? సిగ్గుపడేటంత పనులు నేనేం చేస్తున్నాను?"

షెరెజ్ మాట్లాడలేదు. చూడు నీ ఘనకార్యం, వేరే చెప్పాలా? అన్నట్టు కిటికీ కేసి చూపించింది. అక్కడ కోతి మందుకొడుతూ 'అసలే కోతి, ఆ పైన కల్లు తాగింది' అన్న సామెత నిజం చేయడానికి మరిన్ని కోతి చేష్టలు చేస్తోంది.

జాన్‌కు అర్థమయ్యింది - లోకం తనను ఎంతైనా మెచ్చుకోవచ్చు గాక, చిన్నకూతురు ప్రోత్సహించవచ్చుగాక, భార్య భరించవచ్చుగాక, కానీ పెద్దకూతురు మాత్రం జంతువులతో తన అనుబంధాన్ని నిరసించడం మానలేదని! కానీ ఈమెను మెప్పించడానికి తన పంథాను మార్చుకునే ఊహ లేదతనికి. ఆ విషయమే గట్టిగా చెప్పాడు -

"అంటే నీ ఉద్దేశ్యంలో నేను నా వృత్తికి గుడ్‌బై చెప్పి, జంతువులకు సాయపడడం మానేసి ఇంట్లో కూచోవాలి. ఎందుకంటే ఈ మహాతల్లికి వాళ్లనాన్న జంతువులతో మాట్లాడగలడని చెప్పుకోవడం కంటె సిగ్గుమాలిన పని లేదు కాబట్టి!.."

"కానీ అదెలాగూ జరగదులే!" అంది షెరెజ్ నిష్ఠూరంగా.

"కరక్ట్! నీ తృప్తికోసం నా ధర్మాన్ని నేను వదలుకోను. ఎన్నోరోజులు వెనుకముందులాడి, పిచ్చాసుపత్రికి కూడా వెళ్లొచ్చి చివరకు ఈ పంథాను ఎంచుకున్నాను. ఇక నీ ఆలోచనలు కట్టిబెట్టి భోజనానికి రా." అంటూ ప్రోగెస్ కార్డ్ విసురుగా బల్లమీద పడేశాడు.

అంతలో సెల్‌ఫోన్ అతని కంటబడింది. "ఇదొకటి, చదువు సర్వనాశనం కావడానికి.." అంటూ సెల్‌ఫోన్ చేతిలోకి తీసుకుని "ఓ వారం దాకా ఇది కట్!" అని తీసుకుని జేబులో పెట్టుకున్నాడు.

"అయ్యబాబోయ్, సెల్‌ఫోను లేకపోతే నాకు టైము గడవడం ఎలాగ?" అంటూ లబలబ లాడింది షెరెజ్.

"స్టాంపులు సేకరించు. ఉత్తరం ఎలా రాయాలో నేర్చుకో. పెన్‌ఫ్రెండు ఎవర్నో పెట్టుకుని ఏదో ఒకటి రాస్తూండు. లోకంలో లక్షాతొంభై హాబీలున్నాయి. ఏదో ఒకటి అలవాటు చేసుకో, బాగుపడు. వెధవ సెల్‌ఫోన్ గొడవ వదిలిపెట్టు. తండ్రిని చెబుతున్నాను. మాట విని బాగుపడు." అంటూ గది బయటకు వచ్చాడు.

బెడ్‌రూమ్‌లోకి సెల్‌ఫోన్ చేతబట్టి వస్తూన్న భర్తను చూసి లీసా ఆశ్చర్యపడింది. అతను ఎవర్నీ పట్టించుకునే స్థితిలో లేడు. సెల్‌ఫోనులో నంబర్లు ఏమున్నాయా అని నొక్కి చూస్తూ ఆశ్చర్యాంబుధిలో మునకలు వేస్తూ ఉక్కిరిబిక్కి రవుతున్నాడు.



"50 నంబర్లున్నాయి! నాది మాత్రం ఒక్కటే ఉంది. వీడెవడో బిగ్గీ మాక్ గాడిది ఇంటి నెంబరు, సెల్ నెంబరు, పేజరు నెంబరు.. ఇన్ని ఉన్నాయి. ఎవడీ బిగ్గీ మాక్?" అంటూ లీసా కేసి కోపంగా చూశాడు జాన్.

"నాకు తెలియదు కానీ అలా ఇతరుల సెల్‌ఫోన్లో చూడడం మర్యాద కాదు" అంది లీసా అనునయించడానికి ప్రయత్నిస్తూ.

"మర్యాదలన్నీ తర్వాత! ముందీ బిగ్గీ మాక్ గాడు.. అసలీ పేరే నాకు నచ్చలేదు. అదేం పేరు? ఫోన్ చేసి వాణ్నే అడుగుతాను. ఏమిట్రా ఈ దరిద్రప్పేరూ నువ్వూనూ అని!"

"చాల్లెండి" అని లీసా అడ్డుపడుతూండగానే జాన్ ఫోన్ కొట్టేశాడు.

ఓ ముసలి దంపతుల ఇంట్లో ఫోన్ మోగింది. ముసలాయన "ఆ సౌండేమిటి?" అని చికాకు పడ్డాడు.

"మార్కస్ సెల్‌ఫోన్"

"సెల్లా? వాడి కెక్కడిది?" ఆశ్చర్యపడ్డాడు పిల్లల నిర్వాకాల గురించి అందరికంటె ఆఖరిన తెలిసే తండ్రుల ప్రతినిధిగా ఆ పెద్దాయన.

"అబ్బే, ఓ వారం రోజుల క్రితమే వచ్చింది" అందావిడ పిల్లలు ఏం చేసినా వెనకేసుకువచ్చే తల్లుల ప్రతినిధిగా.

అదే మహిళాసమాజానికి చెందిన లీసా ఇవతల భర్త చేతిలోనుండి సెల్ లాక్కోబోయింది. "మీకు మతిగినా పోయిందా? పిల్లలతో సమానంగా చేష్టలూ మీరూ! వాడు నువ్వెవరంటే ఏం చెబుతారు?" అంటోంది.

అంతదూరం ఆలోచించే ఓపిక జాన్‌కు లేదు. "ఆ బిగ్గీ మాక్ గాడెవరో ఇవాళ తేల్చేస్తాను" అంటూ రంకెలేశాడు.

ఆలోపున అవతలి సెల్ పెద్దాయన చేతికి వచ్చింది. "హలో" అన్నాడు.

పోరంబోకు కుర్రకారుతో మాట్లాడుతున్నాననుకుంటున్న జాన్ "ఎవరది?" అని అడిగాడు విసురుగా.

తన కుమారరత్నానికి ఎవడో పోరంబోకు స్నేహితుడు చేస్తున్న ఫోనుగా భావించిన పెద్దాయన "ఎవరది?" అన్నాడు జాన్‌ను అనుకరిస్తూ.



"బిగ్గీ మాక్‌యా కాదా? అది చెప్పు చాలు" అన్నాడు జాన్ డైరక్టుగా పాయింట్లోకి వచ్చేస్తూ.

"అది తెలుసుకోవాల్సిన అవసరం ఎవరికి వచ్చిందో ముందు అది చెప్పు"

"నేనడిగినదానికి సూటిగా సమాధానం చెప్పరా చవటా" అన్నాడు జాన్ సహనం కోల్పోయి.

పెద్దాయనకు దిమ్మ తిరిగిపోయింది. కొడుకు స్నేహితులు ఇంతకు తెగించారన్నమాట అనుకుంటూ "చవటా!? నన్నా!?" అని ఆశ్చర్యపడ్డాడు.

"అవునురా చవటా, బిగ్గీ అని పేరెట్టుకున్నావ్, నీ వయసెంతరా?"

పెద్దాయనా రగులుతున్నాడు "నీకెందుకురా?"

"ఎందుకో తర్వాత చెప్తాను. ముందు నీ వయసు చెప్పరా" జాన్ అరుస్తున్నాడు.

"బెదిరిస్తున్నావా?" పెద్దాయనా అరిచాడు.

"బెదిరింపులు కావు, ఒట్టేసి చెబుతున్నా. నువ్వు మళ్లీ ఈసారి ఈ నెంబరుకు ఫోన్ చెయ్యాలీ.."

వ్యవహారం శ్రుతి మించుతోందని భయపడి లీసా జాన్ చేతిలోంచి సెల్ లాక్కుంది. అప్పటికే జరగవలసిన అనర్థం జరిగిపోయింది.

(సశేషం)

## 'సరిగపదమని-22

### జవాబులు

అడ్డం: 1.తెలుసా 3.తొలిమాట 7.నా 8.నీ 9.కల 10.కోడి 12.ఏం 13.ప్రేమతో 15.ఏ 18.ఈ 20.బొమ్మన 21.అతి 23.అది 24. రామ్మతం

నిలువు: 1.తెల్ల 2.సారీ 3.తొలి 4.మాయ 5.చిలకమ్మా 11.యమహో 14.అడబొమ్మ 17.రామా 19.మతి 21. అది 22.సైతం

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

కేతవరపు సాయిమేఖల-విజయవాడ, పి.హిమబిందు- మల్కిపురం (తూ.గో.జిల్లా), వి.తేజస్మిత-కడప, పి.మహేష్‌కుమార్‌రెడ్డి-వనపర్తి (మహబూబ్‌నగర్), జె.బాబురావు- గుడివాడ, బేరా సతీష్‌కుమార్- నర్సీపట్నం (విశాఖజిల్లా), ఎ.శశికిరణ్-రాగంపేట (కరీంనగర్), కె.వి.యల్. నరసింహశాస్త్రి - హైదరాబాదు, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, ఆత్మూరి వెంకట శరత్‌కృష్ణ -హైదరాబాదు, వై.జంగయ్య- హైదరాబాదు, వై.రాజానాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె (చిత్తూరు), మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడా పద్మావతి- విశాఖపట్నం, బొబ్బిలి శ్రవంతి- యం.ఆర్.నాగారం (విజయనగరం), మైసూర్ కీర్తన- మదనపల్లి, అరవ సూర్యప్రశాంత్ - రాజమండ్రి, కొమ్ము సురేష్- యూసదిన్నె(కర్నూలు), పి.వి.మురళీకిషోర్- సత్తెనపల్లి, విహారా శేషసాయి-సత్తెనపల్లి, జి.పి.శ్రీనివాస్-విశాఖపట్నం, కె.మాధవీకృష్ణా- విజయవాడ, పి.రాజరాజేశ్వరి- అత్తిలి, జి.కుసుమ-విశాఖపట్నం, యం.జ్యోతి కృష్ణ-సికింద్రాబాద్, యన్.ఆదిత్యారెడ్డి- సోదం (చిత్తూరు), బి.ఉమామహేశ్వరి - వీరవసరం (ప.గో.జిల్లా), అయ్యగారి రాజశేఖర్- రాజోలు, బి.మంజుల- నెల్లూరు, జి.ఆశాజ్యోతి- వినుకొండ, డి.రాము- విశాఖపట్నం, సిహెచ్.శ్రీరాం- జోగిపేట (మెదక్), విజయ&ఉదయభాస్కరరావు- రాజమండ్రి, జి.పాండురంగశర్మ- హైదరాబాదు, పి.నవీన్-అనంతపురం, పి.స్వాతిలక్ష్మి-చీపురుపల్లి (విజయనగరం), నెల్లట్ల రమాదేవి- హన్మకొండ, ఝాన్సీబాలసుబ్రహ్మణ్యం-నల్గొండ, కె.చిన్నబాబు- నెల్లూరు, కె.వాసంతిదేవి - నిజామాబాద్, పక్కి చక్రవర్తి-గరివిడి(విజయనగరం), కె.నందీష్- కడ్తాల్ (ఆదిలాబాద్), జి.జయలక్ష్మి- కర్నూలు, జి.జయచంద్రగుప్త -కర్నూలు, పేరాల శ్రీవాణి- వైజాగ్, యన్.వాణిప్రవీణ్- సంఘం (నెల్లూరు), టి.యం.కె.కిషోర్ - కరవంజ(శ్రీకాకుళం), పిహెచ్.శ్వేత- చీపురుపల్లి (విజయనగరం), అయ్యగారి వెంకటేశ్వరరావు- అమలాపురం, యం.అనిత- కర్నూలు, పి.తిరుమల ప్రసాద్- హైదరాబాద్, యస్.రామలక్ష్మి- ఆకివీడు, ఉప్పాల మోహన్‌బాబు- అవనిగడ్డ (కృష్ణా), పింగళి.అశ్వత్థనారాయణ -ఒంగోలు, కె.వి.సత్యవతి- సరూర్‌నగర్, యల్లాపంతుల చందు-శ్రీకాకుళం, శ్రీనివాసపవార్- ఆర్మూర్ కె.ప్రవీణకుమార్- కంబేరు(ప.గో.జిల్లా) ఏ.వి.ఎస్- ద్రోణాచలం, కె.కృష్ణా- జగన్నాథపూర్ (మహబూబ్‌నగర్).

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

ఆర్.పుల్లయమ్మ-దేవిచౌక్, జి.యస్.రమేష్-పత్తికొండ(కర్నూలు), ఆలవారుశెట్టి నరిత-నెల్లూరు, జి.శైలజ-రాజమండ్రి, కె.సుధాకర్‌శర్మ- మైలవరం (కడప), యల్.వి.యస్.భగవాన్-గండిపాలెం (నెల్లూరు), బంకురు శ్రీను-మల్లంపేట (విజయనగరం), నిర్మల క్రిష్ణ-తిరుపతి, ముటుకూరు వసుంధర- హైదరాబాద్, బి.ధనుంజయ్-పాతపట్నం(శ్రీకాకుళం), ఈ.రాధిక-హైదరాబాద్, పి.అమరాధ- హైదరాబాద్, క్రొవ్విడి లావణ్య- కొత్తగూడెం (ఖమ్మం), బల్లూరి ఉమాదేవి-ఆదోని, నేమాన-శ్రీకాకుళం, మర్యాల రమేష్- హుజూర్‌నగర్(నల్గొండ), టి.అనిత- అచ్చంపేట (మహబూబ్‌నగర్), శీలం వరప్రసాద్- మచిలీపట్నం (కృష్ణా), ఎలుకూరి శ్రీనివాసశర్మ-విజయవాడ, యన్.చిన్నయ్య- నంద్యాల (కర్నూలు) ఉ.ఉ.ఉ.- ఎమ్మిగనూరు, కె.వి.సరస్వతి-హైదరాబాద్, యం.మాధురి రంగారావు- నల్గొండ, యస్.జ్యోతిర్మయి- తాడేపల్లిగూడెం, యస్.టి.పి.శరత్‌చంద్- నూజివీడు (కృష్ణా), యం.శ్యామలాదీప్తి- నూజివీడు (కృష్ణా), యు.ఆదిత్య మణిధర్- కోటనందూరు (తూ.గో.జిల్లా), సామంచి రాధ-విజయవాడ, పి.త్రివిక్రమ్‌సాగర్-మహబూబ్‌నగర్, యద్లపల్లి చంద్రశేఖర్- తెనాలి, అవసరాల మహతి-విశాఖపట్నం, ఆర్.శారదా అనసూయ- హైదరాబాద్, జి.జయ చంద్రగుప్త- కర్నూలు, కె. రాఘవేందర్-పెబ్బేర్ (మహబూబ్‌నగర్), జి.విజయలక్ష్మి- విశాఖపట్నం, యం.సతీష్ చంద్రనాయక్- తిరుపతి, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, టి.శ్రీనివాసరావు- గురజాల, గూడువల్లి నాగరాజు-కైకలూరు, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, టి.ఎ.సుధాకుమార్- కాకినాడ, మన్నవ మాధవి- సత్తెనపల్లి, పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, యస్.యం.రఫీ- కాశీబుగ్గ (శ్రీకాకుళం), బి.కవిత- తిరుపతి, ఎ.శ్రీనివాస్-పాతపాలమూరు (మహబూబ్‌నగర్), ములుగు చన్ద్రశేఖరు- జగ్గయ్యపేట(కృష్ణా), వెలుటూరి పద్మ-హైదరాబాద్, చివుకుల చిరంజీవి-ఒంగోలు.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

టి.మహేష్ రెడ్డి-గూడురు, వేంద్ర స్వాతితేజస్వి-హైదరాబాద్, అడిదం సుందరశారద- నెలిమర్ల (విజయనగరం), సహారె ఈరణ్ణ-ఆదోని, వి.వి.రమణి- బచేలి, ఏ.బి.వి.ఎస్.రమేష్- వేలూరు (తమిళనాడు), కె.జ్యోతిశర్మ- కర్నూలు, అల్లూరి రామరాజు-విజయవాడ, బి.సంధ్య- హైదరాబాద్, ఎ.మహమ్మద్‌రఫీ- ప్రొద్దుటూరు (కడప), ఎ.ఆదినారాయణ -పోతవరం (గుంటూరు), కె.వి. రమణమూర్తి- బరంపురం (ఒరిస్సా). నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, బి.శ్రీనువాసరావు -హైదరాబాద్, సాంసాళె సునీత-ఎమ్మిగనూరు, గోకవలస మాధురి -విశాఖపట్నం, అప్పన నాగలక్ష్మి- ధవళేశ్వరం(తూ.గో.జిల్లా), చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి- ఒంగోలు, ఆర్.ప్రసన్నకుమార్- తిరుపతి, టి.వి.యల్.శిరీష- విశాఖ పట్నం, యం.సందీప్-నల్గొండ, ఉడాలి భాస్కరయ్య -చెన్నై, ఎ.మంగప్రణవి -హైదరాబాద్, వి.కృపాలత- హన్మకొండ, చుండ్రు బాబూరావ్- రాజమండ్రి, జోశ్యుల భానుమూర్తి- భీమవరం (ప.గో.జిల్లా), యం.అంజిరెడ్డి -ఒంగోలు, కె.శైలజ-రావులపాలెం, హార్షకంటి సాహు-శ్రీకాకుళం, భార్గవరపులక్ష్మిసింధుజ-ధూళిపూడి(గుంటూరు), జి.అశ్విని-హస్తినాపురం, మల్లంపల్లి వీణాకుమారి-జి.యస్.ఐ, అద్దంకిసీతాదేవి-హైదరాబాద్, యస్.బాలప్రభావతి-చావలి (గుంటూరు).

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

సోమజాజుల సంగమేశ్వరశర్మ-విశాఖపట్నం, ఏ.అశోక్‌కుమార్‌రావు-గుర్రంపోడ్ (నల్గొండ), యన్.లీలాప్రసూన-హైదరాబాద్, యస్.విశాల్-అనకాపల్లి, కె.వెంకటేష్-పేదపుడి, ఆలా కృష్ణమూర్తి- కరవడి(ప్రకాశం), ఎ.కె.నిషా-చిత్తూరు, జి.యస్.శ్రీనివాసరావు-బొబ్బిలి(విజయనగరం), ఎం.ఎ.యస్. లక్ష్మి -కాకినాడ, షెక్ బాహాప్రక్రుద్దీన్-నంధ్యాల(కర్నూలు), ముగ్గళ్ళ రాజ్‌కుమార్-మాల్కాజ్‌గిరి, పి.పాపారావు-విశాఖపట్నం, బి.శ్రీనివాసప్రభాకర్-హైదరాబాద్, ఈ.రెడ్డిబాబు- కదిరి.

## 'సరిగపదమని-23

### జవాబులు

అడ్డం: 1.సినారె 3.అనగన 6.అన్నయ్య 7.నీన్ను 8.ఇది 9.మౌనము 12.పారి 13.చెలికాడు 16.కిల 17.సిగ 18.రతి 20.లలితా 22.ఓ 24.ఈ 25.నీడ

నిలువు: 2.నామది 3.అయ్యొయ్యొ 4.గని 5.నన్ను 6.అభినవ 8.ఇదే పాట 10.గాలికి 11.నాడు 14.కాల 15. వగల 18.రత 19.చిత్రం 21.లిపి 23.బండ

**కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:**

కే. వసంతకుమార్- దేవరకొండ, వేలుపుచర్ల హార్షిత- హైదరాబాద్, సాయి హార్షిత- అనంతపురం, కె.విజయలక్ష్మి- హైద్రాబాద్, ఎ.టి.కాశీనాథ్- హైద్రాబాద్, మండలీక సుబ్బారావు- కాకినాడ, పి. హిమబిందు - బట్టిలంక(తూ.గో.జిల్లా), కె. లక్ష్మీనారాయణరెడ్డి-నాందేడ్ (మహారాష్ట్ర) పి.నాగేశ్వరరావు- బెంగుళూరు, నందూరి రామానుజాచార్యులు- జగ్గయ్యపేట, సి.హెచ్. రామ్‌మోహన్‌రావు - విశాఖపట్నం, ఎ.అశోక్‌కుమార్‌రావు- గుర్రంపోడ్ (నల్గొండ), యల్. సూర్యనారాయణ-పానువెల్, యం.బిందుమాధవి- హైద్రాబాద్, కె. రోహిణి దేవి- హైద్రాబాద్, మైసూరు కీర్తన -మదనపల్లి, మయూరి రఘు- హైద్రాబాద్, పాణ్యం రుక్మిణీదేవి- కర్నూలు, వహీదా ఖైసర్-సికింద్రాబాద్, సాదినేని వెంకటేశ్వర్లు- కాజీపేట (వరంగల్), చెరుకుపల్లి రామచంద్రమూర్తి- కాకినాడ, గోపాల వ్యాఘ్రేశ్వరరావు- రాజమండ్రి (తూ.గో.జిల్లా), మమ్.ఎస్.ఎన్.గౌరి- రాజమండ్రి(తూ.గో.జిల్లా), ఎ.యస్.యన్.శర్మ- కోల్‌కటా, ఎన్.పి.ఎస్.శర్మ-హైద్రాబాద్, బి.సాయిలత- విజయవాడ, రాయచోటి కృష్ణమూర్తి- డోంబివిలి (వెస్ట్) (మహారాష్ట్ర), సామంచి సుధాకర్- విశాఖపట్నం, తాలాడ అరుణ్‌గాంధి- బారువా(శ్రీకాకుళం), ఆర్. ఉషావినోద్- హైద్రాబాద్, కె. రఘునాథాచార్లు-కడప, కె.వి.హేమంత్ సాయిరాం- నెల్లూరు, సి.ఛాయదేవి- విజయవాడ, ఆలా కృష్ణమూర్తి- వలేటివారిపాలెం(ప్రకాశం), దోర్నాల పద్మా- కరీంనగర్, ఎ. జ్యోతి- హైద్రాబాద్, కె.కె. విశ్వనాథం- హైద్రాబాద్, పి. కామేశ్వరి- హైద్రాబాద్, నీహారిక- బరంపురం(ఒరిస్సా), యం.మాధురి రంగారావు- నల్గొండ, విహారా శేషసాయి- సత్తెనపల్లి, పి.పాపారావు- విశాఖపట్నం, ఉషాసుజాత- హైద్రాబాద్, కె.వి.దుర్గామోహనరావు-నల్గొండ, యస్.ఆర్. సుబ్రహ్మణ్య- శ్రీశైలం ప్రాజెక్టు కాలని(కర్నూలు), వై. భానుప్రసాద్- కర్నూలు, ముటుకూరు వసుంధర-హైద్రాబాద్, ఆర్.యస్. సత్యవాణి- సికింద్రాబాద్, సహారె ఈరణ్ణ-ఆదోని, సరస్వతుల వి.యస్.యస్. భాస్కర్- రాజమండ్రి, భాస్కర్ల శ్రీనాథ్- మచిలీపట్నం, వి. వెంకటరమణయ్య- కడప, కె.వి.సరస్వతి-హైద్రాబాద్, పి.రాజగోపాలరావు- గూడురు, పి.బి. భారతి- హైద్రాబాద్, కె.బాలసుబ్రహ్మణ్యం- శ్రీకాకుళం, వడగూరి మహతి- వైజాగ్, టి.వి.రాణి- నల్గొండ, ఎ.టి. శ్రీనివాసన్- అనంతపూర్, అడిదం శారద- నెలిమర్ల (విజయనగరం), సురభి ఉమాసుశీల-కాకినాడ, ముగ్గుళ్ళ రాజ్‌కుమార్-మల్కాజ్‌గిరి, యస్.వి.కృష్ణ- హైద్రాబాద్, కె.లక్ష్మీకాంతమ్మ- నెల్లూరు, పింగళి అశ్వత్థ నారాయణ- ఒంగోలు, టి.శ్రీహరి - ఒంగోలు, పి. శిరీష కుమార్- రాజమండ్రి, లుంబూరు లక్ష్మీప్రసాద్- హైద్రాబాద్, ఎస్. విజయలక్ష్మి- హైద్రాబాద్, రాచర్ల రోహిణి-హైద్రాబాద్, టి.యస్.వత్సల- సాయినాథపురం(రంగారెడ్డి), అవసరాల మణి- విశాఖపట్నం, కె. శ్రీచంద్రలేఖ- జంగారెడ్డి గూడెం, జి. నాగదుర్గా- హైద్రాబాద్, శ్రీహరి రామం- శంకర్‌నగర్(నిజామాబాద్), యల్లాపంతుల చందు- శ్రీకాకుళం, పి.సత్యనారాయణ -నెల్లూరు, యస్. భారతిరాజు- విశాఖపట్నం, వెలుటూరి ప్రశాంతి- హైద్రాబాద్, ఎ.వి.జె.అప్పారావు- విశాఖపట్నం, అడపా విఘ్నేశ్వరరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), జి. విజయలక్ష్మి- విశాఖపట్నం, పర్సా వాసుదేవరావు- దేవరకొండ(నల్గొండ), స్వప్న వెంకటేష్- హైద్రాబాద్, పప్పు అప్పారావు- శ్రీరాంనగర్ (విజయనగరం), ఎన్.సి. సంపత్ కుమార్- అనంతపురం, ముప్పిరాల వెంకటరమణ- హైద్రాబాద్, కోడూరు సత్యనారాయణ- కడప, ఎ.మంగళప్రణవి- హైద్రాబాద్, పేరాల శ్రీవాణి- వైజాగ్, పద్మావతి కృష్ణమాచార్యులు-సికింద్రాబాద్, కోపల్లె కృష్ణవేణి- నాచారం(రంగారెడ్డి), బి.సాయిశ్రీ అపర్ణశ్రీదేవి- హైద్రాబాద్, యం.అంజిరెడ్డి- ఒంగోలు, కె.వి.యస్.యస్.భగవాన్- రాజమండ్రి, సామంచి రాధ- విజయవాడ.

**ఒక తప్పుతో వ్రాసిన వారు:**

టి.విజయలక్ష్మి- హైద్రాబాద్, భోగరాజు సుబ్బారావు- విశాఖపట్నం, జి.విజయలక్ష్మి- సికింద్రాబాద్, ఆర్.సత్యరాజన్- కరీంనగర్, యం.యస్.ఆచార్య- హైద్రాబాద్, కొల్లి జయరామప్రసాద్‌వర్మ- గంపలగూడెం(కృష్ణా), పి. మహాలక్ష్మి- కాకినాడ, ఎ.పి.బాబు- విశాఖపట్నం, సుమదేవరాయలు- హైద్రాబాద్, బి.మంజుళ- నెల్లూరు, యం.వి రాఘవమూర్తి- రాజమండ్రి, వి.వి.రమణి- బచేలి, బీరా మధుబాబు- గోవాడ(వైజాగ్), బి. హిమబిందు- హైద్రాబాద్, వనం జానకీదేవి- పాతపాల్వంచ(ఖమ్మం), భువనేశ్వరి - శ్రీకాళహస్తి, కఠారి చంద్రమోహన్- హైద్రాబాద్, యు.ఫణిధర్‌కుమార్-కరీంనగర్, యం. వెంకటమురళీధర్‌రెడ్డి- కడప, ఈ.రాధిక- హైద్రాబాద్, యం.జగదీశ్వరరావు- విశాఖపట్నం, లంకా శ్రీదేవి-ముంబాయి, బి. మురళీధరరావు- దుండిగల్(రంగారెడ్డి), పెయ్యేటి రంగారావు- హైద్రాబాద్, రాఘవి,ఎ. పతాక్, -ముంబాయి, మంచెం విజయ- కాకినాడ, కావేరి రాం- హైద్రాబాద్, ఆర్. ఫణిబాల-ధవళేశ్వరం, ఆలవారుశెట్టి రాధాకృష్ణ- నెల్లూరు, ఉడాలి భాస్కరయ్య-చెన్నై, పి. నాగరాజు- జానకంపేట(నిజామబాద్), జి.వి. రఘుశేషు- హస్సన్(కర్నాటక), ఆర్. శ్రీనివాస్- బెంగుళూరు, యస్.టి.పి.శరత్‌చంద్- నూజివీడు(కృష్ణా), గొర్తి రాణి- రాయగడ, వి. సునీల్ రెడ్డి- విశాఖపట్నం, మేడా మస్తాన్‌రెడ్డి- విశాఖపట్నం, మేడాపద్మావతి- విశాఖపట్నం, యం.పి.ధర్మరాజు- నల్గొండ, వి.వి. రమణమూర్తి- తాటిపర్తి (తూ.గో.జిల్లా), జె.బాబురావు-గుడివాడ(కృష్ణా), వై.రాజేష్- విశాఖపట్నం, యం.డి.లతీఫ్-నాచారం(రంగారెడ్డి), ఉప్పల కిషన్- ఆసీఫాబాద్(ఆదిలాబాద్), వల్లూరి సుశీలరావు- చెన్నై, అల్లూరి. రామారాజు- విజయవాడ, కె. జ్యోతిశర్మ- కర్నూలు, ఉ.ఉ. ఉ.- ఎమ్మిగనూరు, వంగా పద్మజానారాయణ- విజయవాడ, డి.పద్మావతి- హైద్రాబాద్, నరెడ్ల అచ్యుతరామం- అల్లిపూడి (తూ.గో.జిల్లా), జి.పి. శ్రీనివాస్ & జి. కీర్తన- విశాఖపట్నం, నారోజు శంకరాచార్యులు- చిలుకానగర్, మారే మండసత్యవాణి- పాతపట్నం(శ్రీకాకుళం), నిమ్మగడ్డ శ్రీనివాసబాబు- పామర్రు(కృష్ణా), వానపల్లి నారాయణరావు- సాలూరు(విజయనగరం), జి. జయలక్ష్మి- కర్నూలు, జి. జయచంద్రగుప్త- కర్నూలు, షేక్ గౌస్ మొహిద్దీన్- కడప, పక్కి చక్రవర్తి- గరివిడి(విజయనగరం), పి. స్పందన్‌బాబు- కరీంనగర్, జి. కళ్యాణి- కర్నూలు, ఆర్. ఉషారాణి- న్యూఢిల్లీ, మారం ఉమామహేశ్వరి- హైద్రాబాద్, కనకదండి భానుమతి- టాటానగర్(జార్ఖండ్), జె.అహల్య- మెహదీపట్నం, మంకాల. లక్ష్మి- హైద్రాబాద్, చుండ్రు కిరణ్‌చౌదరి- రాజమండ్రి, కె.వి. భానుభూషణ్- కోల్‌కటా, టి. ఉదయలక్ష్మి- సికింద్రాబాద్, జె.యస్. శేఖర్- తిరుపతి, యం. అనుపమ్‌కుమార్- అనకాపల్లి, టి.వి.ఆర్. సూర్యనారాయణమూర్తి- ఆచంట (ప.గో.జిల్లా), తాతిరాజు జగన్-బిర్హంపూర్ (ఒరిస్సా), ఎ. రాధికా- అమలాపురం, దూలంరాజు- హైద్రాబాద్, సి.వి. శాస్త్రి- పర్లాకిమిడి (ఒరిస్సా), క్రి ఝాన్సీ- హైద్రాబాద్, చివుకుల చిరంజీవి- ఒంగోలు, టి. శ్రీనివాసరావు- గురజాల, జ్యోత్స్న భానుమూర్తి- భీమవరం, పి. విజయసారథి- కర్నూలు, పి.హెచ్. శ్వేత-చీపురుపల్లి(విజయనగరం), ఆరిగ నరసింహారావు- మార్కాపురం (ప్రకాశం), పుణ్యాల శ్రీలక్ష్మి- సత్తెనపల్లి, ఓగిరాల లక్ష్మీరఘుకుమార్- నెల్లూరు, యం.వి.యస్.యన్. శాస్త్రి- విజయవాడ, వాస్తువరలక్ష్మి రామచంద్ర- నెల్లూరు, పుణ్యాల రాజ్యలక్ష్మి- సత్తెనపల్లి, ఐ.యస్.వి. సత్యనారాయణ- రాజమండ్రి, ములుగు చన్ద్రశేఖరు- జగ్గయ్యపేట(కృష్ణా), జూపూడిరూపవతీదేవి- చైతన్యనగరు(గుంటూరు), కె. క్రిష్ణా-జగన్నాధపూర్(మహబూబ్‌నగర్), ఉప్పాల మోహనబాబు- అవనిగడ్డ(కృష్ణా), కురుగంటి వెంకటసుబ్రహ్మణ్యం- హైద్రాబాద్, ఎన్. అరుణకుమారి- ఎలమంచిలి, దూర్జటి వేంకటేశ్వరరావు- మునుగోడు(నల్గొండ), ఎన్. జగన్మోహనరావు- కరీంనగర్, ఇ. మురళీ కృష్ణా- చిత్తూరు, అద్దంకి సీతాదేవి- హైద్రాబాద్, అద్దంకి శ్రీరామచంద్రమూర్తి- హైద్రాబాద్.

**రెండు తప్పులతో వ్రాసిన వారు:**

శ్రీపాద స్వర్ణలత- న్యూఢిల్లీ, బావరాజు వెంకట మల్లిఖార్జును- హైద్రాబాద్, ఏ.బి.వి.ఎస్.రమేష్- వేలూరు, తాడి రంగారావు- రాజమండ్రి, పి.వి.లక్ష్మి- రామగుండము, చివుకుల సుబ్రహ్మణ్యం- ఒంగోలు, జి. పాండురంగశర్మ- హైద్రాబాద్, ఎ. ఆదినారాయణ - చిలకలూరిపేట(గుంటూరు), కేతవరపు ఈశ్వరసాయి- సత్తెనపల్లి, విస్సా వెంకట సత్యవరప్రసాదరావు, పినపళ్ళ(తూ.గో.జిల్లా), ఎ. శివరామక్రిష్ణ- సరాపాక(ఖమ్మం), యల్.వి.యస్. భగవాన్-గండిపాలెం( నెల్లూరు), కె.పాల్‌సుందరం- కొవ్వూరు(ప.గో.జి), మద్దాలి సువర్చలా శ్రీనివాస్- హైద్రాబాద్, ఎ. జ్యోతి మణి- హైద్రాబాద్, సాలా దేవి రాహుల్- విశాఖపట్నం, వై. ఆర్. నాయుడు- పెద్దచెన్నయ్యగారిపల్లె(చిత్తూరు), వై.ఏడుకొండలు- చిర్యాల్(వరంగల్), సహారె ఇందిర- కళ్యాణ్(వెస్ట్),పింగళి కనకవల్లి- గుంటూరు, బి.కవిత- తిరుపతి, కె.మురళీమోహన్- మార్కాపురం(ప్రకాశం), యస్. శారద- విశాఖపట్నం, వేముల శృతిగీతిక-నిడుబ్రోలు (గుంటూరు), వి.వి. సూర్యనారాయణ మూర్తి- కాకినాడ, ఎ.యస్.లక్ష్మి- న్యూ ఢిల్లీ, బి.యన్. కామేష్- సికింద్రాబాద్, ఎ. కృష్ణాలత- హన్మకొండ, పి. నరసింహమూర్తి- హైద్రాబాద్, ఇ.వెంకటేశ్వర్లు- సిమెంట్‌నగర్(కర్నూలు), పసుపులేటి ఝాన్సీలక్ష్మీభాయి- మొగలికుదురు(తూ.గో.జిల్లా).

**మూడు తప్పులతో వ్రాసిన వారు:**

పి. శ్రీలక్ష్మి- లక్నో, ఉదయభాస్కర్ & విజయ- రాజమండ్రి, పి. బాలామణి- శ్రీకాకుళం, రావుల వేణుగోపాల్- కాజీపేట, రామవరపు శోభారాణి- హైద్రాబాద్, ఆత్మూరి శ్రీ పల్లవి- హైద్రాబాద్, కె. సుధాకర్ దేవి- చీరాల, యం.బదారి లక్ష్మి- బొబ్బిలి, కె. హేమవజకుమారి- విజయవాడ, వీరంరాజువీరి వెంకటేశ్వరరావు- హైద్రాబాద్, క్రి సీతారామగిరి- కాకినాడ, వేంద్ర స్వాతి తేజస్వి- హైదరాబాద్, వేంద్ర బాలస్వప్న- హైద్రాబాద్, యం.క్రిష్ణా- గుంటూరు, కె. రామారావు- బళ్ళారి, ఎ.సరోజిని దేవి- జగ్గయ్యపురం, యం. డబ్ల్యూ. ఆర్.కె. శర్మ- విజయనగరం, యు.గుప్తేశ్వరరావు-శ్రీకాకుళం, వరయోగి రామమోహనరావు- సికింద్రాబాద్, ఇంద్రకంటి రాము- హైదరాబాద్.

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




**ఎ. సుబ్బారావు, బ్రాడీపేట,గుంటూరు.**

ప్ర॥ ఆడది కోరుకునే వరాలు రెండే రెండు అని అంటారు అవిఏవి?

జ॥ అంట్లుతోమే అత్త, వంట చేసే భర్త.

**మునిశ్రీలత, పూణే**

ప్ర॥ చీరల షాపు ఓనర్‌ని పెళ్లిచేసుకుంటే?

జ॥ రిసెప్షన్ గురించి శుభలేఖల్లో 'ఈ అవకాశం ఒక్కరోజు మాత్రమే' అని వ్రాస్తాడు.

ప్ర॥ ఆడవాళ్లను చూసి మగవాళ్లు భయపడేరోజు ఎప్పటికైనా వస్తుందంటారా?

జ॥ సంవత్సరానికోమారు రాఖీ పండగ రూపంలో వస్తోందిగా.

## డబుల్ రోల్



ఈ కాస్తంత **అల్లం** కోసం **అల్లంత** దూరం వెళ్లాలా?

**మామా ..... మా** మానాన మేముంటే మధ్యలో నీ గొడవేంటి?

**రవి** ఏదో **జార** విడచిన్నట్టున్నాడు.

**- ఆదిరాజు & మూర్తి (చందానగర్).**



## ఈ రూటే వేరు




**ఉపదేశం** - **చిన్న** దేశం

**జడ త్వం** - **జడ** కలిగివుండటం

**నాటు** వైద్యం - **Not** వైద్యం - వైద్యం కాదు

**-ఆదిరాజు , చందానగర్.**

## చిలిపి లిపి




'Raw'...'Come'....D - రాకండి

G D - జీడి

**-బి. చైతు(చందానగర్)**

## పేరు - రిపేరు



సీతయ్య - సింహాద్రి - సమరసింహారెడ్డి - ఒకే కుటుంబం
బావగారూ బాగున్నారా - మీ ఇంటికొస్తే ఏం ఇస్తారు
మా ఇంటికొస్తే ఏం తెస్తారు
ఆమె - ఇంట్లో శ్రీమతి వీధిలో కుమారి -
అతడు - ఇంట్లో రామయ్య వీధిలో కృష్ణయ్య

**-టి.నవీన్, హైదరాబాద్**

## చిలిపి కవిత



ఓ రోజు మా ఇంట్లో చేశారు మీగడ
దానికోసం మేం అంతా ఒకటే రగడ
దాంతో అంకుల్ ఇచ్చారు ఓ చెరుకుగడ
రసం తీసి తాగాం గడగడ
వెంటనే మొదలయ్యింది కడుపులో గడబిడ
ఇది చూసి మా నాన్న తిట్టారు అంకుల్ని చెడామడా
వాయించారు మా దవడల్ని ఎడాపెడా
అంతే.... ఓ గంట వరకు తగ్గితే ఒట్టు మా గుండెల్లో దడదడ

**-దేవులపల్లి పార్వతిరామ్మూర్తి, విజయవాడ**

## పేరడీ పెరేడ్



ప॥ ఎలా ఎలా ఎలా ఎలా లొంగదీయను
నా బండ మొగుడిని, జగమొండి మొగుడిని
పిలక చేత పట్టి నాల్గు దులిపి చూడనా
అలకబూని రేయి, పగలు ఏడిపించినా
వాలు జడను తాడులాగ, మెడచుట్టూ తగిలించి
లాగీ.....లాగీ.....బిగియించనా ॥ఎలా ఎలా॥
చ॥ రామ చిలుక లాగ కొరికి పళ్ళు గాట్లు పెట్టినా
రాజీపడిపోయి అతని రెండు కాళ్ళు పట్టనా
అరికాలితో త్రొక్కనా మురిపెం నటియించనా
ఏదో ఏదో చేసెయ్యనా........ ॥ఎలా ఎలా॥
చ॥ పాలలోన మత్తు మందు కలిపి ఇచ్చి చూడనా
లోపాలు వెదికి తగవు పెట్టి రాళ్ళు బాగా రువ్వనా
మంత్రగాడి నాశ్రయించి మార్గమేదో అడగనా
చీమకైన తెలియకుండ చేతబడిని చేయనా
ఏదో ఏదో చెసేయ్యనా.... ॥ఎలా ఎలా॥
(నువ్వులేక నేను లేను చిత్రంలో ఎలా ఎలా ఎలా ఎలా తెలుపను పాటకు పేరడీగా...)

**-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.**

## షార్ట్‌కట్స్




అవసరాల రవి - అర }
కొణెదల రమ - కొర }
గాదె లంబోదరం - గాలం }
ఎలిమినేటి రజిత - ఎర }
సహోధ్యాయుల దాశరథి- సదా }
మడకశిర జానకి - మజా }

**-బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం**

**ఈ సంచికలోని పేరడీ పెరేడ్‌ని రాసిన తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం గారికి సోహన్ మ్యూజిక్ వారు 'గౌరి' సినిమా పాటల ఆడియో సి.డి.ని బహుమతిగా ప్రకటించారు. అతి త్వరలో ఈ సి.డి.ని పోస్ట్ ద్వారా పంపించడం జరుగుతుంది.**



సెప్టెంబరు 26 హేమంత్ కుమార్ వర్ధంతి సందర్భంగా.......

## రసజ్ఞ శ్రోతలకు ఉత్కృష్టమైన సంగీతపు విందునిచ్చిన

# హేమంత్ కుమార్



..........ఆయన గురించి వ్రాయాలంటే 'బరువైన ఆడంబరాలు శబ్దధార' అవసరం లేదు..

......వెన్నెల రాత్రి డాబాపై మల్లెపూల పందిరి 'సౌరభాల'ను తల్చుకునే అవసరంలేదు.

......పదాల పోహళింపు.. స్వరాల మేళవింపులూ అవసరంలేదు..

మనం కాస్తంత 'కాన్ -సేన్' లమైతే చాలు...! అదీ 'కాని' వారు ఇవి వినండి......!

* 'యా దిల్ కి సునే దునియా వాలోఁ' (అనుపమ -1966)
* 'న ఏ చాంద్ హోగా ' (షర్త్ -1954)
* 'ఏ నయన్ డరేఁ డరేఁ' (కొహ్రా -1964)
* బేకరార్ కర్‌కే ముఝే యూఁ న జాయియే - (బీస్‌సాల్ బాద్ 1962)

ఇవి చాలు.... వీటిలో ఏ ఒక్కపాట రేడియోలో వచ్చినా, ఓ క్షణం ఆగి - అలాగే నిలబడిపోయి, పూర్తిపాటను విని, తల పంకించి మౌనంగా వెళ్ళిపోయే రసిక శ్రోతలు ఎందరో ఉన్నారని చెప్పడానికి !

ఈ గీతాలన్నీ ఆయన స్వీయ సంగీత దర్శకత్వంలో ఆయన స్వయంగా పాడినవే....

అందులోనూ 'బీస్ సాల్‌బాద్', 'కొహ్రా', 'ఫరార్', 'రాహ్‌గీర్', 'ఖామోషీ' లకు ఆయన నిర్మాత కూడా.

హిందీ సినీ సంగీత రసికులకు అందమైన మరచిపోలేని 'సదాబహార్' గీతాలను, చిత్రాలనూ అందించిన ఆ 'రవీంద్ర సంగీత్' అభిమాని - అయిన హేమంత్ కుమార్ ముఖర్జీ (1920-1989) సినిమా 'తళుకు బెళుకుల' స్వప్న నగరి 'బాంబే', కన్నా రవీంద్ర సంగీత రసాస్వాదన ఉన్న 'కలకత్తా' ను అభిమానించిన సినీ నిర్మాత.. సినిమా సంగీతంతో పాటు వ్యక్తిగత పాటల కచ్చేరీలను అభిలషించిన మధుర గాయకుడు...

రవీంద్ర సంగీతాన్నీ, రసికుల సాన్నిధ్యాన్నీ మనసారా వాంఛించిన మహామనీషి...

'నాగిన్' లో 'తన్ డోలేఁ మెరామన్ డోలేఁ' లాంటి అద్వితీయమైన గీతంతో రాత్రికి రాత్రే అలనాటి మేటి సంగీత దర్శకుల వరుసలో వెళ్ళి -అక్కడే సుఖాసీనుడైయ్యాడు.

హేమంత్ సంగీతం 'నాగిన్' కు ఒక హైలైట్ అనుకుంటే, లతా గొంతు- వైజయంతీమాల నటన ఆ సినిమాకు 'న భూతో న భవిష్యతి' లా, మైలురాయిలా నిలబెట్టాయి...గమనించండి. 'నాగిన్' లోని గీతాల అందాలు-

* 'సున్ రసియాఁ, కాహేకో జలాయే జియాఁ'
* 'మెరా బదలీమే ఛుప్ గయా చాంద్ రే'
* 'తెరీ యాద్ మే జల్‌కర్ దేఖ్ లియా ఁ'
* 'ఊంచీ ఊంచీ దునియాఁకీ దీవారే సైంయా తోడ్‌కే'

అంతవరకు 'రవీంద్ర సంగీత్' తో బెంగాలీ వాళ్ళకు చేరువైన 'హేమంత్' ఈ పాటలతో యావద్భారత దేశ రసికుల గొంతున 'తాయెత్తయ్' కూచున్నాడు... ఆయన పేరు అద్వితీయుడైన సంగీత దర్శకుడిగా పాకింది.

లతా మంగేష్కర్ ఓసారి తీవ్రంగా జబ్బు పడింది.... "గొంతు పోయిందేమో -మళ్ళీ పాడగల్గుతానో లేనో" అన్న బెంగతో తీవ్ర మనస్తాపానికి లోనైంది - ఏ సంగీత దర్శకుడికీ అందుబాటులో లేదు... ఆమెకోసం నెలలైనా ఫర్వాలేదు, వేచి ఉంటాను, కాని, ఆమె తోనే పాడించాలీ అని భీష్మించుకూచున్న హేమంత్ ఎక్కడలేని ఓపికా వహించాడు...,

సినిమా నిర్మాణం ఖర్చులతో కూడుకున్న పని... నెలల తరబడి ఎదురు చూస్తూ గడిపితే ..'సినీ ప్రపంచంలో కుదరదు'....

లతాలో నీరుకారిపోయిన ఆత్మవిశ్వాసాన్ని తిరిగి నింపిన ఘనత 'హేమంత్'దే..! రిహార్సిల్స్ పేర్న ఏకంగా పాటనే రికార్డు చేసి విన్పించాడు. ... ఆనందబాష్పాలతో లతా మొహం వికసించిన పువ్వు అయిందో లేదో తెలియదు కాని, రసికులు నేటికీ సొంతం, ఆస్వాదించే ఆ హాంటింగ్ మెలోడీని ఎప్పుడూ మర్చిపోరన్నది అక్షరాల సత్యం.

అదే....1962లో 'బీస్‌సాల్ బాద్' కోసం సోహనీరాగం లోని - 'కహీఁ దీప్ జలే కహీఁ దిల్' ......అయింది.

"సంగీత దర్శకుడే గాయకుడైతే - గీతం పూర్తి రస స్పర్శతో త్వరగా పట్టు పడుతుంది- గాయకుడే సంగీత దర్శకుడైతే, అతడు సృష్టించే గీతాల్లోని కొన్ని పట్లు అతని గాత్రధర్మానికి దగ్గర ఉంటాయి".

రఫీ కూడా తన రేంజ్ చూసి - సంగీత దర్శకుడు కావాలనుకొని -మానేసాడు - లతా ' ఆనంద ఘన' పేరుతో కొన్ని మరాఠీ సినిమాలకు సంగీత దర్శకత్వం చేసి, విజయాన్ని సాధించింది.

హేమంత్ కుమార్ పుట్టింది 'బనారస్' లో (16జూన్ 1920)బాల్యం అంతగా పేరులేని 'జైనగర్' లోని 'బహరూ' అన్న ఊళ్ళో సాఫీగా సాగిపోయింది. స్కూళ్లో 'సుభాష్ ముఖోపాధ్యాయ్' తో పెనవేసుకున్న స్నేహం... క్లాసులోని బల్లలూ, టిఫిన్ డబ్బాలపై సాగే సంగీతం, 'కబిగాన్' (కవి గానం)లతో సంగీతం పట్ల వ్యామోహం పెరిగింది......'హేమంత్'లోని

## మిల్కా మ్యూజిక్ ఆధ్వర్యంలో తెలుగు ఆల్బమ్

న్యూస్ ఫ్లాష్

ప్రతిభ గల కళాకారులతో మిల్కా మ్యూజిక్ ఆడియో రికార్డింగ్ కంపెనీ ఆధ్వర్యంలో త్వరలో ఓ తెలుగు వీడియో ఆల్బమ్ రూపొందనుంది. దీనికి సంబంధించిన పాటల్ని ఇప్పటికే రికార్డింగ్ జరిపామని మిల్కా మ్యూజిక్ అధినేత, గీత రతయిత, దర్శకుడు వినోద్‌వర్మ తెలిపారు. 2000 సంవత్సరంలో స్థాపితమై కొన్ని కారణాల వల్ల ఆగిపోయిన తమ సంస్థ ఈ అల్బమ్‌తో పునః ప్రారంభమవుతోందని ప్రతిభ గలిగి అవకాశం రాని గాయనీ గాయకులు, గేయరచయితలు, సంగీత దర్శకులు, మిమిక్రీ కళాకారులు హైద్రాబాదులోని ఆర్టీసీ క్రాస్‌రోడ్స్‌లోగల తమ కార్యాలయంలో గానీ, ఫోన్ నెంబరు 27624587 లో గానీ సంప్రదిస్తే వారికి చక్కని అవకాశమిస్తామని వినోద్‌వర్మ పేర్కొన్నారు. ప్రస్తుతం ఆల్బమ్ కోసం కళాకారుల ఎంపిక జరుగుతోందని, దీని షూటింగ్‌ని అతి త్వరలోనే ప్రారంభిస్తామని ఆయన చెప్పారు.

'గాయకుడు' విజృంభించాడు- 13సం॥ల చిరుప్రాయంలో ..AIR లో ప్రవేశం .. 6సం॥ల తర్వాత వచ్చింది ఆయన మొదటి గ్రామ్ ఫోన్ డిస్క్. 1940 లో తొలిసారిగా హిందీలో గీతం పాడాడు' కిత్‌నా దుఖ్ భులాయా తుమ్ నే'.....అంతగా పేరు రాలేదు...

ఈ సంగీతం పిచ్చి ఆయన తండ్రికి అస్సలే నచ్చేదికాదు... తల్లికి మటుకు 'ఏదో ఓ రోజు 'హేమంత్' గాయకుడిగా, పంకజ్ మల్లిక్ , సచిన్‌దేవ్ బర్మన్ సరసన వెళ్ళి కూర్చుంటాడు అన్న నమ్మకం ఉండేది...

ప్రఖ్యాత సంగీత దర్శకుడు సలిల్ చౌధురీతోకలిసి ఓ కొత్త రకం సంగీత విభావరి 'కావ్య -గీతి' '(బ్యాలే) ప్రారంభించాడు (1948) అది ఆ రోజుల్లో 'స్మాష్ హిట్' ...(ఇప్పటికీ 'గాన్యేర్‌బొధూ' అన్న గీతం ఒకప్పటి బెంగాల్ సౌభాగ్యానికి ప్రతీకగా నిల్చింది )

హేమంత్‌కు 'బాంబే' విలువు నిచ్చింది. వి.శాంతారాం నిర్మించాలనుకున్న బెంగాలీ సినిమా (శివశక్తి) మధ్యలో ఆగిపోయింది....

అప్పటికే 'హేమంత్' బెంగాల్‌లో ఇంటింటా చేరుకున్నాడు..సంధ్యా ముఖర్జీతో ఎన్నో పాటలు పాడాడు.. 'మధ్యతరగతి రొమాంటిసిజమ్' కు ప్రతీకలు అవి - అప్పుడప్పుడే రంగంలోకి వస్తున్న 'ఉత్తమ్‌కుమార్' ఆఖరి దాకా మిత్రుడయిపోయాడు!

AIRలో వచ్చిన 'గాన్యేర్‌బొధూ' రికార్డ్... అక్కడే బేలా ముఖర్జీతో పరిచయం.....అది పరిణయం దాకా వెళ్ళింది ....(1945)

IPTA తో రవీంద్ర సంగీతంతో విడదీయలేని అనుబంధం... 'భూలీనోయ్', '42', 'ఆనంద్‌మఠ్', 'కష్టీ', 'జిజ్ఞాసా'- 'ఘోర్ ఉఠేచే', 'శాంపోచన్', 'నీర్ ఛోటో ఖటీనాయ్', 'ఇంద్రాణీ', 'సప్తపదీ'.... ఈ డ్రామాలతో కంపోజర్‌గా హేమంత్ బాగా ప్రాచుర్యం పొందాడు.

ఆఖర్న బాంబే రానే వచ్చాడు..

'జాల్', 'నాగిన్', 'అనార్‌కలీ', 'సోలవాఁ సాల్', 'బాత్‌ఎక్ రాత్ కీ', 'బీస్‌సాల్ బాద్', 'ఖామోషీ', 'కొహ్రా', 'అనుపమా'....

'సోలవాఁ సాల్ లో దేవ్ ఆనంద్ కు పాడిన 'హై అప్నా దిల్ తో ఆవారా (' రసికుల గుండె దోచుకుంది. 1958 లో 'బినాకా గీత్‌మాలా'ను అలంకరించింది.

దాదాపు 150 బెంగాలీ సినిమాలకూ, 50 హిందీ సినిమాలకు సంగీతం అందించాడు...సుమారు 2000కు పైగా గీతాలు... పాడేడు. గీతాంజలీ ప్రొడక్షన్స్ పేరున 'నిర్మాత'గా కూడా మారాడు...

'క్లాసిక్ బేస్'లేని గాయకుడన్నారు ఆయన్ని... మాస్ బేస్ ఉన్న, క్లాస్ బేస్ ఉన్న రసికులైతే ఆరాధించాడు...

ఎన్నో అందమైన పాటల్లో మచ్చుకు కొన్ని -

✱ 'న తుమ్ హమేజానో ' (బాత్ ఎక్ రాత్‌కీ / 62 )
✱ 'యాద్ కియా దిల్ నే' (పతితా / 1953)
✱ 'జిందగీ ప్యార్ కి దోచార్ ఘడీ' (అనార్‌కలీ/53)
✱ 'తుమ్హే యాద్ హోగా' (సట్టాబజార్ / 69)
✱ 'జానెవో కైసేలోగ్ థే' (ప్యాసా- 1957)
✱ 'ఘుపాలో యుఁ దిల్ మే ప్యార్ అప్నా' (మమతా / 66)
✱ 'ముఝ్‌కోతుమ్ జోమిలే' (డిటెక్టివ్ - 1958)
✱ ' తుమ్ ఔర్ హమ్' (ఫ్యాషన్ -1957)
-'ఓ రాత్ కే ముసాఫిర్ ' (మిస్ మేరీ )

'సాహెబ్ -బీబీ - ఔర్ -గులాం లో అన్ని పాటలూ....

భారతీయ రసిక శ్రోతలకు ఇంత ఉత్కృష్టమైన సంగీతపు విందు ఇచ్చిన 'హేమంత్ కుమార్' తనజ్ఞాపకాలను ఆత్మ చరిత్ర రూపంలో 'అమార్ గానేర్ స్వరలిపి' (88) అనే పేరుతో పొందుపరిచి...26 -సెప్టెంబర్ 1989 న తెర మరుగై పోయాడు,

.....'ఆయన ఫ్లాట్ తలుపులపై ఆయన 'నేమ్ ప్లేట్' ఇప్పటికీ ఉంది...

.... పుజాస్థలాల్లో ఇప్పటికీ ఆయన గీతాలు విన్పిస్తుంటాయి..

.... అలనాటి ఆణిముత్యాల్లాంటి ఆయన గీతాలు 'కొత్త శీర్షిక'లతో ఇంకా అందిస్తూనే ఉన్నారు క్యాసెట్స్ కంపెనీల వాళ్ళు...

ఆయన లేడు...

కొత్త పాటలింక రావు ...అదినిజం.

**- డా॥ జె.పి. వైద్య**

# హిందీ సినీ సంగీతంలో మైలురాళ్ళు-మజిలీలు

## 1965

ఈ సంవత్సరం విడుదలై మ్యూజికల్‌గా సూపర్‌హిట్ అయిన చిత్రాలలో 'జబ్ జబ్ ఫూల్ ఖిలే' చిత్రం స్థానం మాత్రం ప్రత్యేకం. ఈ చిత్రంలోని అన్ని పాటలు నూవర్ హిట్స్ కావటమే కాదు సినిమా కూడా హిట్ అయింది. ఈ చిత్రంలోని పాటలను ఇవ్వటికీ మరచిపోలేక పోవటానికి కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీల సంగీతం ఓ కారణమైతే, ఆనంద్‌బక్షి సాహిత్యం మరో కారణం.


ఆనంద్‌బక్షి

నిర్మలాదేవి (నటుడు, ప్రస్తుత లోక్‌సభ సభ్యుడు గోవిందా తల్లి) గానం చేసిన ఓ ఠుమ్రీ ఆధారంగా రూపుదిద్దుకున్న 'పర్‌దేశియోం సే నా ఆంఖియాఁ మిలానా....' పాటను అసలు మరచిపోగలమా !? చక్కనైన హాస్యం, అద్భుతమైన విషాదాలను గొంతులో మేళవించిన రఫీ, రెండు వెర్షన్లలతో ఈ పాటను పాడితే, లతా మరో వెర్షన్ పాడింది. సుమన్ కళ్యాణ్‌పురి, రఫీ పాడిన 'నానా కర్‌తే ప్యార్ తుమ్హీ సే కర్ బైఠే...' పాట ఎంత పెద్ద హిట్టో తెలిసిందే...! ఈ పాట కోసమే ఆ సినిమాను 20 సార్లకు పైగా చూసిన వీరాభిమానులున్నారంటే అతిశయోక్తి లేదేమో! 'యే సమా, సమా హై యే ప్యార్ కా'(లతా), 'కభీ పహలే దేఖా నహీఁ యే సమాఁ.... యహాఁ మైఁ అజ్‌నబీ హూఁ'(రఫీ), 'అఫూఁ ఖుదాయా....' (రఫీ), 'ఏక్ థా గుల్ ఔర్ ఏక్ థీ బుల్ బుల్ (నందా, రఫీ)పాటలు ఇప్పటికీ ప్రేక్షకులను అలరిస్తూనే ఉన్నాయి కదా.... ఆ సినిమాలా!?

జోహర్ స్వంత చిత్రం 'జోహర్ మెహమూద్ ఇన్ గోవా' చిత్రంలో షంషాద్‌బేగంతో కలిసి కిశోర్‌కుమార్ పాడిన 'కుచ్ భి కహేఁ యహ దునియావాలే, హమ్ హై అభి జవాఁ' పాట ద్వారా కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ లతో అతని కాంబినేషన్‌కు తెరలేచింది. 'యే దో దివానే దిల్ కే...'(రఫీ, మన్నాడే), 'ధీరే సే చలో మోరీ బాన్కీ హిరనియా...(ముకేష్) పాటలు మంచి హిట్స్ అయ్యాయి.


ముకేష్

'సహేలి' చిత్రంకోసం కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలు స్వరపరిచిన 'జిస్ దిల్ మేఁ బస్ థా ప్యార్ తేరా, ఉస్ దిల్ కో కభీ కా' పాట ముకేష్ కెరీర్‌లో బెస్ట్ హిట్ గా నిలిస్తే, 'పూర్ణిమా' చిత్రంలోని 'తుమ్హే జిందగీ కే ఉజాలే ముబారక్..', 'హమ్ సఫర్ మేరే హమ్ సఫర్ '(లతాతో కలిసి) పాటలు ముకేష్‌కు మంచిపేరు తెచ్చిపెట్టాయి.

**- వచ్చేసంచికలో మరికొంత**

# 'హాసం' క్లబ్ కార్యక్రమ విశేషాలు

## హైదరాబాద్

ఆగస్టు ఆఖరి శనివారం సాయంత్రం ఆంధ్ర బాలానందం క్లబ్ ఆవరణలో జరిగిన హాసం క్లబ్ కార్యక్రమం ఎప్పటిలాగానే హాస్య, సంగీత భరిత అంశాలతో ఆకట్టుకుంది. జిక్కికి శ్రద్ధాంజలి ఘటించడంతో ప్రారంభమయిన సభ ఆగస్టునెలలో జన్మించిన, మరణించిన అనేకమంది కళాకారులను తలచుకుంటూ ముందుకు సాగింది. జిక్కి పాడిన 'ఛాంగురే బంగారు రాజా' పాటను మాధురి, ఎ.పి.కోమల పాడిన 'ఓం నమోనారాయణా'పాటను, రావు బాలసరస్వతి పాడిన 'సలామోయ్ సలీమా'పాటను చైత్ర, జమున అభినయించిన'గోదారి గట్టుంది' పాటను లాహిరి పాడగా సభను నిర్వహించిన ఎస్.వి.రామారావు వారి జీవితవిశేషాలను వివరించారు.

మహిత 'వాణీ, వీణాపాణీ' పాటను పాడి మాజీ చీఫ్ సెక్రటరీ, ప్రస్తుత ఎలక్షన్ కమీషనర్ కాకి మాధవరావు చేతులమీదుగా బహుమతి అందుకున్నారు. మాధవరావు కూడా కరుణశ్రీ పద్యం 'కూర్చుండ మా ఇంట కుర్చీలు లేవు' ఆలపించి ఆకట్టుకున్నారు. అంజనా ప్రియాంకా 'వక్త్ నే కియా' (కాగజ్ కే ఫూల్) పాటను పాడగా, జి.వి.శంకరరావు అన్నమయ్య కవితావైదుష్యాన్ని సభకు పరిచయం చేశారు. చి॥ వశిష్ట 'శివరామకృష్ణా' పాటను ఆలపించింది.



కరుణశ్రీ పద్యం ఆలపిస్తున్న మాజీ చీఫ్ సెక్రటరీ, ఎలక్షన్ కమీషనర్ కాకి మాధవరావు



శ్రీరామరెడ్డి

హాస్యవిభాగంలో హాస్యకవితలతో చిమ్మపూడి శ్రీరామమూర్తి, వివాహవ్యవస్థపై జోకులతో శ్రీరామరెడ్డి, కళ్లు చిదంబరం, ఎల్బీ శ్రీరామ్‌ల కూరగాయలబేరం మిమిక్రీతో శ్రీకాంత్, జోక్స్‌తో జంధ్యాల సుబ్బలక్ష్మి బహుమతులు గెల్చుకున్నారు. మోహనకృష్ణ, రవి అనువాదంపై స్కిట్‌తో, ధర్మాచార్యులు జోక్స్‌తో నవ్వించారు. దాదాపు 30 మంది ఐటమ్స్ ప్రదర్శించిన ఈ సభ వైవిధ్యభరితంగా సాగింది. చివరిలో శర్మ ఘంటసాల భగవద్గీత గానం చేశారు.

'హాసం' మేనేజింగ్ ఎడిటర్ ఎమ్బీయస్ ప్రసాద్ ఆగస్టు నెలలో మరణించిన కళ్యాణ్‌జీ, ముకేష్‌ల జీవితవిశేషాలను తెలుపుతూ 'నాగిన్' సినిమాలో బీన్ కళ్యాణ్‌జీ 'బీన్' వాయించినా ఆ ట్యూన్ కట్టినది హేమంత్‌కుమార్‌కు అసిస్టెంటుగా పనిచేసిన రవి అని చెప్పారు. అలాగే 'రామచరితమానస్' రికార్డింగు సమయంలో సైతం తాను మద్యపానం వదలలేకపోయానని చెప్పుకున్న ముకేష్ నిజాయితీని ప్రశంసించారు.



మహిత

### హైదరాబాద్ హాసంక్లబ్‌లో మెరిసిన నవ్వుల నక్షత్రాలు

★ ఉద్యోగం కోసం నా కాళ్ల పట్టుకున్నాడో నిరుద్యోగ జీవుడు
'ఇస్తాలే, నీ పేరేమిట'ని అడిగితే అన్నాడు - 'వసుదేవుడు'

★ పెళ్లికి ముందు ఆడాళ్ల మెరుపుతీగలు
పెళ్లయి పెళ్లాలయ్యాక కరెంటుతీగలు

★ 'కలర్ టీవీ అడిగితే బ్లాక్ అండ్ వైట్' కొన్నారని అల్లుడి సణుగుడు
'బ్లాకూ వైటూ మాత్రం కలర్లు కావా యేం' మామగారి గొణుగుడు

★ సినిమాహాలులో పక్కసీటావిడ కాలుతొక్కి అన్నాను - 'సారీ'
'మా ఆయననుకుని అరవబోయా, మీరా! పర్లేదు' అందా నారి

- చిమ్మపూడి శ్రీరామమూర్తి

### హైదరాబాద్ 'హాసం క్లబ్'లో ప్రశంసలందుకొన్న ఓ జోక్

★ ఒకతనకి ఏ వస్తువు కొన్నా దానితోబాటు ఏదో ఒకటి ఫ్రీగా ఇస్తారేమోనని ఎదురుచూడడం అలవాటు. ఓ సారి మినరల్ వాటర్ బాటిల్ కొని "దీంతోబాటు ఫ్రీ ఏమీ లేదా?" అని అడిగాడు షాపతన్ని.

షాపువాడికి ఏం చెప్పాలో తెలియలేదు.బాటిల్ అటూ, ఇటూ తిప్పి చూశాడు. 'హమ్మయ్య' అనుకుని "దీంతోబాటు బాక్టీరియా ఫ్రీ అండి. లోపలే వస్తుంది. చూడండి - 'బాక్టీరియా ఫ్రీ' అని బాటిల్ మీదే రాశారు ." అన్నాడు.

మనవాడు తృప్తిపడి వెంటనే కొనేశాడు.

- జంధ్యాల సుబ్బలక్ష్మి

'హాసం క్లబ్'ను ప్రారంభించ దలచినవారు సంప్రదించవలసినది- ఎస్.వి.రామారావు, 040-24160279, 98491 39030

## పలాసా



కిమ్మోజీ పాటకు తబలాపై చిట్టి సహకారం

పలాసా హాసం క్లబ్ 5 వ సమావేశం ఆగస్టు 28న ప్రకాశరావుగారి ప్రార్థనాగీతంతో ప్రారంభమయింది. తమ్మినేని రామారావు ముఖ్యఅతిథిగా హాజరయ్యారు. జిక్కి ఆత్మశాంతికి రెండు నిమిషాల మౌనం పాటించాక బి.వి.రమణ శాస్త్రీయసంగీతాన్ని వినిపించారు. అన్నమాచార్యుల కీర్తనలను రఘురాం, గుణవంతరావులు వినిపించారు. రమేష్ మిమిక్రీ చేసి, ఉమాపతి బెహరా జోక్స్ చెప్పి సభాసదులను ఆనందడోలికల్లో ముంచెత్తారు. చిట్టి తబలా సహకారం అందించగా కిమ్మోజి, మోహనరావు, దాలయ్య, బాబ్జీ ఇత్యాదులు పాత సినిమా పాటలతో అలరించారు.

కన్వీనరు డా॥ రామినాయుడు వందనసమర్పణ గావిస్తూ ఇకపై సమావేశాలు ప్రతినెలా ఆఖరి శనివారంకు బదులుగా ఆఖరి ఆదివారం సాయంత్రం 6 గం॥లకు జరుగుతాయని తెలిపారు.

### ఈ పక్షం సమావేశాలు...

| | | | |
|---|---|---|---|
| రాజమండ్రి | : 19.09.04 | 6.00 p.m. | ☎ 98852 15155 |
| వైజాగ్ | : 19.09.04 | 6.00 p.m. | ☎ 0891 - 2720219 |
| ఏలూరు | : 19.09.04 | 6.35 p.m. | ☎ 98481 41100 |
| హైదరాబాద్ | : 25.09.04 | 6.35 p.m. | ☎ 98491 39030 |
| పలాసా | : 26.09.04 | 6.00 p.m. | ☎ 98486 51615 |





కలియుగ దైవం శ్రీ వేంకటేశ్వరస్వామికి
అక్షర నైవేద్యంగా తాళ్లపాక అన్నమాచార్యుడు సమర్పించిన
సంకీర్తనలు తెలుగుజాతికి తరగని పెన్నిధి వంటివి.
ఆ పద కవితా పితామహుడు రచించిన
ఆయా సంకీర్తనలలోని పదాలెన్నిటికో పండితులు సైతం
సరియైన అర్థాలు నిర్వచించలేని పరిస్థితి ఉంది.
తిరుమల తిరుపతి దేవస్థానంకి చెందిన ప్రముఖ గాయకుడు

### శ్రీ జి. బాలకృష్ణ ప్రసాద్



జి. బాలకృష్ణ ప్రసాద్

నిర్వహణలో అన్నమయ్య సంకీర్తనలను కొన్నిటిని తీసుకుని
వాటిలోని పదాలకు అర్థ తాత్పర్యాలను, భావసౌందర్యాన్ని
విజ్ఞులు, రసజ్ఞులైన పాఠకులకు వచ్చే సంచికనుండి అందించడానికి
'హాసం' సాహసంతో కూడిన ఓ చిన్న ప్రయత్నాన్ని చేస్తోంది.
పాఠకులు ఈ ప్రయత్నాన్ని హర్షిస్తారని,
తమ వంతుగా ఈ క్రింద ఇవ్వబడిన 8 పేర్లలో ఒక పేరుని ఆ శీర్షికకు నిర్ణయిస్తారని ఆశిస్తోంది.

1. అన్నమయ్య సంకీర్తన సౌగంధిక
2. అన్నమయ్య పద సౌగంధిక
3. అన్నమయ్య పద పరాగం
4. అన్నమయ్య పద పుష్కరిణి
5. అన్నమయ్య పద పరీమళం
6. అన్నమయ్య పద భావ దర్శనమ్
7. అన్నమయ్య పద భావహేల
8. అన్నమయ్య పద భావ విలాసం

శ్రీ జి. బాలకృష్ణ ప్రసాద్ గారికి
ఆమోదయోగ్యంగా ఉండే పేరుని సూచించిన
పాఠకులలో ఇద్దరికి ఆదిత్యామ్యూజిక్ వారు
త్వరలో వెలువరించనున్న అన్నమయ్య
సంకీర్తనల సీడీలలో రెండింటిని బహుమతిగా
పంపించడం జరుగుతుంది. పాఠకులు
సూచించిన పేర్లు 'హాసం' ఆఫీసుకి
అందవలసిన ఆఖరు తేదీ 23.09.2004.




నిర్మించిన ప్రతి చిత్రంలోనూ మంచి పాటలే ఉండేటట్లు చూసుకున్న ప్రతిష్ఠాత్మక సంస్థ పి.ఎ.పి.వారి

# భార్యాభర్తలు

లోని పాటలలో గత సంచికలో రెండు పాటలు గురించి చర్చించుకోగా మరో నాలుగు పాటల గురించి ఈ సంచికలో....

ఏమని పాడెదనో ఈవేళ
ఏమని పాడెదనో ఈవేళ
మానసవీణ మౌనముగా
నిదురించిన వేళా
ఏమని పాడెదనో ఈ వేళ
జగమే మరచి
హృదయ విపంచి ॥జగమే॥
గారడిగా వినువీధి చరించి ॥గారడిగా॥
కలత నిదురలో కాంచిన కలలే
గాలిమేడలై కూలిన వేళ ॥ఏమని॥
వనసీమలో హాయిగ ఆడే ॥వన॥
రాచిలుకా నిను రాణిని చేసే ॥రాచిలుకా॥
పసిడి తీగెలా పంజర మిదిగో
పలుక వేమని పిలిచే వేళ ॥ఏమని॥



ఈ పాటను శ్రీశ్రీ రాయగా సుశీల పాడగా కృష్ణకుమారి ముఖ్య పాత్రధారిణిగా అభినయించారు. అక్కినేని, గుమ్మడి, నిర్మల(మ్మ), బేబి ఉమ, రమణారెడ్డి, సంధ్య, చదలవాడ కుటుంబరావు, రేలంగి, సూర్యకాంతం తదితరులు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. కుటుంబం పరువు ప్రతిష్ఠల కోసం, తనతో సవాల్ చేసిన వాడిచేత తాళికట్టించుకునే పరిస్థితులకు తలొగ్గి, కన్న వారిపై గల అభిమానంతో ఆత్మాభిమానాన్ని అణుచుకున్న ఓ యువతి - తనను తాను చిలుకతో పోల్చుకుంటూ పాడే ఊహకు శ్రీశ్రీ ఎంతగా జీవం పోశారో పాట సాహిత్యాన్ని గమనిస్తే చాలు వివరణ అవసరం లేకుండానే అర్థం అయిపోతుంది. ఒక విధంగా వీణ పాటల ఒరవడికి నాంది పలికిన గీతంగా ఈ పాటను పేర్కొనాలి. సింధుభైరవి రాగానికి ఓ మంచి ఉదాహరణగా నిలిచిపోయే ఈ పాటలోని వీణ బిట్స్‌ను ప్రముఖ వైణికుడు కీ.శే.చిట్టిబాబు చేత వాయింప చేశారు యస్.రాజేశ్వరరావు. అప్పటికీ ఇప్పటికీ ఓ చక్కని అభిరుచికి తార్కాణంగా నిలిచిపోయే గీతమిది.

ఆ: ఓ సుకుమార.....నను జేర...
రావోయి ...ఇటు రావోయీ.....
నిలువగ లేని వలపుల రాణి
నీ కొరకే తపించునులే
నిలువగ లేని వలపుల రాణి
నీ కొరకే తపించునులే
అ: ఓ జవరాల ...ప్రియురాల........
ఈనాడే మనదే హాయి.....
చనువుగ నేడు నీ చెలికాడు
నీ దరినే సుఖించునులే
ఆ: కోటి కిరణముల కోరిన గాని
భానుని చూడదు కలువ చెలి ॥కోటి॥
వెన్నెల కాంతి వెలిగిన వేళ ॥వెన్నెల॥
విరియునుగా విలాసముగా ॥నిలువగ॥
అ: వేయికనులతో వెదికిన గాని
తారకు జాబిలి దూరమెగా ॥వేయి॥
కలువల రాణి వలపులలోనే ॥కలువల॥
కలకల లాడి చేరునుగా ॥చనువుగ॥







'ఓ సుకుమార....నిను ..చేర...రావోయి' అనే సాకితో మొదలై 'నిలువగలేని వలపుల రాణి' అనే పల్లవితో సాగే గీతాన్ని శ్రీశ్రీ రాయగా సుశీల, ఘంటసాల ఆలపించారు. కృష్ణకుమారి, అక్కినేని అభినయించారు. అక్కినేనికి వచ్చే కలలాగ ఈ పాటను చిత్రీకరించారు. కథలో అప్పటికి అక్కినేని పాత్రకు వుండే వ్యసనాలు, ధనగర్వం అన్నీ దూరమయి, కృష్ణకుమారిపై ప్రేమ, గౌరవం మాత్రమే ఉంటాయి. ఆ విషయం ఆమెకు అవగాహన కాదు. అందుకే కృష్ణకుమారి పాడే చరణాలలో ఆమెను కలువతోను, చంద్రప్రతాపంతో చెలరేగిపోయే అక్కినేనిని, అతని ధన గర్వాన్ని సూర్యుడితోను, కిరణాలతోను పోలుస్తూ నర్మగర్భంగా శ్రీశ్రీరాసిన తీరు గమనిస్తే -కథతోను కథాగమనంతోను ఆనాటి రచయితలకు పాలు పంచుకునే అవకాశం ఎంతగా ఉండేదో తెలుస్తుంది. సింధుభైరవి రాగంలోని మధ్యమ స్వరాన్ని శృతిగా చేసుకుని యస్.రాజేశ్వరరావు స్వర పరిచిన ఈ పాట చరణాంతాలలో పల్లవిని చేరుకోవటానికి ముందు ఉపయోగించిన ఫ్లూట్ బిట్స్ చాలా బాగుంటాయి. చరణాలలో 'వెన్నెల కాంతి వెలిగిన వేళ' దగ్గర, 'కలువలరాణి వలపులలోనే' దగ్గర వచ్చే ట్యూన్ వింటే -ఎగసి - పడి - లేచే తరంగాల పోకడ గుర్తొస్తుంది.

కనకమా... చిట్టి కనకమా... ముద్దు కనకమా... నా మాట వినుమా...
మనం కలిసిమెలిసుంటె అప్పీలు లేదనుమా
కనకమా... చిట్టి కనకమా... నా మాట వినుమా..
కలిసిమెలిసున్నందుకేగా నీవు కరుణ చూపించావు బాగా ॥2॥
కల్ల కపటం లేని నా కన్నతండ్రిని వేసారి వేధించి వెళ్లగొట్టావుగా
ఆలుమగలకు మధ్య చూడు
మామ అడ్డముంటే ఎంతో గోడు ॥ఆలు॥
ఆనందముగా మనం అనుభవించాలంటే
ఆనందముగా మనం అనుభవించాలంటే
అడుగడుగునా మనకు గుదిబండయైనాడు ॥కనకమా...॥
అన్యాయమగు మాటలేల
అవ్వ... అపహాస్యముల చేయనేల ॥అన్యాయమగు॥
అల్లారు ముద్దుగా నా కోరికలు తీర్చి
ఉల్లాసముగ నన్ను ఓదార్చవేల
మెడనిండ సొమ్ములు పెడతాను
కంచిపట్టు చీరలు కట్టబెడతాను ॥మెడ॥
ఇల్లంత స్వర్గంగా మార్చివేస్తాను
ఇల్లంత స్వర్గంగా మార్చివేస్తాను
ఇంతకన్నా మించి ఏమి చేస్తాను ॥కనకమా॥






ఈ పాటను కొసరాజు వ్రాయగా మాధవపెద్ది సత్యం, స్వర్ణలత ఆలపించారు. రమణారెడ్డి, సంధ్య అభినయించారు. సంధ్య అంటే తమిళనాడు ముఖ్యమంత్రి జయలలిత తల్లి అని ఈ తరం వారికి చెబితే కొంత అర్థమవుతుందేమో! దర్శకుడికి, గీత రచయితకి మధ్య అవగాహన ఉన్నప్పుడు, కథ గురించి పాత్రల వ్యక్తిత్వం గురించి ఆ గీత రచయితకి తెలిసినప్పుడు... ఔచిత్యం, సందర్భశుద్ధి హాస్య గీతాలలోనైనా సాధ్యమేనని నిరూపించే గీతమిది. కథ ప్రకారం రమణారెడ్డి ప్లీడరు గుమాస్తా. అందుకే 'అప్పీలు' అనే పదం పల్లవిలో కనిపిస్తుంది. ఇక చరణాలలో వినిపించే సాహిత్యం అంతా కథానుగుణంగా కథాగమనాన్ని సూచించేదే! ఈ చరణాలను విడమరచి చెబితే సగం కథ చెప్పేసినట్టే - అదీ ఆనాటి హాస్యనటుల, హాస్యగీతాల స్థాయి...!! ఇక సంగీతపరంగా చెప్పుకోవాలంటే పల్లెజనాలనోట జానపద సంగీత రూపంలో ఎక్కువగా వినిపించే హరి కాంభోజి రాగాన్ని అక్కడక్కడ ఈ పాటలో యస్. రాజేశ్వరరావు మిశ్రమం చేశారు. ఇటువంటి మిశ్రమాన్ని రాజేశ్వరరావు గారు 'పూజాఫలం'సినిమాలో స్వరపరిచిన 'వస్తావు పోతావు నాకోసం... వచ్చి కూర్చున్నాడు నీ కోసం.. యముడు వచ్చి కూర్చున్నాడు నీకోసం' అనే పాటలో గమనించవచ్చు.

ఆ: మధురం మధురం ఈ సమయం
ఇక జీవితమే ఆనందమయం
మధురం మధురం ఈ సమయం
అ: చల్లని పున్నమి వెన్నెలలో
ఆ: ఓ......ఓ........ఓ.......
అ: ఎన్నడు వీడని కౌగిలిలో
ఆ: ఆ..ఆ......ఆ...... ॥చల్లని॥
ఆ: కన్నుల వలపు
కాంతులు మెరయగ ॥మధరం॥



అ: కరగిపోయే పెను చీకటి పొరలూ....
కరగిపోయే పెను చీకటి పొరలూ....
ఆ: తొలగిపోయె అనుమానపు తెరలు
తొలగిపోయె అనుమానపు తెరలు
అ: పరిమళించె అనురాగపు విరులు
పరిమళించె అనురాగపు విరులు
ఆ: ఆలరెనె మనసునందన వనముగ ॥మధురం॥



అ: సఫలమాయె మన తీయని కలలూ....
సఫలమాయె మన తీయని కలలూ
ఆ: జగము నిండె నవ జీవనకళలు
జగము నిండె నవ జీవనకళలు
అ: పొంగిపొరలే మన కోర్కెల అలలు
ఆ: భావియే వెలిగె పూవుల బాటగా
ఇ: మధురం మధురం ఈ సమయం
ఇక జీవితమే ఆనందమయం
మధురం మధురం ఈ సమయం



ఈ పాటను శ్రీశ్రీ రాయగా సుశీల, ఘంటసాల ఆలపించారు. కృష్ణకుమారి, అక్కినేని అభినయించారు. రాజేశ్వరరావుకు అత్యంత ప్రియమైన భీంప్లాస్ రాగం ఈ పాటకు ఆధారం. పాటలను స్వర పరచేటప్పుడు ఒక్కొక్కసారి ఇదివరకు అద్భుతంగా కుదిరి హిట్ అయినవే అయినా, తిరిగి మరో రూపంలో అదే ట్యూన్ రావటం అన్నది చాలా సహజంగా జరిగే విషయం. అలా వచ్చిన ఆ ట్యూన్ రెండో పాటకు కూడా నప్పినట్టుగా అమిరి పోయినప్పుడు 'మళ్ళీ మార్చటం, ఇంకోటి ఆలోచించటం ఎందుకు అనిపిస్తుంది'. 1961వ సంవత్సరం లోనే విడుదలైన 'భక్త జయదేవ' చిత్రంలో యస్.రాజేశ్వరరావు స్వర పరిచిన 'యా రమితా వనమాలినా' పాట సంగీత ప్రియులకు గుర్తుండే ఉంటుంది. ఆ గీతం లోని చరణాల్లో గల 'అమృత మధుర మృదుతర వచనేన', 'సకల భువన జన వర తరుణేన' వాక్యాల యొక్క ట్యూన్ -ఈ 'మధురం మధురం ఈ సమయం' పాట లోని 'పరిమళించె అనురాగపు విరులు', 'పొంగి పొరలె మన కోర్కెల అలలు' వాక్యాల యొక్క ట్యూన్ ఒక్కలాగే ఉంటుంది. కావాలంటే గమనించి చూడండి. ఇలాంటిదే కె.వి.మహదేవన్ స్వర జీవితంలో కూడా జరిగింది. 'వీరాభిమన్యు' చిత్రంలోని 'రంభా ఊర్వశి తలదన్నే ' పాటలోని 'కలికి ఒడిలో పులకరించి కరిగిపోవని తనువేలా' లైన్ యొక్క ట్యూన్, 'దాగుడు మూతలు' చిత్రంలోని 'దేవుడనే వాడున్నాడా అని మనిషికి కలిగెను సందేహం' పాటలోని 'తాము నవ్వుతూ నవ్విస్తారు కొందరు అందరిని' అనే లైన్ యొక్క ట్యూన్ ఒక్కలాగే ఉంటాయి. వీటిని చరిత్ర కెక్కించాల్సిన ప్రయోగాలుగా స్వీకరించాలే గాని ఆయా సంగీత దర్శకుల ప్రతిభా పాటవాలను తగ్గించి ఉదహరించడానికి వాడుకోటానికి కాదన్నది వారి స్వరాంబుధిలో మునిగి తేలిన ప్రతి వారు ఒప్పుకుంటారు.

ఇది కాక ఈ సినిమాకు సంబంధించి మరికొన్ని విశేషాలు ఉన్నాయి. ఈ 'భార్యాభర్తలు' చిత్రాన్ని 1963లో తమిళంలో 'ఇరువర్ వళ్ళుమ్'గా తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి కరుణానిధి మాటల రచయితగా శివాజీ గణేశన్, బి.సరోజాదేవీ హీరో హీరోయిన్స్‌గా స్వీయ దర్శకత్వంలో నిర్మించారు ఎల్.వి.ప్రసాద్. తిరిగి అదే చిత్రాన్ని అదే సంవత్సరం 'హమ్‌రాహి'గా రాజేంద్రకుమార్, జమున హీరో హీరోయిన్స్‌గా టి. ప్రకాశరావు దర్శకత్వంలో ఎల్.వి.ప్రసాదే హిందీలో నిర్మించారు. తొలి రోజుల్లో టి.ప్రకాశరావు వద్ద అసిస్టెంట్‌గా ప్రత్యగాత్మ పనిచేస్తే ఎల్.వి.ప్రసాద్ దగ్గర టి.ప్రకాశరావు అసిస్టెంట్‌గా పనిచేశారు. ఇంచు మించు ప్రశిష్యుడైన ప్రత్యగాత్మ తెలుగులో తీసిన చిత్రాన్ని ఆయన గురువు, ఆ గురువుకి గురువు ఇద్దరూ చెరో భాషలో దర్శకత్వాన్ని వహించటం ఓ విశేషం.

'ఇల్లరికం' వంటి హిట్ చిత్రంలో నటించిన జమున ఆ సంస్థ తీసిన తరువాతి చిత్రం 'భార్యాభర్తలు'లో లేక పోవటానికి కారణం-అగ్ర కథానాయకులు ఇద్దరూ 'జమునతో నటించం' అని ఆ పీరియడ్‌లో భీష్మించుకుని కూర్చోవటమే. కానీ అదే చిత్రం హిందీలో వచ్చినప్పుడు ఆ అవకాశం జమునను వరించింది. ఉషాకిరణ్ వారు తీసిన 'డాడి -డాడీ' చిత్రంలో పాత్ర పరంగా అక్కినేని జీవితానికి సంబంధించిన ఫ్లాష్ బ్యాక్ కథలో బ్లాక్ అండ్ వైట్ లో కనిపించే సన్నివేశాలన్నీ ఈ 'భార్యాభర్తలు' నుంచి వాడుకున్నవే. కృష్ణకుమారి కనిపించే ఫ్రేముల్ని కట్ చేసి జయసుధ క్లోజప్స్‌ని బ్లాక్ అండ్ వైట్ లో షూట్ చేసి చాలా సమర్థవంతంగా మిక్స్ చేయటం జరిగింది.

మళ్ళీ మ్యూజిక్‌లోకి వస్తే ఈ 'భార్యాభర్తలు' చిత్రాన్ని చూసే అవకాశం ఉంటే టైటిల్స్ చూపిస్తున్నప్పుడు వచ్చే మ్యూజిక్‌ని గమనించండి. అక్కడ వచ్చే మ్యూజిక్‌లో 'హలో హలో అమ్మాయి'(ఇద్దరు మిత్రులు) పాటలోని 'ఆడపిల్ల అలిగినచో వేడుకొనడు అబ్బాయి' అనే లైన్ యొక్క ట్యూన్ వినిపిస్తుంది. ఆ లైన్‌కు మూలం 'షె యిక్ ఆఫ్ షికాగో' అనే ఇంగ్లీష్ పాట. ఆ తర్వాత ' ఎ ముస్తాఫా ' అనే పాట. జాబ్ అజామ్ ఆర్కెస్ట్రా అండ్ కోరస్ ఆధ్వర్యంలో వచ్చింది. ఇది కూడా అదే వరసలో ఉంటుంది. కాకుంటే 'ఎ ముస్తాఫా' పాటలో భాష ఇంగ్లీష్ కాదు. కానీ ఈ 'షెయిక్ ఆఫ్ షికాగో' కన్నా 'ఎ ముస్తాఫా' యే బాగా హిట్ అయింది. ఆ ప్రభావం 'భార్యాభర్తలు' టైటిల్ మ్యూజిక్‌లోనూ, 'ఇద్దరూ మిత్రులు' లోని 'హలో హలో అమ్మాయి' పాటలోనూ మనకు తెలుస్తుంది.

కొన్ని కొన్ని పాటలను వినడం, సాధన చెయ్యడం ఒక ఎత్తయితే అధ్యయనం చేయటం మరొక ఎత్తు. అటువంటి అధ్యయనాలు మనల్ని మరింత ఎత్తులకు తీసుకువెళతాయి. అటువంటి అనుభూతిని 'భార్యాభర్తలు' చిత్రంలోని పాటలు కలిగిస్తాయి. ■

**రచన: ఆరుద్ర** **గానం: ఘంటసాల**

భూమ్మీద సుఖపడితే తప్పులేదురా
బులబాటం తీర్చుకుంటే తప్పులేదురా ॥ భూమ్మీద ॥
పరలోకంలో దొరికేఅమర సుఖాలు -ఈ
నరలోకంలో పొందిన ముప్పులేదురా .....
ముప్పు లేదురా ముప్పు లేదురా ముప్పు లేదురా
తప్పేలేదురా తప్పేలేదురా తప్పేలేదురా
చచ్చేక దొరికే ఆ రంభకన్నా - ఇప్పుడు
నచ్చినట్టి నెరజాణే భల్ అన్నులమిన్న
ఒక్కలాంటి వాళ్ళురా జాజిపూవ్వూ ఆడపిల్లా
వాడిపోకముందే వాటిని అనుభవించరా...
తప్పేలేదురా తప్పేలేదురా తప్పేలేదురా
అరకు రాణి గుండె తలుపు తట్టుతూందిరా - నువ్వు
ఆలస్యం చేయకుండ ఆట ఆడరా-
మధువు ముందు అమృతంలో మహిమలేదురా -ఈ
మధువును కాదన్న వాడు మనిషి - కాదురా -మనిషే కాదురా
మనిషే కాదురా మనిషే కాదురా మనిషే కాదురా

**రచన: ఆరుద్ర** **గానం: ఘంటసాల**

హవ్వారే హవ్వా హైలేసో సో సో ..........దాని
యవ్వారమంతా హైలేసో....
పచ్చిమిరపకాయలాంటి పడుచు పిల్లరోయ్
దాని పరువానికి గరువానికి పగ్గమేయరో...
వగలమారి చెప్పరాని పొగరు మోతురోయ్...ఆ
వన్నెలాడి వుడుక్కుంటే వదలమోకురోయ్... ॥హవ్వారే॥
ఇంటికెడితే నిన్ను చూచి నవ్వుతుందిరోయ్ - దాని
యెంటబడితే కంటబడితే కసురుతుంది రోయ్ -
టక్కరి టెక్కులపిల్ల పడవయెక్కెరోయ్ -
టెక్కంతా ఎగిరిపోయి ఎక్కి ఎక్కి ఏడ్చెరోయ్
ఓయ్ ఓయ్ హోయ్ ॥హవ్వారే॥
చూడబోతే అవ్వాయి చువ్వలాంటిదోయ్ -జోడు
కూడబోతే కులుకులాడి గువ్వలాంటిదోయ్
జాంపండులాంటి గుంట జట్టుకట్టరో -అది
జారిపోతే దారికాసి పట్టు పట్టరోయ్ ॥హవ్వారే॥

**రచన: సి. నారాయణరెడ్డి** **గానం: పి. సుశీల**

తోటలోకి రాకురా తుంటరితుమ్మెదా, గడసరితుమ్మెదా
మామల్లి మనసెంతో తెల్లనిది -అది
ఏ వన్నెలేచిన్నెలెరుగనిది -
కన్నుసైగ చేయకురా
కామినీ చోరా, గోపికాజారా
మా రాధ అనురాగం మారనిది అది
ఏ రాసకేళిలోన చేరనిది ॥తోట॥
జిలుగుపైట లాగకురా
తొలకరి తుమ్మెదా, చిలిపి తుమ్మెదా
కన్నెసిగ్గు మేలిముసుగు వీడనిది -అది
ఇన్నాళ్ళు ఎండకన్నెరుగనిది - ॥తోట॥
రోజు దాటి పోగానే
జాజులు వాడునురా -
మోజులు వీడునురా
కన్నెవలపు సన్నజాజి వాడనిది -అది
ఎన్నిజన్మలైనా వసివాడనిది... ॥తోట॥

**రచన ఆరుద్ర** **గానం: ఘంటసాల, సుశీల**

గుట్టమీద గువ్వ కూసింది
కట్టమీద కవుజు పలికింది
గుడిలోన జేగంట మోగింది
నా గుండెలో తొలివలపు పండింది ॥గుట్ట॥
నల్ల నల్లాని మబ్బు నడిచింది
తెల్లా తెల్లాని అంచు తోచింది
చనువు జలరేకలై వెలిగింది
చల్లా చల్లాని జల్లు కురిసింది...... ॥గుట్ట॥
కొమ్మమీద వాలి గోరింక
కమ్మ కమ్మని ఊసులాడింది
గోరింక తానింక గూడు కట్టకపోతే
కొమ్మా ఎంతో చిన్నబోతుంది
కొమ్మా ఎంతో చిన్నబోతుంది ॥గుట్ట॥
సన్నగాజుల రవళి పిలిచింది
సన్నజాజుల దండ వేచింది
మనసైన జవరాలే వలచింది
మనుగడే ఒక మలుపు తిరిగింది
మనుగడే ఒక మలుపు తిరిగింది ॥గుట్ట॥

**రచన: ఆరుద్ర** **గానం: ఘంటసాల**

టా ! టా! వీడుకోలు
గుడ్ బై ! ఇంక సెలవు
తొలినాటి స్నేహితులారా !
చెలరేగే కోరికలారా ! ॥టాటా॥
ప్రియురాలి వలపులకన్న నునువెచ్చనిదేది లేదని
నిన్నను నాకు తెలిసింది - ఒక చిన్నది నాకు తెలిపింది
ఆ ప్రేమ నగరుకే పోతాను - పోతాను - పోతాను
ఈ కామనగరుకు రాను - ఇక రాను ॥టాటా॥
ఇచ్చటలో వున్న హాయి - వేరెచ్చటనూ లేనే లేదని
లేటుగ తెలుసుకున్నాను - నా లోటును దిద్దుకొన్నాను
ఆ స్నేహ నగరుకే పోతాను పోతాను పోతాను -
ఈ మోహ నగరుకు రాను ఇక రాను..... ॥టాటా॥
మధుపాత్రకెదలో ఇంక ఏ మాత్రం చోటు లేదని......
మనసైన పిల్లే చెప్పింది -నా మనసంతా తానై నిండింది
నే రాగనగరుకే పోతాను
అనురాగనగరుకే పోతాను -పోతాను

**రచన: దాశరథి** **గానం: ఘంటసాల**

వేయి వేణువులు మ్రోగేవేళ
హాయి వెల్లువై పొంగేవేళ
రాసకేళిలో తేలేవేళ రాధమ్మను లాలించే వేళ
నను పాలింపగ నడచీ వచ్చితివా గోపాలా
మొరలాలింపగ తరలీ వచ్చితివా...గోపాలా ॥నను॥
అర చెదరిన తిలకముతో అల్లదిగో రాధమ్మ
అరజారిన పయ్యెదతో అదిగదిగో గోపెమ్మా
ఎరుపెక్కిన కన్నులతో ఇదిగిదిగో సత్యభామ
పొదపొదలో ఎద ఎదలో నీ కొఱకై వెదకుచుండగా ॥నను॥
కంసుని చెఱసాలలో ఖైదీవై పుట్టావు
కాంతల కౌగిళ్లలో ఖైదీవై పెరిగావు
కరకు రాతి గుళ్లలో ఖైదీవై నిలిచావు
ఈ భక్తుని గుండెలో ఖైదీగా వుండాలని
నను పాలింపగ నడచి వచ్చితివా
మొరలాలింపగ తరలీ వచ్చితివా...గోపాలా
నను పాలింపగ నడచి వచ్చితివా

**రచన: కొసరాజు** **గానం: పిఠాపురం & స్వర్ణలత**

అల్లరి పెడతారే పిల్లా అల్లరి పెడతారే అమ్మ మ్మ మ్మ మ్మా
అమ్మగారు పూజల్లో పడితే
అయ్యగారు బేజారయిపోతే ॥అల్లరి॥
పుట్టక పోతారా పిల్లలు !! పుట్టక పోతారా
వుయ్ వుయ్ వుయ్ వుయ్
దేవుడిచ్చిన పిప్పీవుంటే
ఎప్పటికైనా తప్పనిసరిగా ॥పుట్టక॥
మనిషి ప్రయత్నం కావాలే ! కావాలే
దేవుడు సాయం రావాలే ! రావాలే
వారలంటూ వర్జాలంటూ
ఒక్క పొద్దులని వంకలు చెబుతూ
వాయిదాలతో ప్రాణం దీస్తూ
మడిగట్టుక నువ్ కూర్చుంటే ఇక ॥అల్లరి॥
సంతు లేనిదే కొంప మునగదూ వుయ్ వుయ్ వుయ్
సంపాదన కుప్పలుపడిపోదూ వుయ్ వుయ్ వుయ్
జనాభాను తగ్గించాలనీ మన
నాయకులనేది నీకు వినబడదూ ॥పుట్టక॥
గొడ్డు రాలని నిన్నంటారే ! అంటారే
పాపి వీడని నన్నంటారే ! అంటారే
ఎలాగైనా ఒక కాయ గాస్తే
మన ఇద్దరి ని శెహబాష్ అంటారే
అలాగా.......శహభాష్... ॥అల్లరి॥

**రచన: కొసరాజు** **గానం : ఘంటసాల**

మా: జై శ్రీమద్రమారమణ గోవిందో హారి .....నాయనలారా !
బడిలో ఏముందీ దేవుని గుడిలోనే వుంది
భక్తీ ముక్తీ కావాలంటే
మాధవ సేవ చెయ్యాలంటే ॥బడి॥
గో: గుడిలో ఏముందీ బాబూ - బడిలోనే వుంది
భుక్తి శక్తి కావాలంటే
మానవ సేవ చెయ్యాలంటే ॥గుడి॥
గో: దేవుడి పేరిట దోపిడి చేసే
దళారులెందరో పెరిగారూ
ముక్తి ముత్తులో భక్తుల ముంచీ
సర్వం భోంచేస్తున్నారూ
నోరులేని ఆ దేవుడు పాపం
నీరుగారి పోతున్నాడూ ॥గుడిలో॥
మా: చదువుల పేరిట గుమాస్తాలనూ - తయారు చేస్తూవున్నారు
ప్రభువుల్లాగా బ్రతికేవాళ్లను -బానిసలుగ చేస్తున్నారు
ఉద్యోగాలకు వేటలాడమని -ఊళ్లపైకి తోలేస్తున్నారు
గో: చదవక పోతే మనిషి రివ్వునా - చంద్రుని పైకి
ఎగిరే వాడా ? గిర గిర తిరిగివచ్చేవాడా ?
మా: దేవుడు చల్లగ చూడకపోతే అక్కడె
గల్లంతై పోడా - ఆనవాలు చిక్కేవాడా?
మా: చదువుల సారం హరియని
గో: హరికూడా చదవాలని
మా: చదువుల మర్మం హరియని
గో: ఆ హరికీ గురువుండాలనీ
మా: హరియే సర్వస్వమ్మని
గో: చదువే సర్వస్వమ్మనీ
మా: హరిభక్తుడు ప్రహ్లాదుడు మునుపే బల్లగుద్ది చెప్పాడు
గో: ఆ హరియే శ్రీకృష్ణుడుగా వచ్చీ -
బడిలో కూర్చుని చదివాడు
యీ బడిలో కూర్చుని చదివాడు,
చదివాడూ, చదివాడూ, చదివాడూ

# కథా సంగ్రహం

మాధవాచార్యులు (అక్కినేని నాగేశ్వరరావు) శ్రీకృష్ణపురంలోని వేణుగోపాలస్వామి ఆలయంలోని అర్చకుడు. ఆయనకు ఓ చిన్న కొడుకు రంగడు (బేబి బ్రహ్మాజీ) తల్లి కామాక్షమ్మ (శాంతకుమారి) తమ్ముడు గోపాలాచార్యులు (అక్కినేని నాగేశ్వరరావు) ఇదీ ఆయన కుటుంబం.

గోపీగా పిలవబడే గోపాలాచార్యులు బాధ్యతలు పట్టకుండా తిరుగుతుంటాడు. పైగా స్నేహితుల ద్వారా సంక్రమించిన కొన్ని దుర్వ్యసనాలు.

ఆ ఊరి ప్రెసిడెంటు శేషాద్రి(నాగభూషణం) తన చెల్లెలు కావేరమ్మ (కె టి రుక్మిణి) పొలం వ్యవహారాలు, ఆస్తిపాస్తులు చూస్తూ అందినంతవరకు కాజేస్తూ ఉంటాడు. కావేరమ్మ కూతురు రాధ(విజయనిర్మల)ని తన కొడుకు కృష్ణప్రసాద్ (కృష్ణంరాజు)కి ఇచ్చి పెళ్ళి చేస్తే మొత్తం ఆస్తినంతటినీ కొట్టెయ్యొచ్చని అతని పన్నాగం.

కానీ గోపీ, రాధ ఒకరికొకరు పరిచయమయ్యారు. మనసులు ఇచ్చిపుచ్చుకున్నారు. రాధతో పరిచయం వల్ల గోపీ తన చెడుసావాసాలను మానుకున్నాడు. మంచి వాడయ్యాడు. ఇది శేషాద్రికి కంటగింపయింది. మొదట్నించీ తన ఆగడాలను ఎదుర్కొంటూ అడ్డొస్తున్న గోపీ ఇలాగ కూడ తనకు ఎదురు రావటం భరించలేక పోయాడు. సరియైన సమయం కోసం వేచి చూడసాగేడు.

గోపీ తమకి దూరమైపోతున్నాడన్న బాధతో పాత స్నేహితులంతా కలసి 'ఈ ఒక్క రోజు మాతో గడపమ'ని బ్రతిమాలి అతడిని తమ పార్టీకి తీసుకుపోతారు. అదను కోసం ఎదురు చూస్తున్న శేషాద్రి తన చెల్లెలు కావేరమ్మను, మేనకోడలు రాధను తీసుకువచ్చి, పార్టీలో స్నేహితులతో తాగి పడిపోయిన గోపీని చూపించాడు. రాధ మనసు విరిగిపోయింది. గోపీ తనకిచ్చిన ఉంగరాన్ని అక్కడే పడేసి వెళ్ళిపోయింది. తెలివి తెచ్చుకున్న గోపీ ఎంత బ్రతిమాలినా తన ఇంటి తలుపు తియ్యలేదు.

శేషాద్రి అంతటితో ఆగలేదు. అన్నదమ్ముల మధ్య చీలిక తెచ్చాడు. ఫలితంగా గోపీ తను ఉంటున్న ఇంటిని వదిలి తన తాతల కాలం నాటి పాడు పడ్డ కొంపలో ఉండసాగేడు. ఊళ్ళో గల పాఠశాలకు ప్రభుత్వం వారిచ్చిన నిధులు స్వాహా చేసి అవకతవకగా నడుపుతున్న శేషాద్రి ఆట కట్టించడానికి తన పాడు పడ్డ భవనాన్నే బడిగా మార్చదలిచాడు గోపీ. ఇందుకు ఆగ్రహించిన శేషాద్రి గుడిలో నగలు కాజేసి ఆ నేరం గోపీపై నెడతాడు. నిరూపణ కోసం గోపీ ఉంటున్న పాడు బడిన ఇంటిని తవ్వగా తాతల కాలం నాటి జవహరీ బైటపడుతుంది.

ఆ ధనం మాధావాచార్యులు, గోపీల ఉమ్మడి ఆస్తి కనుక గుడి కోసం వెచ్చిస్తానని అన్నగారు, బడికోసం వినియోగిస్తానని తమ్ముడు వాదించుకుంటారు. ఈ రూపంగా జనాల్ని తన వైపు తిప్పుకోవచ్చునని 'ఎన్నికలు పెట్టి ప్రజల్నే అడుగుదాం' అంటూ కొత్త ఎత్తు వేస్తాడు శేషాద్రి. అమాయకుడైన మాధావాచార్యులు ప్రజలకు దేవునిపై విశ్వాసం కలిగించటం కోసం 'నేటి రాత్రి ఆలయ గోపురం మీదున్న కలశం పైకి లేస్తుందని, అలా జరగని పక్షంలో తను మరణిస్తాన'ని ప్రకటిస్తాడు. అన్నగారి ప్రాణాలు కాపాడ్డం కోసం గోపీయే ఆ కలశాన్ని ఎవ్వరూ చూడకుండా ఎత్తి, అన్న మన్ననలను చూరగొంటాడు. శేషాద్రి నిజస్వరూపం బైటపెట్టి ఆయన కళ్ళు తెరిపిస్తాడు. బడిపంతులు కోదండరామయ్య (భానుప్రకాష్) గారమ్మాయి కస్తూరి (సంధ్యారాణి) ని, ఇటు రాధని ఏక కాలంలో మోసం చెయ్యాలనుకున్న కృష్ణప్రసాద్ ఆట కూడా కట్టిస్తాడు.

గోపీ మంచితనాన్ని గ్రహించిన కావేరమ్మ తన కూతురు రాధతో గోపీ పెళ్ళికి ఒప్పుకుంటుంది. మాధవాచార్యులు కూడా ఆ నిధిని బడికి ఉపయోగించడానికే ఒప్పుకుంటాడు. అపార్థాలు తొలగి అందరూ ఒకటవుతారు.



బాపు



కె.వి.మహదేవన్



ఆరుద్ర



కొసరాజు



దాశరథి



డా॥ సి.నారాయణరెడ్డి



ఘంటసాల



పి.సుశీల



పిఠాపురం



స్వర్ణలత

## తారాగణం

పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు, నాగభూషణం, విజయనిర్మల, శాంతకుమారి, సూర్యకాంతం, సంధ్యారాణి, మీనాకుమారి, కృష్ణంరాజు, రుక్మిణి, బేబీ బ్రహ్మాజీ, భానుప్రకాష్, సాక్షిరంగారావు, చలపతిరావు, అశోక్ కుమార్, విజయచందర్, దేవదాసు, రాజు, మురళీమోహన్, ముద్దుకృష్ణ తంబి , సుబ్బారావు పంతులు

అతిథి నటులు : గుమ్మడి, శోభన్‌బాబు

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ, మాటలు | : ముళ్ళపూడి వెంకటరమణ |
| సంగీతం | : కె.వి. మహదేవన్ |
| పాటలు | : ఆరుద్ర, కొసరాజు, డా॥సి.నారాయణరెడ్డి, దాశరధి |
| డైరెక్షన్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : ఎస్. వెంకటరత్నం W.I.C.A |
| కూర్పు | : ఎ. సంజీవి |
| కళ | : జి.వి. సుబ్బారావు |
| మేకప్ | : కె. నరసింహారావు,రమేష్ |
| దుస్తులు | : కె. సూర్యారావు , రాము |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : ఎస్. చిట్టిబాబు |
| స్టిల్సు | : రూప |
| పబ్లిసిటీ | : ఈశ్వర్ |
| ప్రెస్ పబ్లిసిటీ | : లక్ష్మీ ఎడ్వర్‌టైజర్స్ |
| ప్రెస్ రిలేషన్ | : కల్పన ఎంటర్ ప్రైజెస్ |

### రికార్డింగ్

| | |
|---|---|
| సంభాషణలు | : ఎ. కృష్ణన్, కృష్ణంరాజు, గోఖలే(శ్రీసారధీ స్టూడియోస్ ) |
| పాటలు | : ఎ.ఆర్. స్వామినాథన్ (విజయాగార్డెన్స్) వేదమూర్తి (శారదా స్టూడియోస్) |
| రీరికార్డింగ్ | : ఎ.ఆర్. స్వామినాథన్ (విజయాగార్డెన్స్) |
| ప్రాసెసింగ్ | : రాజన్న (శ్రీసారధీ స్టూడియోస్ ) |
| సెట్టింగ్స్ | : రామచంద్రరావు |
| పెయింటింగ్ | : ఆంథోని (శ్రీ సారధీ స్టూడియోస్) |
| స్టంట్సు | : రాఘవులు, వేలు, కుమార్ |
| ట్రావెల్ | : ట్రేడ్ వింగ్స్ |
| స్క్రీన్ ప్లే & డైరెక్షన్ | : బాపు |
| నిర్మాత | : ఎన్. ఎస్. మూర్తి |
| స్టూడియో | : శ్రీ సారధీ స్టూడియోస్, హైద్రాబాద్ |
| అవుట్‌డోర్ ఎక్విప్‌మెంటు | : ప్రసాద్ ప్రొడక్షన్స్ మద్రాసు |

### సహాయకులు

| | |
|---|---|
| సంగీతం | : పుహళేంది |
| కెమెరామెన్ | : ఎ.ఆర్. కె. మూర్తి |
| కూర్పు | : రామచంద్రయ్య, సుబ్రహ్మణ్యం |
| కళ | : ఎ.వి. కృష్ణమూర్తి |
| మేకప్ | : కె.వి. రమణ, రాము, సుబ్బరావు,సత్యం |
| దుస్తులు | : నూకరాజు, పులిరాజు |
| ప్రొడక్షన్ | : జి.వి. రామకృష్ణ, కె. ప్రసాద్, సుబ్రహ్మణ్యం, తంబి, కృష్ణ |
| రీరికార్డింగ్ | : కె. మధుసూధనరావు, కె. నారాయణ |
| డైరెక్షన్ | : భీమేశ్వరరావు, డి.ఎస్. ప్రకాశరావు, వి.ఎస్. బోస్ |
| నేపథ్యగానం | : ఘంటసాల, సుశీల, పిఠాపురం, స్వర్ణలత, |
| నృత్యాలు | : తంగప్ప |
| సహాయకులు | : తార, రాజు, కైలాసం |

